నానరపాలక సూనులు దక్షున
కరయంగ మున్నీశ్వరాపరాధ
మునఁ బ్రాప్తమైనట్టి జనపాలజన్మంబు
నకుఁ గారణం బైన నలిననయన

తే॥ నాదరంబునఁ గమలజునాజ్ఞఁ జేసి
కడఁక దీపింప విధివత్ప్రకారమునను
వరుస నందఱుఁ గూడి వివాహ మైరి
గడవ వచ్చునె దైవసంకల్ప మెందు. 943

క॥ కలదే*జగతింబదురన్య
పులకిల నొకభార్యయొందు బొసఁగునె వినఁగా
నలినోదరు ఘనమాయా
కలితాద్భుతములకు నతులు గావింపఁ దగున్. 944

వ॥ అంతఁ జాక్షుషమన్వంతరంబున దైవచోదితుండై యిష్టప్రజాసర్గంబు గావించుచుఁ బ్రసిద్ధుఁడైన దక్షుండు పూర్వదేహంబు గాలవిద్రుతం బగు చుండం బ్రచేతసులకు నమ్మారిష యను భార్యయందు సంభవించి నిజకాంతిం జేసి సమస్తతేజోధనుల తేజంబును [1]పిహితంబుగాఁ జేయుచుఁ, గర్మదాక్ష్యంబున దక్షుం డను నామంబువహించి బ్రహ్మచేతం బ్రజాసర్గరక్షయందు నియోగింపంబడి మరీచ్యాదులం దత్తద్వ్యాపారంబులందు నియోగించి యుండె. అంత. 945

## అధ్యాయము ౩౧.

సీ॥ ఓనరఁ బ్రచేతసు లుత్పన్నవిజ్ఞాను
లగుచు వేగంబ నారాయణోక్తిఁ
దలఁచుచు నాత్మనందనుకడ నిజభార్య
నిడి వనవాసులై కడఁగి మున్ను

* యొందుఁబదుగురు.

1 పిహితంబు = కప్పబడినది.

జాబలి యనుమునీశ్వరుఁడు సిద్ధుఁడైన
భూరిపశ్చిమవార్ధి తీరమునను
సర్వభూతాత్మ విజ్ఞానంబు గలయాత్మ
ఘనవిమర్శకృతసంకల్పు లైరి

తే॥ యంత నచటికి సమ్మోద మతిశయిల్ల
నరసురాసురయక్షకిన్నరవరేణ్య
మానితోన్నతసంపూజ్యమానుఁడైన
నారదుండు వివేకవిశారదుండు. 946

వ॥ చనుదెంచి నిర్జితప్రాణమనోవాగ్దర్శనులును జితాసనులును శాంతులును నసమానవిగ్రహులును నిర్మలంబైన పరబ్రహ్మంబు నందు నియోజితంబైన యంతఃకరణంబు గలవారును నైన రాజనందనులకడ నిలిచిన. 947

క॥ చనుదెంచిన నారదమునిఁ
గనుఁగొని నృపసుతులు లేచి కౌతుక మొప్పన్
వినమితులై సముచితపూ
జనములఁ బరితుష్టుఁ జేసి సద్వినయమునన్. 948

చ॥ అనఘ! మునీంద్రచంద్ర! భవదాగమనంబు సమస్తలోకశో
భనమగు; నస్మదీయమగు భాగ్యవశంబున నేఁడు విశ్వపా
వన నినుఁ జూడఁ గంటి; మనివార్య[2]భవద్భ్రమణంబు [3]లోకలో
చనుగతివోలెఁ బ్రాణులకు సర్వభయాపహరంబు గావునన్. 949

వ॥ అని మఱియు నిట్లనిరి. 950

సీ॥ అనఘాత్మ! భగవంతులైన కేశవవామ
దేవులచే నుపదిష్టమైన
యాత్మతత్త్వంబు గృహస్థుల మగుమాకు
ననయంబు విస్మృతం బయ్యె, నట్టి

2 తమ సంచారము, 3 సూర్యుని సంచారమువలె.

కలితతత్త్వార్థప్రకాశకంబును భూరి
ఘోరసంసారాబ్ధితారకంబు
నైన కర మొప్పారు నాత్మతత్త్వము నేఁడు
చిరదయామతిఁ బ్రకాశింపఁ జేయు

తే॥ మని ప్రచేతసు లర్థిఁ బల్కినఁ జెలఁగి
భగవదాయత్తచిత్తుండు భవ్యగుణుఁడు
నఖిలలోకవిహారుండు నైనయట్టి
నారదుఁడు వల్కె నా రాకుమారులకును. 951

సీ॥ చర్చింప నరుల కీ జన్మకర్మాయుర్మ
నోవచనంబుల దేవదేవుఁ
డఖిలవిశ్వాత్మకుం డైన గోవిందుండు
విలసిల్లు భక్తి సేవింపఁబడిన
నవియ పో జన్మకర్మాయుర్మనోవచ
నములను ధరణి నెన్నంగఁ దగును
వనరుహనాభసేవారహితములైన
జననోపనయనదీక్షాకృతంబు

తే॥ లైనజన్మంబు లేల? దీర్ఘాయు వేల?
వేదచోదిత యగుకర్మవితతి యేల?
జపతపశ్శ్రుతవాగ్విలాసంబు లేల?
మహితనానావధానసామర్థ్యమేల? 952

వ॥ మఱియు హరివిరహితం బైనయింద్రియపాటవంబును నిపుణ యైన బుద్ధియు బ్రాణాయామాదియోగంబును దేహాదివ్యతిరిక్తాత్మజ్ఞానంబును సన్న్యాసాధ్యయనంబులును దక్కిన వ్రతవైరాగ్యాదిశ్రేయస్సాధనంబులును నేల? సర్వేశ్వరుండును సమస్తశ్రేయస్స్వరూపుండును సమస్త శ్రేయోవధిభూతుండును సర్వభూతావాసుండును సర్వభూతాత్మప్రదుండును సర్వభూతప్రియుండును సర్వవ్యాపకుండునుం గావున. 953

మ॥ కమలాధీశ్వరుఁ బూజ సేయుట సమగ్రప్రీతిఁ [1]ప్రాణోపహా
రము సర్వేంద్రియ తృప్తి హేతువును, సర్వక్ష్మాజమూలాభిషే
కము శాఖా[2]భుజపుష్టిదంబు, నగు రేఖన్ సర్వదేవార్చన
క్రమమై యొప్పు ధరావరేణ్యసుతులారా! బుద్ధి నూహించినన్. 

వ॥ అదియునుం గాక. 955

క॥ పెను పగు వర్షాకాలం
బున దిననాయకునివలనఁ బొడమిన సలిలం
బనయముఁ గ్రమ్మఱ గ్రీష్మం
బున సూర్యునియందు డిందు పోలిక మఱియున్. 956

క॥ ధరణిఁ జరాచరభూతము
లరయఁగ జనియించి యందె యడఁగినపగిదిన్
హరిచేఁ బుట్టినవిశ్వము
హరియందె లయంబు నొందు నది యెట్లన్నన్. 957

మ॥ అరుదానభ్రతమఃప్రభల్ మునునభం బందొప్పఁగాఁదోఁచియున్
మరలం జూడఁగ నందె లేనిగతి, బ్రహ్మాండము నీశక్తులుం
బరికింపం ద్రిగుణప్రవాహమున నుత్పన్నంబులై, క్రమ్మఱన్
విరతిం బొందుచు నుండుఁ గావున హరిన్ విష్ణున్ భజింపందగున్.

వ॥ మఱియును సమస్తదేహులకు నాత్మయు నిమిత్తభూతుండును నద్వితీయుండును శశ్వత్ప్రకాశుండును ప్రధాన పురుషుండును స్వతేజోవిధ్వస్తగుణప్రవాహుండును మానసబుద్ధిసుఖేచ్ఛా ద్వేషాదివికల్పరహితుండును సగుణుండును దేహాత్మభ్రమ నివృత్త్యుపలభ్యుండును నాదిమధ్యాంతరహితుండును నిత్యానంద స్వరూపుండును సర్వజ్ఞుండును బరమేశ్వరుండును నైన నారాయణు నభేద బుద్ధిం జేసి భజింపుఁడు. అతండు సర్వభూతదయాళువులును, నెంతమాత్రంబు సంభవించు నంతమాత్రంబున

1 వాయుభక్షణము, 2 భుజ = చెట్టు మొదలులోని భాగములు.

సంతుష్టచిత్తులును, సర్వేంద్రియోపశాంతులును నగు పురుషుల యెడ సంతుష్టుండగునని వెండియు నిట్లనియె. 959

చ॥ చతురతనట్టి యీశ్వరుఁడు సజ్జనలోకనిరస్తసర్వకా
మితవిమలాంతరంగమున మిశ్రితభావనఁజేసి [1]సన్నిధా
పితుఁ డగుచుం దయాకరగభీరగుణంబులఁ జాల నొప్పి యా
శ్రితజనపారతంత్ర్యమును జేకొని పాయకయుండు నిచ్చలున్. 960

క॥ [2]శ్రుతధనకులకర్మసము
న్నతమదములఁ జేసి సజ్జనప్రతతికి సం
తతమును నెగ్గొనరించు కు
మతులర్థిం జేయుపూజ మతిఁగొనఁ డెందున్. 961

వ॥ అది యెట్లనిన. 962

సీ॥ వల నొప్పఁదను ననువర్తించు నిందిరా
కామినీమణిఁ దదాకాంక్షులగుచు
ధృతి ననువర్తించు దేవేంద్రముఖ్యుల
నైన నెవ్వఁడుచూడఁ, డాత్మ నట్టి
నిత్యస్వతంత్రుని నిజభక్తవరదుని
దీనవత్సలు గుణాధీశు నజునిఁ
బురుషోత్తముని జగద్భరితు సర్వేశ్వరు
నారాయణునిఁ జిదానందమయుని

తే॥ నజితు నచ్యుతుఁ బుండరీకాయతాక్షుఁ
దవిలి సేవింపకుండునే ధర రసజ్ఞుఁ
డైన పురుషుండు ? సమ్మోదితాత్ముఁ డగుచుఁ
జారుమతులార ! రాజకుమారులార ! 963

వ॥ అని మఱియు నిట్లనియె; భవదీయవంశధుర్యుండుఁ జిత్రరథుండు నగు ధ్రువుండు సపత్నీమాతృవాగ్బాణభిన్నహృదయుండై పంచ

---

1 చేర్పఁబడినవాఁడు, 2 శ్రుత = పాండిత్యము (వినికిడి).

వర్షార్భకుం డగుచుఁ దపోవనంబున కరుగునపుడు మార్గంబున నాచే నుపదిష్టంబైన క్రమంబున భగవంతుం డగు పుండరీకాక్షు నారాధించి యితరులచే నొందరాని సర్వోత్తమంబగు పదంబు నొందె. కాన మీరును రుద్రోపదేశక్రమంబున సర్వభూతాంత ర్యామి యగు నీశ్వరు భవచ్ఛేదంబునకై భజియింపుఁడు. 964

క॥ అని యివ్విధమున నారద
ముని రాజకుమారులకును ముదముదలిర్పన్
వనజోదరుసచ్చరితము
వినిపించి సరోజభవుని వీటికిఁజనియెన్. 965

వ॥ ఇట్లు నారదుండు సనిన యనంతరంబ. 966

చ॥ నరవరనందనుల్ గడఁక నారదవక్త్రవినిర్గతంబు సుం
దరమును మంగళావహము ధన్యము లోకమలాపహంబునై
పరఁగిన విష్ణుసద్యశము భక్తి నుతించి ముకుందచింతనా
నిరుపమభక్తిఁజెంది హరినిత్యపదంబును బొంది రన్నతిన్. 967

వ॥ అని మైత్రేయుండు విదురున కిట్లనియె. మహాత్మా! నీవు నన్నడిగిన ప్రచేతోనారదసంవాదరూపంబైన హరికీర్తనంబు మనుపుత్రుం డైన యుత్తానపాదుని వంశప్రకారంబును జెప్పితిని. అని వెండియు నిట్లనియె. నారదువలనం బ్రియవ్రతుం డాత్మవిజ్ఞానంబు నొంది మహీమండలంబుఁ బరిపాలించి యనంతరంబునఁ బుత్రులకు రాజ్యంబుఁ బంచియిచ్చి పరలోకగతుండయ్యె. అనిన. 968

క॥ విని విదురుం డామునివరు
ఘనచరణము లాత్మమస్తకంబున మధుసూ
దను చరణాంభోరుహములు
మనమునఁ దగఁదాల్చి పలికె మైత్రేయునితోన్. 969

క॥ మునినాథచంద్ర! కరుణా
వననిధి! నీచేత భక్తవత్సలుఁడగు నా

వనజాక్షు తత్త్వమెఱిఁగితి
నని తత్పదములకు వినతుఁడై వినయమునన్. 970

క॥ ఆమునిచే నామంత్రితుఁ
డై మనమున బంధుదర్శనాకాంక్షితుఁడై
ధీమహితుఁడైన విదురుఁడు
సామజపురమునకుఁజనియె సమ్మదమొప్పన్. 971

క॥ అని శుకుఁడు పరీక్షిత్తున
[1]కనుకంపం జెప్పె నీ యుపాఖ్యానంబున్
వినువారు ఐశ్వర్యాయు
ర్ధనకీర్తిస్వస్తిగతులఁ దగఁ బ్రాపించున్. 972

క॥ అని శుకయోగి పరీక్షి
జ్జనపాలసుధాపయోధిచంద్రున కర్థిన్
వినిపించిన కథ మోదం
బున సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పెన్. 973

చ॥ సరసవచోవిలాస! గుణసాగర! సాగరమేఖలామహీ
భరణధురంధర ప్రకటభవ్యభుజాభుజగేంద్ర! రాజశే
ఖర! ఖరదూషణప్రముఖగాఢతమఃపటలప్రచండభా
స్కర! గరకంఠకార్ముకవిఖండనఖేలన! భక్తపాలనా! 974

క॥ శరవిదళితసారంగా!
సరసదయాపాంగ! భక్తజలధితరంగా!
దురితధ్వాంతపతంగా!
వరజనకసుతానుషంగ! వననిధిభంగా! 975

మాలిని॥ స్ఫురదమితవిదారీ! సుందరీశంబరారీ!
సరసవినుతసూరీ! సర్వలోకోపకారీ!
నిరుపమగుణహారీ! నిర్మలానందకారీ!
గురుసమరవిహారీ! ఘోరదైత్యప్రహారీ! 976

---

1 అనుకంపన్ = దయచేత.

గద్యము॥ ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్యపోతనామాత్యప్రణీతం బైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు స్వాయంభువమనువునకు నాకూతి దేవహూతిప్రసూతిప్రియవ్రతోత్తానపాదులు జన్మించుటయు, నందు నాకూతిని రుచిప్రజాపతికి నిచ్చుటయు, నారుచిప్రజాపతికి నాకూతిదేవియందు శ్రీవిష్ణుమూర్త్యంశజుండైన యజ్ఞుండును లక్ష్మీకళాంశజ యగు దక్షిణ యనుకన్యకయు నుద్భవించుటయు, మనుపుత్త్రియైన దేవహూతినిఁ గర్దమున కిచ్చుటయుఁ, బ్రసూతిం దక్షప్రజాపతి కిచ్చుటయుఁ, బ్రసూతి దక్షులవలనం బ్రజాపరంపరలు గలుగుటయు, మఱియుం గర్దమప్రజాపతి పుత్త్రికాసముదయంబును క్షత్త్రిబ్రహ్మర్షుల కిచ్చుటయుఁ, గర్దమపుత్త్రియైన కళవలన మరీచికిఁ గశ్యపుం డను పుత్త్రుండును బూర్ణిమ యను కూఁతునుం బుట్టుటయును, బూర్ణిమవలన గంగయు విరజుం డనెడు కుమారుండును జన్మించుటయుఁ, గశ్యప ప్రజాపతివలన నయిన ప్రజాపరంపరలచే ముల్లోకంబు లాపూర్ణంబు లగుటయు, నత్త్రి మహాముని తపంబును, నతనికి హరిహరబ్రహ్మలు ప్రత్యక్షం బగుటయు, ననసూయాపాతివ్రత్యమాహాత్మ్యంబువలన ననసూయాత్రులకుం ద్రిమూర్తులకళాంశజులయిన చంద్రదత్తాత్రేయదుర్వాసుల జన్మంబును దక్షాత్మజల జన్మంబును, భృగువువలన ఖ్యాతి యనునంగనకు శ్రీమహాలక్ష్మి జన్మించుటయును, భృగుపౌత్త్రుండయిన మార్కండేయు జన్మంబును, ధర్మునకు మూర్తి వలననరనారాయణులుసంభవించుటయును,సత్త్రియాగంబునందు దక్షుండు శివుని నిందించుటయును, దక్షాధ్వరధ్వంసంబును, బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుండు దక్షాదుల ననుగ్రహించుటయును, దక్షాదికృతశ్రీహరిస్తవంబును, శ్రీహరి ప్రసన్నుండై దక్షునియజ్ఞంబు సఫలంబుగా ననుగ్రహించుటయును, సతీదేవి హిమవంతునకు జనించి హరునకుం బ్రాపించుటయు, నుత్తానపాదుని వృత్తాంతంబును, ధ్రువోపాఖ్యానంబును, ధ్రువుండు దండ్రి

చేత నవమానితుండై నారదోపదేశంబున మధువనంబునకుం జని తపంబు సేయుటయును, హరిప్రసన్నుండై యతని మనోరథంబు లిచ్చుటయును, నతండు మరలఁ బురంబునకు వచ్చుటయుఁ, గుబేరానుచరులైన యక్షులతోడి యుద్ధంబును, ధ్రువుండు యజ్ఞంబులు సేయుచు రాజ్యభోగంబులం దనిసి తనయునుత్కలునిం బట్టంబుగట్టి హరియనుగ్రహంబును ధ్రువక్షితిని నిలుచుటయు, నుత్కలుండు వత్సరుండను తనసుతునిఁ బట్టంబుగట్టి హరిం జేరుటయు, వత్సరుని వంశపరంపరయు, నందు నంగుని సుతుం డయిన వేను కళేబరంబు లక్ష్మీనారాయణుల యంశంబున నర్చియుఁ బృథుండును జన్మించుటయుఁ, బృథుండు భూమిం గామధేనువురీతి నఖిలవస్తువులుం బిదుక నియమించి సమస్థలిం జేసి యింద్రుండు వశవర్తియై యుండు బహుయజ్ఞంబులు సేసిన నతనికి హరి ప్రత్యక్షంబగుటయు, నధ్యాత్మ ప్రబోధంబును, నింద్రునివలనఁ బాషండ సంభవంబును, నింద్రుని జయించిన విజితాశ్వుని నతని తమ్ములను బృథివీపాలనంబునకు నిలిపి పృథుండు నర్చియుం బరమపద ప్రాప్తులగుటయు, వసిష్ఠుశాపంబునఁ ద్రేతాగ్నులు విజితాశ్వునికిఁ దనయులై జనియించుటయుఁ, బృథుని పౌత్రుండయిన ప్రాచీనబర్హి రాజ్యంబును, నతనియజ్ఞంబు లసంఖ్యాతంబులైన నారదుండు మాన్పం దలంచి పురంజనుకథ నధ్యాత్మ ప్రపంచంబుగాఁ దెలుపుటయుఁ బ్రాచీనబర్హిసుతులయిన ప్రచేతసులు పదువురకు శ్రీ మహాదేవుండు ప్రత్యక్షంబై హరిస్తవం బుపదేశించుటయుఁ బ్రచేతసుల తపంబునకు మెచ్చి హరి బ్రత్యక్షంబగుటయు, వారికి మారిష వలన దక్షుండు పూర్వకాలంబున శివవిద్వేషప్రయుక్త శాపంబునం బుత్రుండై జనియించుటయును, బ్రచేతసులు ముక్తికిం జనుటయును, విదురుండు మైత్రేయుని వీడ్కొని హస్తిపురంబున కరుగుటయు ననుకథలు గల చతుర్థస్కంధము. 977

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.



శ్రీరస్తు.

శ్రీనివాసపరబ్రహ్మణే నమః

శ్రీమదాంధ్ర

# భాగవతము

## పంచమస్కంధము

### ప్రథమాశ్వాసము



శ్రీకర! కరుణాసాగర!
ప్రాకటలక్ష్మీకళత్ర! భవ్యచరిత్రా!
లోకాతీత గుణాశ్రయ!
గోకులవిస్తార! నందగోపకుమారా! 1

### అధ్యాయము ౧.

వ॥ సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుండగు సూతుండు శౌనకాది మహామునుల కిట్లనియె. 2

క॥ భూనాథుఁ డుత్తరాత్మజుఁ
డైన పరీక్షిన్నరేంద్రుఁ డభిమన్యుసుతుం
డానంద మంది ఘనసు
జ్ఞానుండగు శుకునిఁ గాంచి సరసతఁ బలికెన్. 3

వ॥ మునీంద్రా! పరమభాగవతుండు నాత్మారాముండు నైన ప్రియవ్రతుండు గృహంబున నెట్లు రమించె? కర్మబంధంబులయిన పరా

భవంబులు గల గృహంబుల యందు ముక్తసంబంధులైన పురుషులకు సంతోషంబు గానేరదు. [1]ఉత్తమశ్లోకుండైన పుండరీకాక్షుని పాదచ్ఛాయం జేసి నిర్వృతచిత్తులయిన మహాత్ములు కుటుంబంబునందు నిస్పృహత సేయుదురు గానఁ బ్రియవ్రతునికి సంసారంబునందు దగులంబు గలుగు టెట్లు? దారాగారసుతాదులందుఁ దగులంబు గలవానికి నెట్లు సిద్ధి గలుగు? శ్రీహరియం దస్ఖలితమతి యెట్లు గలుగు? నీ సంశయంబుఁ దేటపఱుపు మని పరీక్షిన్నరేంద్రుం డడిగిన శుకయోగీంద్రుం డిట్లనియె. 4

క॥ హరిచరణాంబుజమకరం
దరసావేశితమనః ప్రధానుం డగు స
త్పురుషుఁ డొకవేళ విఘ్నముఁ
బొరసినఁ దన పూర్వమార్గమును విడువఁ డిలన్. 5

క॥ ధరణీవల్లభ! విను మా
నరవరుఁడు ప్రియవ్రతుండు నారదముని స
చ్చరణోపసేవఁ జెందుచు
నరుదుగ [2]నధ్యాత్మసత్రయాగం బందున్. 6

సీ॥ దీక్షితుండై ధరిత్రీపాలనముఁ దండ్రి
పనిచిన, సుజ్ఞానభంగ మనుచు
నంగీకరింపమి నంతయుఁ దెలిసి ప
ద్మాసనుం డతనికి నతుల రాజ్య
మందుల మిక్కిలి యాసక్తిఁ బుట్టింతు
ననుచును దన చిత్తమందుఁ దలఁచి
[3]తారకా*పరివృతతారాధిపునిమాడ్కి
శ్రుతులతోఁ గూడి యచ్యుతవిభూతి

---

* తారకాద్యనుసృత—అని పాఠాంతరము.

1 మంచికీర్తి గలవాఁడు. 2 అధ్యాత్మ సత్రయాగము = ఆత్మవిచారము చేయుటకుఁ జేయు దీక్షావిశేషము, 3 తారకా = నక్షత్రములతో, పరివృతుఁడు = ఆవరింపఁబడినవాఁడు,

తే॥ హంసవాహనుఁ డగుచు నింద్రాదులెల్లఁ
గదిసి సేవింప బ్రహ్మలోకమున నుండి
సన్మునీంద్రులు దన్నుఁ బ్రశంస సేయ
నల్ల నల్లన [1]నుడువీథి నరుగు దెంచె. 7

వ॥ మఱియు నాయాయి మార్గంబులయందు సిద్ధసాధ్యగంధర్వచారణగరుడకింపురుషు లిరుదెసల స్తోత్రంబులు సేయుచుండ, గంధమాదనద్రోణులం బ్రకాశంబు నొందించుచుఁ జనుదెంచిన పద్మాసనునకు నారదుండు స్వాయంభువప్రియవ్రతులతోఁ గూడి ముకుళితకరకమలుండై యెదురుచనుదెంచి [2]సంస్తుతి స్తబకంబులఁ బూజించిన విరించి సంతసించి ప్రియవ్రతునిం జూచి నవ్వుచు నిట్లనియె. 8

క॥ హరి నాముఖమున నీకును
గర మెఱిఁగింపంగఁ బనిచెఁ గావున నిదె సు
స్థిరమతి విను మంతయు శ్రీ
హరివాక్యముగా నెఱింగి యవనీనాథా! 9

ఆ॥ కోరి వేడ్క నీవు నారదుండును నేను
నందఱమును నీశ్వరాజ్ఞఁ బూని
యుడుగ కెప్పుడుఁ జేయ నున్న వారము గాన
యతని యాజ్ఞఁ దప్ప నలవిగాదు. 10

వ. మఱియు శ్రీహరియాజ్ఞను జీవుండు తపోవిద్యలను యోగవీర్యజ్ఞానార్థధర్మంబులను తనచేత నొరులచేతం దప్పింప సమర్థుండు గాఁడు. ఉత్పత్తి స్థితినాశంబులకు శోకమోహాభయ సుఖదుఃఖంబులకు నీశ్వరాధీనుండ కాని జీవుండు స్వతంత్రుండు గాఁడు. శ్రీహరివాగ్రూపంబు లయిన శ్రుతులందు గుణత్రయం బను రజ్జువున బంధింపంబడిన యస్మదాదులము ముకుఁద్రాటిచేఁ బశువు మనుష్యులకు వశం బయిన చందంబున నీశ్వరాజ్ఞం బ్రవర్తించు

1 నక్షత్ర వీథియందు, 2 స్తోత్రములను గుత్తులచేత.

చుందుము. నరుండు సుఖదుఃఖానుభవంబులకు నీశ్వరాధీనుండు. నేత్రంబులు గలవానిచేతఁ [1]దివియఁబడిన యంధుండునుం బోలె నీశ్వరుం డిచ్చిన సుఖదుఃఖంబు లనుభవించు చున్నవారము. స్వప్నంబునం గన్న పదార్థంబు మేల్కాంచి మిథ్యగాఁ దలంచిన కరణి మోక్షార్థియైన సుజ్ఞానవంతుండు ప్రాప్తసుఖదుఃఖంబు లనుభవించుచు దేహారబ్ధకర్మంబులం బాయ నొల్లండు. వన వాసియైనను జితేంద్రియుండు గాకుండెనేనిఁ గామాదిసహితుం డగుటం జేసి సంసార బంధంబులు సిద్ధించు. గృహస్థాశ్రమంబందు జితేంద్రియుండై యాత్మజ్ఞానంబు గలపురుషునకు మోక్షంబు సిద్ధించు. శత్రువుల గెలువ నిశ్చయించిన పురుషుండు దుర్గం బాశ్రయించి శత్రువుల జయించిన మాడ్కిని మోక్షార్థియగు నీవును గృహాశ్రయుండ వగుచు శ్రీనారాయణచరణారవిందంబు లను దుర్గం బాశ్రయించి [2]యరిషడ్వర్గంబుల జయించి ముక్త సంగుండవై యీశ్వరకల్పితంబు లగు భోగంబుల ననుభవించి ముక్తిం జెందుము. అనినఁ బ్రియవ్రతుండు త్రిభువనగురుం డయిన చతురాననువాక్యంబు లవనతమస్తకుండై బహుమానపూర్వ కంబుగా నంగీకరించె. అంత. 11

ఆ॥ సరసిజాసనుండు స్వాయంభువునిచేత
నధికమైన పూజ లంది, నార
దుండు నాప్రియవ్రతుండును జూడంగఁ
జనియెఁ దనదు పూర్వసదనమునకు. 12

ఆ॥ సత్యసంధుఁడైన స్వాయంభువుం డను
మనువు బ్రహ్మచేత మన్ననఁ దగ
నంది, యంత నారదానుమతంబునఁ
దనదు సుతుని రాజ్యమునను నిలిపె. 13

---

1 ఆకర్షింపఁబడిన, 2 కామక్రోధాదిశత్రువు లాఱింటిని.

వ॥ ఇట్లు స్వాయంభువమనువు భూచక్రపరిపాలనంబునకుం బ్రియ వ్రతునిం బట్టంబుగట్టి విషమంబులగు విషయంబుల వలన విము క్తుండై వనంబునకుం జనియె. అంత. 14

మ॥ధరణీవల్లభుం డా ప్రియవ్రతుఁడు మోదం బందుచుఁ లీల నీ శ్వరవాక్యంబునం గర్మతంత్రపరుఁడై [1]సంగంబులం బాపు శ్రీ హరిపాదాంబుజచింతనం దగిలి నిత్యానందముం బొంది దు ర్భర[2]రాగాదులం బాఱఁదోలి ప్రజలం బాలించె నత్యున్నతిన్.

వ॥ ఇట్లు ప్రియవ్రతుండు రాజ్యంబుసేయుచు విశ్వకర్మప్రజాపతి పుత్రిక యగు బర్హిష్మతి యను దాని బత్నిఁగాఁ బడసి యాసతి వలన శీలవృత్తగుణరూపవీర్యౌదార్యంబులం దనకు సమాను లైన యాగ్నీధ్రేధ్మజిహ్వయజ్ఞబాహుమహావీరహిరణ్యరేతో ఘృతపృష్ఠసవనమేధాతిథివీతిహోత్రకవులను నామంబులు గల పుత్రదశకంబును నూర్జస్వతి యను నొక్క కన్యకను గాంచె. అందుం గవిమహావీరసవనులు మువ్వురు బాలకులయ్యు [3]నూర్ధ్వ రేతస్కులై బ్రహ్మవిద్యానిష్ణాతులై యుపశమనశీలు రగుచుం బారమహంస్యయోగం బాశ్రయించి సర్వజీవనికాయవాసుండు భవభీతజనశరణ్యుండు సర్వాంతర్యామియు భగవంతుండు నగు వాసుదేవుని చరణారవిందావిరతస్మరణానుగతపరమభక్తియో గాను భావంబున విశోధితాంతఃకరణు లగుచు నీశ్వరుతాదా త్మ్యంబు నొందిరి. అంత. 16

సీ॥ వసుధేశ! యా ప్రియవ్రతుఁ డొండు కాంతయం
దధికుల మన్వంతరాధిపతుల
మఱియు నుత్తముఁడు తామసుఁడు రైవతుఁడను
సుతులను బుట్టించె సుమహితులను

---

1 సంగంబు = అంటు, సంబంధము, 2 రాగ + ఆదులన్ = రాగము ద్వేషము మొదలయిన గుణములను, 3 బ్రహ్మచర్యము గలవారు.

మున్ను జన్మించిన ముప్పురు పుత్రులు
నవ్యయ పదవికి నరుగుటయును
నంతఁ బ్రియవ్రతుఁ డఖలశాత్రవకోటిఁ
దనబాహుబలముచేతను జయించి

తే॥ యతఁడు బర్హిష్మతీకాంత యందుఁ బ్రీతి
గలిగి యౌవనలీలావికాసహాస
హేలనాదులఁజిత్తంబు గీలుకొల్పి
గతవివేకుఁడుఁబోలె భోగములఁ బొందె. 17

వ॥ ఇట్లు ప్రియవ్రతుం డేకాదశార్బుదపరివత్సరంబులు రాజ్యంబు సేసి యొక్కనాఁడు మేరునగప్రదక్షిణంబు సేయు సూర్యునకు [1]నపరభాగంబునం బ్రవర్తించు నంధకారంబు నివర్తింపం బూని, భగవదుపాసనాజనితాతిపురుషప్రభావుండై సవితృరథసదృక్షవేగంబుగలిగి తేజోమయంబైన రథంబు నారోహణంబు సేసి రాత్రులనెల్ల దివంబులొనర్తునని సప్తరాత్రంబులు ద్వితీయ [2]తపనుండునుంబోలె నరదంబు వఱపుటయు, నా రథనేమి మార్గంబులు సప్తసముద్రంబులును నా మధ్యభూసంధులు సప్తద్వీపంబులు నయ్యె. అందు. 18

సీ॥ వరుస జంబూప్లక్షవరకుశక్రౌంచముల్
శాకశాల్మలులు పుష్కరము ననఁగ
నలరు నాద్వీపంబు లందు జంబూద్వీప
మొనరంగ లక్షయోజనము లయ్యె
నట నుత్తరోత్తరాయత సంఖ్యఁ దా ద్విగు
ణిత మయి యొండొంటి కతిశయిల్లు
క్షారేక్షురస సురాజ్యక్షీరదధ్యుద
కంబులఁ గలుగు సాగరము లేడు

1 అవ్వలివైపున, 2 సూర్యుఁడు.

తే॥ ద్వీప పరిమాణములు గల్గి విస్తరిల్లు
సంధిసంధిని [1]బరిఖల చందమునను
గ్రమము దప్పక యొండొంటిఁ గలయకుండు
సకలజీవుల కెల్ల నాశ్చర్యముగను. 19

వ॥ అట్టి ద్వీపంబులందుఁ బరిపాలనంబునకుం బ్రియవ్రతుం డాత్మభవులు నాత్మసమానశీలురునైన యాగ్నీధ్రేధ్మజిహ్వయజ్ఞబాహు హిరణ్యరేతోఘృతపృష్ఠమేధాతిథివీతిహోత్రుల నొక్కొకని నొక్కొక్క ద్వీపంబునకుం బట్టంబు గట్టి, యూర్జస్వతి యను కన్యకను భార్గవున కిచ్చిన నాభార్గవునకు నూర్జస్వతి యందు దేవయాని యను కన్యారత్నంబు జనించె. అట్టి బలపరాక్రమవంతుండైన ప్రియవ్రతుండు విరక్తుండై యొక్కనాఁడు నిజగురు వగు నారదుని చరణానుసేవానుపతితరాజ్యాదిప్రపంచసంసర్గంబుఁ దలంచి దుఃఖించి యిట్లనియె. 20

సీ॥ అక్కట! యే నింద్రియములచేఁ గట్టంగఁ
బడి యుండి యందులఁ బాయలేక
యజ్ఞానవిరచితం బగు సర్వవిషయము
లను [2]నంధకూపంబులందు నడఁగి
తరుణులకే [3]వినోదమృగంబనై యుంటి
యవి యెల్ల నే నొల్లననుచు రోసి,
హరికృపచే నప్పు డబ్బిన యాత్మవి
ద్యను గల్గి తనవెంట నరుగుదెంచు

తే॥ కొడుకులకు నెల్ల రాజ్యము గుదురుపఱిచి
తనదు పత్నుల దిగనాడి ధనము విడిచి
హరివిహారంబు చిత్తంబునందు నిలిపి
పరగ నల్లన నారదపదవి కరిగె. 21

1 అగడ్త=కందకము, 2 చీఁకటిగ్రమ్మిన నూతులలో (సంసారమునందు అన్నమాట), 3 ఆటజంతువు.

వ॥ ఇట్లు దనరథమార్గంబులు సప్తద్వీపసాగరంబులుగాఁ జేసి సూర్యునకుఁ బ్రతిసూర్యుండై సరిద్గిరివనాదులచేత [1]భూతనిర్వృతి గోఁ జేసి ప్రతిద్వీపంబునకు నవధులు గల్పించి, ద్వీపవర్షనిర్ణయంబులం బుట్టించి, పాతాళభూస్వర్గాదిసుఖంబులు నరకసమానంబులుగాఁ దలంచి, విరక్తిం బొంది, నిరంతరభగవద్ధ్యానవిమలీకృతాశయుం డగుచు హరిభక్తిప్రియుండైన ప్రియవ్రతుని చరిత్రంబు నీశ్వరునకుఁ దక్క నన్యుల కెఱుంగఁ దరంబుగాదు. అతని మహిమంబులు నేఁడునుం గొనియాడుదురు. అని శుకుండు మఱియు నిట్లనియె.

క॥ హరిసేవ నా ప్రియవ్రతుఁ
డరయఁగఁ గైవల్యపదవినందుట యరుదే
ధరఁ జండాలుం డైనను
హరినామస్మరణఁ జెందు [2]నవ్యయపదమున్. 23

వ॥ అని పలికి శుకుండు మఱియు నిట్లనియె. 24

## అధ్యాయము ౨.

మ॥ జనకుం డిట్లు విరక్తుఁ డైనను దదాజ్ఞం జేసి యాగ్నీధ్రుఁ డే
పున ధర్మప్రతిపాలనుం డగుచు జంబూద్వీప మేలెం దగం
దనసత్పుత్రులమాడ్కి నెల్లప్రజలం దాత్పర్యచిత్తంబునన్
ఘనతం బ్రోచె ననేకకాల మిలఁ బ్రఖ్యాతంబుగా భూవరా!

వ॥ ఇట్లాగ్నీధ్రుండు రాజ్యంబు సేయుచు నొక్కనాఁడు పుత్రకాముండై మందరాద్రి సమీపంబున నఖిలోపచారంబుల నేకాగ్రచిత్తుండై యర్చించినం గమలసంభవుండు సంతసిల్లి, తనసమ్ముఖంబున సంగీతంబు సేయు పూర్వచిత్తి యను నప్సరోంగనం బంపుటయు నా యప్సరోంగన జనుదెంచి రమణీయవివిధనిబిడవిటపివిటపసమాశ్లిష్టసమీపసువర్ణలతికారూఢస్థలవిహంగమమిథునోచ్చార్యమాణషడ్జాదిస్వరంబులచే బోధ్యమానసలిలకుక్కుట

1 భూతముల సంతోషముగో ఁ జేసి, 2 మోక్షమును.

కారండవబకకలహంసాదివిచిత్రకూజితసంకులంబు లయిన నిర్మలోదకకమలాకరంబులు గల తదాశ్రమవనోపవనంబు నందు విహరించుచు విలాసవిభ్రమగతివిశేషంబులం జలనంబు నొందు [1]స్వర్ణచరణాభరణస్వనం బన్నరదేవకుమారుం డాలించి యోగసమాధిం జేసి ముకుళితనేత్రుండై యుండి యల్లన కనువిచ్చి చూచి తన సమీపంబున [2]మధుకరాంగనయుంబోలెఁ బుష్పాఘ్రాణంబు సేయుచు దేవమానవుల మనోనయనంబుల కాహ్లాదంబుఁ బుట్టించుచున్నగతి విహారవినయావలోకనసుస్వరావయవంబుల మన్మథశరపరంపరల నొందించుచు ముఖకమలవిగళితామృతసమానహాసభాషణామోదమదాంధంబు లయిన మధుకరమిథునంబుల వంచించి శీఘ్రగమనంబునం జలించు కుచకచమేఖలలు గల దేవిం గనుంగొని చిత్తచలనంబు నొంది మన్మథపరవశుండై జడుని చందంబున నిట్లనియె. 26

క॥ సతి! నీ వెవ్వతె వీ ప
ర్వతమున కేమేనిఁ గోరివచ్చిన వన దే
వతవో శారదవో రతి
పతి పంచిన మాయవో తపస్సారమవో. 27

ఉ॥ [3]అంగజుఁ డెక్కుడించిన శరాసనముం ధరియించి యంత నా
యంగజువేఁట మానవమృగావళి*నూటిగఁ [4]నేఁచు దానవో
రం గగు నీ నిజాకృతి తెఱం గెఱుఁగంగ నిజంబు పల్కు మా
యంగన! నిన్నుఁ గన్గొనినయంత ననంగుఁడు సందడించెడున్.

క॥ పోలు పగుచున్న విలాసం
బుల నంగజుబాణములను బోలెడి నీ చం
చలసత్కటాక్షవీక్షణ
ముల నెవ్వని నింతి! చిత్తమునఁ గలఁచెదవే? 29

* జూచుచున్న దానవో—అని పాఠాంతరము.

1 కాలిబంగరు నగల చప్పుడు, 2 ఆఁడుతుమ్మెద, 3 మన్మథుఁడు, 4 ఏఁచు దానవో = తొందరపెట్టుచున్న దానవా? (బాధించుచున్నావా? యన్నమాట)

చ॥ చెదరఁగ వేదముల్ సదువుశిష్యులపైఁ దగఁ బుష్పవృష్టి స
మ్మదమున నంతలోఁ గురియుమాడ్కిని మన్మథసామగానముల్
సదివెడుశిష్యులో యనఁగఁ షట్పదపంక్తులు సేరి మ్రోయఁగాఁ
బదపడి మీఁదరాలుఁ గచభారమునందుల జాఱుక్రొవ్విరుల్.

కం॥ *అందియలు [1]టిట్టిభంబుల
చందమునం బాదపంకజంబుల యందున్
అందంద మ్రోయుచును నా
డెందంబునఁ దగిలి సందడించెడిఁ దరుణీ! 31

కం॥ పాయక [2]కదంబపుష్ప
చ్ఛాయంగల వస్త్రకాంతి సల్లెడుఁ గంటే
యాయెడ [3]నితంబరోచులు
గాయుచు నెడ తెగక తఱిమి కప్పెడుఁ దన్వీ! 32

కం॥ నిరతము నీతనుమధ్యము
గర మరుదుగ నరసి చూడఁ గానంబడ దీ
కరికుంభంబులఁ బోలెడి
గురుకుచముల నెట్లునిలుపుకొంటి లతాంగీ! 33

కం॥ పొంకము లగు †తటములపైఁ
గుంకుమపంకంబుఁ బూసికొని వాసనలం
గొంకక వెదచల్లెడు నీ
బింకం బగుచన్నుదోయి పెంపో సొంపో. 34

శా॥ ఏలోకంబున నుండి వచ్చితివి నీవిచ్చోటికిన్? మున్ను నే
నేలోకంబునఁ జెప్పఁ జూప నెఱుఁగన్ నీసుందరాకారము

---

* అందియల వెలయు రత్నము లందంబు దలలిత పదములన్ సుభగములై — అని పాఠాంతరము.

† కుచములపై — అని పాఠాంతరము.

1 టిట్టిభము=తీతువుపిట్ట ("చరణపంకజతిత్తిరీణాం" అనిమూలము), 2 కడిమిపువ్వులు, 3 పిఱుదులయొక్క కాంతులు.

న్నిలాలిత్యము లీవినోదములు నీకెట్లొప్పునే కామినీ!
భూలోకంబున కెట్లు వచ్చితివి నాపుణ్యం బగణ్యంబుగన్ ? 35

క॥ హాసావలోకనంబుల
భాసిల్లెడు నీముఖంబు పలుమఱు నిపుడే
యాసలు పుట్టింపఁగ నే
నాస గొనెద నిన్నుఁ జూచి యంబుజనేత్రా! 36

ఆ॥ [1]కందు లేని యిందుకళ మించినెమ్మోము
కాంతియుక్తమగుచుఁ గానిపించెఁ
గాన విష్ణుకలయు గాఁబోలు నని నామ
నంబునందుఁ దోఁచు నళిననేత్ర! 37

మ॥ పటు[2]తాటంకరథాంగయుగ్మమునకుం బల్మాఱు భీతిల్లుచు
న్నటనం బందెడు గన్ను మీనములతో [3]నాసన్ననీలాలకో
త్కటభృంగావళితో [4]ద్విజావళి లసత్కాంతిన్ విడంబించు [5]మా
ఱటకాసారముఁ బోలె నెమ్మొగము దా రంజిల్లు నత్యున్నతిన్.

చ॥ కరువలిఁ బాయువస్త్రమును గట్ట నెఱుంగవు, చూడ్కి దిక్కులం
బరపుచుఁ జంచరీకముల భాతిఁ జెలంగెడు కంధరంబునం
బొరలెడు ముక్తకేశభరముం దుఱుమంగఁ దలంప, విప్పు డి
ట్లరుదుగ రత్నకందుకవిహారము సల్పెడు సంభ్రమంబునన్. 39

వ॥ మఱియు నిట్లను. తపోధను లగు వారల తపంబులను నీ రూపం
బున [6]నపహ్నవించినదాన వీ చక్కఁదనం బేమితపంబున సంపా
దించితివి నాతోడం గూడి తపంబు సేయుము సంసారంబు వృద్ధిఁ
బొందం జేయుము. పద్మాసనుండు నాకుం బ్రత్యక్షుండై నిన్ను
నిచ్చినవాఁడు గావున నిన్ను విడువం జాలను. నీ సఖీజనంబులు

1 మచ్చ, 2 పటుతాటంక = గట్టి చెవికమ్మలనెడి, రథాంగ = చక్రవాకములయొక్క, యుగ్మమునకున్=జంటకు, 3 ముఖముమీద వ్యాపించిన నల్లని అలకలనెడి తుమ్మెదలతో, 4 పక్షులసమూహము-దంతముల వరుస, 5 రెండవ సరస్సు, 6 అపహ్నవించిన దానవు = విఘ్నము చేసితివి.

నా వాక్యంబులకు ననుకూలింతురు గాక. నీవు చనుకోటికి నన్నుం దోడ్కొని చనుము. అని స్త్రీలకు ననుకూలంబుగాఁ బలుక నేర్చిన యాగ్నీధ్రుండు పెక్కుభంగులం బలికిన నాపూర్వచిత్తియు నతని యనునయవాక్యంబులకు సమ్మతించి వీరశ్రేష్ఠుం డగు నారాజవర్యుని బుద్ధిరూపశీలౌదార్య విద్యావయశ్శ్రీల చేఁ బరాధీనచిత్తయగుచు జంబూద్వీపాధిపతి యగు నారాజశ్రేష్ఠుని తోడంగూడి శతసహస్రసంవత్సరంబులు భూస్వర్గభోగంబు లనుభవించె; అంత నాగ్నీధ్రుం డాపూర్వచిత్తివలన నాభికింపురుషహరివర్షేలావృతరమ్యకహిరణ్మయకురుభద్రాశ్వకేతుమాలసంజ్ఞలు గల కుమారులఁ బ్రతిసంవత్సరంబు నొక్కొక్కనిఁగఁ దొమ్మండ్రం గాంచె. అంత నాపూర్వచిత్తి యాయర్భకుల గృహంబున విడిచి యాగ్నీధ్రుం బాసి బ్రహ్మలోకంబునకుం జనిన నాయాగ్నీధ్ర పుత్రులు మాతృసామర్థ్యంబునం జేసి స్వభావంబునన శరీరబల యుక్తులగుచుఁ దండ్రిచేత ననుజ్ఞాతులై తమ నామంబులఁ బ్రసిద్ధంబు లయినజంబూద్వీపవర్షంబులం బాలించుచుండిరి. అంత నాగ్నీధ్రుండు నాపూర్వచిత్తివలనం గామోపభోగంబులం దృప్తిం బొందక పూర్వచిత్తిం దలంచుచు వేదోక్తంబు లగు కర్మంబులం జేసి[1]తత్సలోకంబగు బ్రహ్మలోకంబునకుం జనియె. ఇట్లు దండ్రి పరలోకంబునకుఁ జనిన నాభిప్రముఖులగు నాగ్నీధ్ర కుమారులు దొమ్మండ్రును మేరుదేవియుఁ బ్రతిరూపయు నుగ్రదంష్ట్రియు లతయు రమ్యయు శ్యామయు నారియు భద్రయు దేవియు ననునామంబులు గల మేరుపుత్రిక లగు తొమ్మండ్రు కన్యకలను వివాహంబైరి. అంత. 40

## అధ్యాయము ౩

—భగవంతుండగు నారాయణుండు ఋషభావతార మెత్తుట—

ఆ॥ నరవరేణ్యుఁ డైన నాభిసంతానార్థ
మంగనయును దాను యజ్ఞ పురుషుఁ

---

1 ఆమెతో సమానమైన లోకము.

డయినవాసుదేవు నతులభక్తిశ్రద్ధ
లను జెలంగి పూజ లొనరఁ జేసి. 41

వ॥ మఱియుం బ్రవర్గ్యసంజ్ఞికంబులగు కర్మంబులు శ్రద్ధావిశుద్ధద్రవ్య దేశ కాల మంత్ర ర్త్విగ్దక్షిణావిధాన యోగంబుల బర మేశ్వరుని మెప్పించిన నెవ్వరికిం బ్రసన్నుండు గాని పుండరీకాక్షుండు భక్తవత్సలుండై సురుచిరావయవంబులతో భజనశీలం బయిన యాతని హృదయంబునందుఁ బాయని రూపంబు గలిగి మనోనయ నానందకరావయవంబులు గల తనస్వరూపం బాతనికిఁ జూపం దలంచి. 42

సీ॥ అంత నావిష్కృతకాంతచతుర్భుజం
బులును బీతాంబరంబును వెలుంగ
శ్రీవత్సకౌస్తుభశ్రీరమాచిహ్నంబు
లురమందు రమ్యమై యిరవుపడఁగ
శంఖచక్రగదాంబుజాతఖడ్గాదిది-
వ్యాయుధంబులు సేతులందు మెఱయ
నతులితనవరత్నహాటకాంకితనూత్న
ఘనకిరీటద్యుతుల్ గడలుకొనఁగఁ

తే॥ గర్ణకుండలకటిసూత్రకనకరత్న
హారకేయూరవరనూపురాదిభూష
ణముల భూషితుఁడైన శ్రీనాయకుండు
దంపతుల కప్పు డెదురఁ బ్రత్యక్షమయ్యె. 43

తే॥ ఇట్లు ప్రత్యక్షమగు పరమేశ్వరునకుఁ
[1]బెన్నిధానంబుఁ గనుఁగొన్న పేదమాడ్కి
హర్షమున ఋత్విగాదికు లవనతాస్యు
లగుచు నభినుతిచేసి రిట్లనుచు నపుడు. 44

[1] పెద్దగనిని.

క॥ పరిపూర్ణుఁడవై యుండియు
మఱవక మాపూజలెల్ల మన్నింతువు నీ
చరణారవిందసేవయు
ధరఁ బెద్దలు వినిచినటులు దగఁ జేసెద మహా. 45

క॥ ఏ మిప్పుడు సేయుసంస్తుతి
నీమహిమ నెఱింగి కాదు నిరతముఁ బెద్దల్
దా మెది యుపదేశించిరో
యామతమునఁ బ్రస్తుతింతు మయ్య! మహాత్మా! 46

వ॥ మఱియు నీవు సంసారాసక్తమతి గలిగినవారికి వశ్యుండవుగావు. ఈశ్వరుండవును బ్రకృతిపురుషవ్యతిరిక్తుండవును బరమపురుషుండవును నయిన నిన్నుఁ బొందని ప్రపంచాంతర్గతంబు లయిన నామ రూపంబులు గల యస్మదాదులచేత నిరూపింప నశక్యంబగు సర్వజీవులం జెందిన దురితసంఘంబుల నిరసించు స్వభావంబుగల నీయుత్తమ గుణంబులందు నేకదేశంబుగాని సర్వగుణ నిరూపణంబు సేయ శక్యంబు గానేరదు. నీభక్తులు మిక్కిలి భక్తిం జేసి సంస్తుతించు గద్గదాక్షరంబులను సలిలశుద్ధపల్లవతులసీదళదూర్వాంకురంబులను సంపాదించినపూజను సంతసిల్లెడి నీకు బహువిధద్రవ్యసంపాదనంబు గలిగి విభవయుక్తంబు లయిన యశ్వమేధాదులును దృప్తికరంబులు గానేరవు. స్వభావంబున సర్వకాలంబులందును సాక్షాత్కరించి యతిశయంబై వర్తించుచు నశేషపురుషార్థస్వరూపంబుఁ బరమానందరూపంబు నైనవాఁడ వగుటం జేసి యజ్ఞాదులయందు నీకుఁ దృప్తిలేక యున్న నస్మదాదుల కోరికల కుపచరించుకతంబున యజ్ఞాదుల నొనరింతుము. అని మఱియు నిట్లనిరి. 47

క॥ [1]బాలిశుల మగుచు మిక్కిలి
నేమె లెఱుఁగని మమ్ము నీదు మించిన దయచేఁ

1 తెలివిహీనులు.

బాలింతు విత్తు వెప్పుడుఁ
జాలఁగ నిహపరములందు సకల సుఖములున్. 48

ఆ॥ ఇపుడు మేము నీకు నిష్టంబు లగుపూజ
లాచరింప కున్న నైన నధిక
మయిన నీకృపాకటాక్షవీక్షణములఁ
జక్కఁజూచి తగఁ బ్రసన్నుఁ డగుచు. 49

క॥ వర మీాయఁ దలఁచి మమ్ముం
గరుణించితి గాక, నిన్నుఁ గనుగొనుటకు నై
యరసి నుతింపగ మాకుం
దర మగునే? వరద! నీరదశ్యామాంగా! 50

వ॥ మఱియు నిస్సంగులై నిశితజ్ఞానంబునం జేసి దోషరహితులై భగ వత్స్వభావులు నాత్మారాములు నగు మునులకు స్తుతియింపఁ దగిన గుణంబులు గలవాఁడ వగుచుండియుఁ బ్రసన్నుండవు స్ఖల నక్షుతపతనజృంభణాదిదురవస్థలందును జరామరణాదిదుర్దశ లందును వివశుల మగు మాకుఁ గల్మషనాశకరంబు లయిన భవ ద్దివ్యనామంబులు మావచనగోచరంబు లగుంగాక మఱియు నీ రాజర్షి పుత్రకాముండై నీతోడ సమానుం డయిన కుమారునిం గోరి, కామంబుల స్వర్గాపవర్గంబుల నీనోపిననినుం బూజించి ధన కాముం డైనవాఁడు ధనవంతునిం జేరి [1]తుషమాత్రం బడిగిన చందంబున మోక్షనాథుండ వైన నీ వలన సంతానంబు గోరుచున్నవాఁడు. జయింపరాని నీమాయచేత నెవ్వండు మోహంబు నొంది [2]విషయాసక్తుండు గాక యుండు? నర్థ కాములము మదాంధులము నగు మేము నిన్ను నాహ్వానంబు సేసిన

1 ఊఁక, 2 విషయ + ఆసక్తుఁడు: విషయము లనఁగా కోరికలు, వానియందు మోహము కలవాఁడు.

యపరాధంబు సర్వాత్మకుండ వగుటం జేసి సామ్యంబుచే మన్నింపం దగుదువు. మమ్ము దయం జూడుము. అని ప్రణమిల్లిన సర్వేశ్వరుండు వర్షాధిపతి యగునాభిచేతను బుత్త్విక్కులచేతను వంద్యమానుండై దయాకలితుం డగుచు నిట్లనియె. 51

క॥ మునులార! వేదవాక్యము
లను బ్రస్తుతి సేసి సర్వలక్షణముల నా
కెన యగు పుత్త్రుని నిమ్మని
వినం బలికితి రిపుడు మిగుల వేడుకతోడన్. 52

క॥ నాకాదిలోకములలో
నాకుం సరివచ్చునట్టి నందను నెటు నా
లోకింప లేరు గావున
నాకుం సరి నేనకా మనమున నెఱుంగుండీ! 53

వ॥ అదియునుం గాక భూసురోత్తములు నాముఖం బగుటం జేసి విప్రవాక్యంబు దప్పింపరాదు. నాభిపత్ని యగు మేరుదేవియందు నేను పుత్త్రుండనై జనియించెద. అని పలికి పరమేశ్వరుం డాగ్నీధ్రీయ పత్ని యగు మేరుదేవి సూచు చుండ నా యజ్ఞంబున నంతర్ధానంబు నొంది, యానాభిప్రియదివసుం జేసి దిగంబరులును దపస్వులును జ్ఞానులును నూర్ధ్వరేతస్కులును నగు నైష్ఠికులకు యోగ ధర్మంబుల నెఱింగింపం దలంచి పుండరీకాక్షుండు నాభిపత్ని యగు మేరుదేవి గర్భాగారంబునం బ్రవేశించె. అంత. 54

## అధ్యాయము ౪.

ఆ॥ మేరుదేవియందు మేరుధీరుం డగు
హరి సమస్తలక్షణాన్వితుండు
శమదమాదిగుణ విశారదుం డుదయించె
సకలజనుల కపుడు సంతసముగ. 55

ఆ॥ ధవళకాంతియుక్తిఁ దనరు దేహంబును
మహితబలపరాక్రమంబు వీర్య
మును దలంచి చూచి జనకుండు పేరిడె
సుతుని ఋషభుఁ డనుచు సొంపుతోడ. 56

క॥ ధరణీసురులును మంత్రులుఁ
బరివారము హితులుఁ బ్రజలు బాంధవ్రులును సు
స్థిరమతి నాబాలకునిం
గర మనురాగమున రాజుగాఁ జూచి రిలన్. 57

క॥ [1]పురుహూతుఁ డతనిమహిమలు
సరగున విని చిత్తమునకు సహ్యము గామిం
బరికించి ఋషభుఁ డేలెడి
ధరణి [2]ననావృష్టి మిగుల దట్టముసేసెన్. 58

ఆ॥ అది యెఱింగి ఋషభుఁ డంతట యోగమా
యా బలంబుకతన నఖిలరాజ్య
మందుఁ గురియఁజేసె నత్యంత సంపూర్ణ
వృష్టి దినదినంబు వృద్ధిఁ బొంద. 59

వ॥ ఇట్లు ఋషభుండు పురందరుండు సేయు దౌష్ట్యంబునకు నవ్వి యజనాభం బను తనమండలంబు సుభిక్షంబుగాఁ జేసె. నాభియుం దన కోరిన చందంబునం బుత్రుండు జనియించి వర్ధిల్లుటకు సంతసిల్లి తనచేత నంగీకరింపంబడు నరలోకధర్మంబుగల పుండరీకాక్షుని మాయావిలసితంబునం జేసి బాలక! నాతండ్రి! యని మోహంబున నుపలాలించుచుఁ బ్రజానురాగంబున సర్వసమ్మతుం డయిన పుత్రుని [3]సమయసేతురక్షణంబునకుఁ బూజ్యం బయిన రాజ్యంబునం దభిషిక్తుం జేసి, భూసురులకుఁ బ్రధానవర్గంబునకు నప్పగించి మేరుదేవింగూడి నరనారాయణస్థానం బయిన బదరికాశ్రమంబు

1 ఇంద్రుఁడు, 2 వానలేకపోవుట. 3 సమయ=ఆచారమనెడి, సేతు=కట్ట యొక్క రక్షణమునకు.

నకుం జని, యచ్చట మహాయోగసమాధిచే నరనారాయ
ణాఖ్యుండుఁ బురుషోత్తముండు నగు వాసుదేవు నారాధించి క్షీణ
దేహుండై యానాభి హరితాదాత్మ్యంబు నొందె. అంత. 60

చ॥ సరసత నే నృపాలకుని జన్మమునందును భూసురోత్తముల్
సరసిజనాభునిం దగఁ బ్రసన్నతఁ బెట్టిన, నంత మెచ్చి యీ
శ్వరుఁడు దనంతగర్భమున వచ్చి తనూభవుఁడై జనించె, నా
నరపతి నాభికిన్ సరి యనందగునే నరనాథ! యన్యులన్. 61

సీ॥ భూవరుఁడగు ఋషభుఁడు దన రాజ్యంబుఁ
గర్మభూమిఁగ నాత్మఁ గాంచి జనుల
కందఱకును బ్రియం బగునట్లు కర్మ తం
త్రం బెల్లఁ దెలుపంగఁ దలఁచి కర్మ
ములు సేయుటకు గురువులయొద్ద వేదంబు
సదివి వారల యనుజ్ఞను వహించి
శతమన్యుఁ డిచ్చిన సతి జయంతీకన్యఁ
బరిణయంబై యట్టి పడఁతి వలన

తే॥ భరతుఁ డాదిగ సుతుని నూర్వురను గాంచె
నట్టిభరతుని పేరను నవని తలము
పురవరాశ్రమగిరితరుపూర్ణ మగుచు
నమరి భారతవర్ష నామమున మించె. 62

వ॥ ఆ మహాభారతవర్షంబునందుఁ దమతమ పేరం బరఁగు భూములకుం
గుశావర్త ఇలావర్త బ్రహ్మావర్త ఆర్యావర్త మలయకేతు
భద్రసేన నిద్రస్పృ గ్విదర్భ కీకటులను తొమ్మండ్రు కుమారులను
దక్కంగల తొంబండ్రు పుత్రులకుఁ బ్రధానులం జేసె. అంతం
గవిహరి, అంతరిక్షప్రబుద్ధపిప్పలాయనావిర్హోత్రద్రమిళచమసకర
భాజను లను వారు దొమ్మండ్రును భాగవతధర్మప్రకాశకులైరి.
భగవన్మహిమోపబృంహితంబులగు వారల చరిత్రంబులు ముందఁ

రెఱింగించెద. తక్కిన యెనుబదియిద్దఱు కుమారులు పితృాదేశ కరులు నతివినీతులు మహాశ్రోత్రియులు యజ్ఞశీలురుం గర్మనిష్ఠులు నయిన బ్రాహ్మణోత్తము లైరి. ఋషభుండు స్వతంత్రుండై సంసారధర్మంబులంబొరయక కేవలానందానుభవుండయిన యీశ్వరుండై యుండియుఁ [1]ప్రాకృతుండునుంబోలెఁ గాలానుగతంబు లగు ధర్మంబుల నాచరించుచు ధర్మప్రవర్తకులకు సముండును నుపశాంతుండును మైత్రుండును గారుణికుండును నై ధర్మార్థ యశఃప్రజానందామృతావరోధంబుచే గృహస్థాశ్రమంబులం బ్రజల నియమించుచుఁ, గొంతకాలంబు నీతిమార్గంబు దప్పక ప్రజాపాలనంబు సేయుచు, వేదరహస్యంబులగు సకలధర్మంబులు స్వవిదితంబు లయినను బ్రాహ్మణోపదేశపూర్వకంబుగా ద్రవ్య దేశకాల వయశ్శ్రద్ధర్త్విగ్వివిధోద్దేశోపచితంబులుగ నొక్కొక్క క్రతువును శతవారంబు యథావిధిగఁ జేసి సుఖంబుండె. అంత. 63

క॥ జనవర! ఋషభుని రాజ్యం
బున నైహికఫలముఁ గోరు పురుషుని నొకనిం
గనుఁగొన నెఱుంగ మెవ్వఁడు
నిన తేజుం డతనిమహిమ లేమని చెప్పన్. 64

ఋషభుండు పుత్రులకు నీతి యుపదేశించుట

సీ॥ ఆఋషభుండు రాజ్యంబు సేయుచు నుండి
యంతట నొక్కనాఁ డాత్మయందుఁ
దలపోసి భూలోకఫల మపేక్షింపక
మోహంబు దిగనాడి పుత్రులకును
దనరాజ్యమెల్ల నప్పనజేసి వెనువెంటఁ
గొడుకులు మంత్రులుఁ గొలిచిరాఁగ
నల్లన యరిగి బ్రహ్మావర్తదేశంబు
నందుల నపుడు మహాత్ము లయిన

---

1 సామాన్యుఁడు.

తే॥ యట్టిమునిజన సమ్ముఖం బందుఁ జేరి
తనదు పుత్రుల నందఱ దాయఁ బిలిచి
పరమ పుణ్యుండు ఋషభుండు ప్రణయ మొప్ప
హర్షమందుచు నప్పు డి ట్లనుచుఁ బలికె. 65

## అధ్యాయము ౫.

ఆ॥ తనయులార! వినుఁడు ధరలోనఁ బుట్టిన
పురుషులకును శునకములకు లేని
కష్టములను దెచ్చుఁ గాన కామంబుల
వలన బుద్ధి సేయ వలదు మీరు. 66

చ॥ నరులకుఁ నే తపంబున ననంత సుఖంబులు గల్గుచుండు శ్రీ
కరమతి నాతపంబుఁ దగఁ గైకొని చేసిన [1]బ్రహ్మసౌఖ్యముం
దిరముగఁ గల్గు; వృద్ధులను దీనులఁ బ్రోవుఁడు దుష్టవర్తనః
జరుగుచునుండు కాముకుల సంగతిఁ బోకుఁడు; మీఁద మేలగున్.

వ॥ మఱియు నంగనాసక్తులగు కాముకులసంగంబు [2]నిరయరూపం బయిన సంసారంబగు. మహత్సంగంబు మోక్షద్వారంబగు. అట్టి మహాత్ము లెవ్వరనిన శత్రుమిత్రవివేకంబు లేక సమచిత్తులును శాంతులును క్రోధరహితులును సకలభూతదయాపరులును సాధువులును నగువారలు మహాత్ము లనం దగుదురు. అట్టిమహాత్ములు నాయందలి స్నేహంబె ప్రయోజనంబుగాఁ గలిగి యుండుటం జేసి విషయవార్తాప్రవృత్తు లగు కుజనులందుఁ దమదేహగృహమిత్ర దారాత్మజాదులందుఁ బ్రీతిలేక యుండుదురు. విషయాసక్తులయిన వారు వ్యర్థకర్మంబులం జేయుదురు. అట్టి దుష్కృతకర్మంబులం జేయువా రెప్పుడును బాపకర్ము లగుచుం గ్లేశదం బగు దేహంబు నొందు చుండుదురు. కావునఁ బాపమూలంబు లయిన కామంబులు గోరకుఁడు. ఈజ్ఞానం బెంతకాలంబు లేక యుండు నంతకాలంబు

1 బ్రహ్మానందము. (ముక్తి) 2 నరకరూపము.

నాత్మతత్త్వం బెఱుంగంబడదు. ఆతత్త్వం బెఱుంగ కుండుటం జేసి దేహికి దుఃఖం బధికంబై యుండు. లింగదేహం బెంతదడవుండు నంత దడవును మనంబు కర్మవశంబై జ్ఞానవంతంబు గాక యవిద్యం బాయకుండు. శరీరంబు గర్మమూలంబగుటవలనం గర్మంబులు సేయం జనదు. వాసుదేవుం డగు నాయందుం బ్రీతి యెంతతడవు లేక యుండు నంతతడవును దేహధర్మంబులు బాధించు. విద్వాంసుం డైనను దేహేంద్రియాదులయందుం బ్రీతిసేసిన [1]మిథునీభావసుఖ ప్రధానం బగు గృహస్థాశ్రమంబు నంగీకరించి స్వరూపస్మృతి శూన్యుండై, మూఢుం డగుచు నందు సంసారతాపంబులం బొందు బురుషుండు స్త్రీతోడంగూడి యేకీభావంబు నొందుట దనకు హృదయగ్రంథియై యుండును. అందు జనునకు గృహక్షేత్రసుతాప్త విత్తంబులందు నేను నాయది యనియెడిమోహంబు గలుగును. అట్టి స్త్రీపురుష మిథునీభావంబుచే సంతానంబు గలుగును. ఆసం తానకారణంబున గృహక్షేత్రవిత్తాదులు సంపాదింపంబడును. అందు మోహంబధికం బగుటం జేసి మోక్షమార్గంబు దవ్వగును. ఇట్లు సంసారంబునం దుండియుం మనంబున నెప్పుడు ముక్తిచింతం జేయు నప్పుడు సంసారంబునుం బాయు. మోక్షోపాయంబులు పరమ గురుండనైన నాయందుల భక్తిసేయుటయు [2]విగతతృష్ణయు, [3]ద్వంద్వతితిక్షయు, సర్వలోకంబులందుల [4]జంతువ్యసనావగతియు, నీశ్వరవిషయ జ్ఞానాపేక్షయుం, దపంబును, [5]విగతేచ్ఛయు, మత్కృతకర్మంబులు మత్కథలు వినుటయు, నన్నె దైవంబుగా నెఱుంగుటయు, నస్మద్గుణ కీర్తనంబులును, నిర్వైరత్వసామ్యోప శమంబులును, దేహగేహంబులందు నాత్మబుద్ధి [6]జిహాసయు, నధ్యాత్మయోగంబును, నేకాంతసేవయుం, బ్రాణేంద్రియాత్మల

---

1 దాంపత్యమునకు సంబంధించిన, 2 ఆశలేమి, 3 శీతోష్ణాది ద్వంద్వము లను సహించుట, 4 జంతువులదుఃఖమును దెలిసికొనుట, 5 ఇదికావలె ననెడి కోరిక లేమి, 6 జిహాస=వదలుట.

గెలుచుటయుఁ, గర్తవ్యాపరిత్యాగంబును, సచ్ఛ్రద్ధయు, బ్రహ్మచర్యంబును, గర్తవ్యకృత్యంబులందుల నప్రమత్తుం డగుటయు, వాఙ్నియమనంబును,సర్వంబు నన్నకాఁదలచుటయు, జ్ఞానంబును, విజ్ఞానవిజృంభితంబైన యోగంబును, ధృత్యుద్యమంబును, సాత్త్వికంబునునాదిగాఁ గల తెఱంగులచేత లింగదేహంబు జయించి దేహిగుళలుం డగుచు నుండవలయు. 68

ఆ॥ అరయఁ గర్మరూప మగునవిద్యాజన్మ
మైన హృదయబంధనాధిలతల
నప్రమత్తయోగ [1]మనుమహాచ్ఛురికచేఁ
ద్రెంపవలయు నంతఁ ద్రెంపుతోడ. 69

ఆ॥ ఒనర నిట్లు యోగయుక్తుండు గురుఁడైన
భూపుఁడైన శిష్యపుత్రవరుల
యోగయుతులఁ జేయ నొప్పుగావలయును
గర్మపరులఁ జేయఁ గాదు కాదు. 70

సీ॥ జనులెల్ల నర్థవాంఛలఁ జేసి యత్యంత
మూఢులై యైహికంబును మనంబు
లందును గోరుదు, రల్పసౌఖ్యములకు
నన్యోన్యవైరంబు లంది దుఃఖ
ములఁబొందుదురు గాన మునుకొని గురుఁడైన
వాఁడు మాయామోహవశుఁడు నిత్య
జడుఁడు నైనట్టి యాజంతువునందును
దయగల్గి మిక్కిలి ధర్మబుద్ధిఁ

ఆ॥ గన్ను లున్నవాఁడు గానని వానికిఁ
దెరువుఁ జూపినట్లు దెలియఁ బలికి
యతులమగుచు దివ్యమైన యామోక్షమా
ర్గంబుఁ జూపవలయు రమణతోడ. 71

---

1 మంచి చురకత్తి.

వ॥ మఱియుఁ బితృగురుజననీబంధుపతిదైవతంబులలో నెవ్వరైనను సంసారరూపమృత్యురహితంబైన మోక్షమార్గంబుఁ జూపకుండిరేని వారెవ్వరును హితులు గానేరరు. నాదుశరీరంబు దుర్విభావ్యంబు; నాదుమనంబు సత్త్వయుక్తంబును ధర్మసమేతంబును బాపరహితంబును నగుటం జేసి పెద్దలు నన్ను ఋషభుండండ్రు గావున శుద్ధసత్త్వమయంబైన నాశరీరంబునం బుట్టిన మీరలందఱును సోదరుండును మహాత్ముండును నగ్రజుండునునైన భరతు నన్నుఁగాఁ జూచి యక్లిష్టబుద్ధిచే భజింపుం డదియ నాకు శుశ్రూషణంబు, ప్రజాపాలనంబు సేయుట, మీకును బరమధర్మంబని మఱియు నిట్లనియె. 72

సీ॥ భూతజాలములందు భూజముల్ వర్యముల్
భూరుహములకంటె భోగికులము
భోగిసంతతికన్న †బోధనిష్ఠులు, బోధ
మాన్యులకన్నను మనుజవరులు,
వీరికన్నను సిద్ధవిబుధగంధర్వులు,
వారికన్నను సురల్ వారికన్న
నింద్రాదిదేవత లిందఱికన్నను
దక్షాదిసన్మునుల్ దలఁప నెక్కు-

తే॥ డంతకన్నను [1]భర్గుఁ డా యభవుకన్నఁ
గమలభవుఁ డెక్కు, డాతనికంటె విష్ణుఁ
డధికుఁ, డాతఁడు విప్రుల నాదరించుఁ
గాన విప్రుండు దైవంబు మానవులకు. 73

క॥ భూసురులకు సరి దైవం
బీసచరాచరమునందు నెఱుఁగను, నాకున్
భూసురులు గుడుచునప్పటి
యాసంతోషంబుదోఁప దగ్నులయందున్. 74

† సంస్కృతము ననుసరించి లేదు.

1 శివుఁడు.

సీ॥ మంగళంబైన బ్రహ్మస్వరూపంబును
వేదరూపంబు ననాదిరూప
మగుచున్ననాదు దేహము బ్రాహ్మణోత్తముల్
ధరియింతు రెప్పుడుఁ దత్త్వబుద్ధి
శమదమానుగ్రహ సత్యతపస్తితి
క్షలు గల్గు విప్రుండు సద్గురుండు
గాన మిక్కిలి భక్తిగల్గి యకించను
లైన భూసురుల దేహములవలన
తే॥ నందు చుండును నాదు దేహంబు గాఁగ
నెఱిఁగి వరు లగు విప్రుల నెల్లభక్తిఁ
బూజసేయుటయే నన్నుఁ బూజసేయు
టనుచు వినిపించి మఱియు నిట్లనుచుఁ బలికె. 75

క॥ ఈ తెఱఁగు దెలిసి భూసుర
జాతిం బూజించునట్టి జనుఁడును మాయా
తీతుండై నిక్కంబుగ
భూతలమున మోక్షమార్గమును బొడగాంచున్. 76

వ॥ ఇట్లు సదాచారులగు కుమారులకు లోకానుశాసనార్థం బాచారంబు లుపదేశించి మహాత్ముండును బరమసుహృత్తును నగు భగవంతుండు ఋషభాపదేశంబునం గర్మత్యాగంబు సేసి [1]యుపశమశీలురగు మునులకు భక్తిజ్ఞానవైరాగ్యలక్షణంబులు గల పారమహంస్యధర్మం బుపదేశింపఁ గలవాఁడగుచుఁ బుత్రశతంబునం దగ్రజుండును బరమభాగవతుండును భగవజ్జనపరాయణుండును నగు భరతుని ధరణీపాలనంబునకుఁ బట్టంబు గట్టి, తాను గృహమందె దేహమాత్రావలంబనంబు సేసి దిగంబరుండై యున్మత్తాకారుండగుచుం [2]బ్రకీర్ణకేశుండై యగ్నుల నాత్మారోపణంబు సేసి

1 ఉపశమనశీలురు = శాంతస్వభావులు (ఇంద్రియములను గెలిచినవారు),
2 విడిపోయిన జుట్టుకలవాఁడై.

బ్రహ్మావర్తదేశంబును బాసి జడాంధబధిరమూకపిశాచోన్మాదులుం
బోలె నవధూతవేషంబు నొంది జనులకు మాఱుపలుకక మౌన
వ్రతంబునం బురగ్రామాకరజనపదారామశిబిరవ్రజఘోష
సార్థగిరివనాశ్రమాదులయందు వెంటఁజనుదెంచు దుర్జనతర్జనతాడ
నావమానమేహననిష్ఠీవనపాషాణశకృద్రజఃప్రక్షేపణపూతి
వాతదురుక్తులం బరిభూతుం డయ్యును గణనం బెట్టక వనమదే
భంబు మక్షికాదికృతోపద్రవంబునుంబోలెఁ గైకొనక, దేహా
భిమానంబునం జిత్తచలనంబు నొందక యేకాకియై చరియించు
చుండ, నతిసుకుమారంబు లగు కరచరణోరస్స్థలంబులు విపులంబు
లగు బాహ్వంసకంఠవదనాద్యవయవవిన్యాసంబులుం గలిగి ప్రకృతి
సుందరం బగుచు స్వతస్సిద్ధదరహాసరుచిరముఖారవిందంబై నవ
నళినదళంబులం బోలి శిశిరకనీనికలం జెలువొంది యరుణాయతంబు
లగునయనంబులచే నొప్పి యన్యూనాధికంబు లగు కపోలకర్ణకంఠ
నాసాగండంబులచేఁ దేజరిల్లుచు [1]నిగూఢస్మితవదనవిభ్రమంబులం
బ్రకాశించు తనదివ్యమంగళవిగ్రహంబుచేఁ బురసుందరుల మనం
బుల కత్యంత మోహంబు గలుగఁ జేయుచు. 77

ఆ॥ ధూళిచేత మిగుల ధూసరితంబునై
జడలు గట్టి కడుఁ బిశంగవర్ణ
మునగు కేశపాశమును వెలిఁగించుచు
నితరు లెవరుఁ దన్ను నెఱుఁగకుండ. 78

క॥ అవధూతవేషమున ని
ట్లవనిఁ మలినంబులైన యవయవములతోఁ
దవిలి చరించుచు నుండును
భువి [2]భూతాక్రాంతుఁడయిన పురుషునిమాడ్కిన్. 79

---

1 దాఁగియున్న చిఱునవ్వుకల ముఖముయొక్క విలాసములచే, 2 దయ్యము పట్టినవాఁడు.

ఆ॥ జనుల కిట్లు యోగసంచార మెల్ల వి
రుద్ధ మనుచు నాత్మ బుద్ధిఁజూచి
[1]యజగరంబుమాడ్కి నవనిపై నుండె బీ
భత్సకర్మమునకుఁ బాలుపడుచు. 80

వ॥ ఇట్లు బీభత్సరూపంబున వసుంధరం బడియుండి యన్నంబు భుజిం చుచు నీరు ద్రావుచు మూత్రపురీషంబులు విడుచుచు నవి శరీరం బున నంటం బొరలుచుండు. మఱియుఁ దత్పురీష[2]సౌగంధ్యయుక్తం బగు వాయువు దశదిశలఁ దశయోజన పర్యంతంబు పరిమళింపం జేయుచుండ గోమృగకాకచర్యలం జరియించుచు భగవదంశం బైన ఋషభుండు మహానందంబు ననుభవించుచుఁ దనయందు సర్వభూతాంతర్యామి యగు వాసుదేవునిం బ్రత్యక్షంబుగాఁ గనుం గొనుచు సిద్ధిం బొందిన [3]వైహాయసమనోజవపరకాయప్రవే శాంతర్ధానదూరగ్రహణశ్రవణాదియోగసిద్ధులు దమంత వచ్చినం గైకొనక యుండె. అని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షి న్నరేంద్రుం డిట్లనియె. 81

## అధ్యాయము ౬

క॥ మునివర! యోగజ్ఞానం
బునఁ జెఱుపం బడ్డకర్మములు గల పెద్దల్
గని యుండెడి యైశ్వర్యం
బును ఋషభుం డెఱిఁగి యేల పొందక యుండెన్. 82

వ॥ అనిన శుకుం డిట్లనియె. 83

మ॥ ధరణీవల్లభ! నీదువాక్యములు తథ్యం, బింతయుం దప్ప; దె
ట్లరయన్ వన్యమృగంబు పట్టువడితా నావేళ నాలుబ్ధకున్
ధర వంచించిన మాడ్కి నింద్రియములన్ దండించి చిత్తంబు ని
ర్భరకామాదుల కాసయిచ్చుఁ గడు సంరంభంబుతో గ్రక్కునన్.

1 కొండచిలువ (పాము), 2 పరిమళము, 3 ఆకాశమునందు మనస్సు నంత వేగముతో నేగుట.

క॥ చిరకాలతపము నైనను
హరియింపఁగ నోపుఁ జిత్తమని పెద్దలు న
మ్మరు జారులకుఁ జారిణి
కరణిని నడరించు మనసు కామాదులకున్. 85

క॥ కామక్రోధాదికముల్
భూమీశ్వర కర్మబంధములు మఱియును జే
తోమూలము లగుటను దా
రీ మహిలో మనసు నమ్మరెప్పుడుఁ బెద్దల్. 86

సీ॥ అది గాన యెన్నఁడు నైశ్వర్యములను జే
పట్టఁ జూడఁడు లోకభవ్యులైన
వారలచే నభివందనంబులువొంది
వెలయంగ నవధూతవేషభాష
ణంబుల నెఱిఁగి కొనఁగరాని భగవత్స్వ
రూపంబు గలిగి యారూపమందుఁ
బరమ యోగధ్యానపరులకు నెల్ల దే
హత్యాగ సమయంబు నంతలోనఁ
తే॥ జూపు చుండియు దేహంబుఁ బాపనిచ్చ
గించె నచ్చట దివ్యయోగీంద్రుఁ డాద్యుఁ
డతులదివ్యప్రకాశకుఁ డమర వరుఁడు
పరమపురుషుండు ఋషభుండు పార్థివేంద్ర! 87

వ॥ అంత విముక్తలింగుండును భగవంతుండును నగు ఋషభుండు మనంబున దేహాభిమానంబు విసర్జించి [1]కులాలచక్రంబు గులాలుని చేత భ్రమియింపంబడి విసృష్టంబయ్యును భ్రమియించుగతిం బ్రాచీనసంస్కార విశేషంబగు నభిమానాభాసంబున దేహచల నాదికంబుల నొప్పి యుండియు యోగమాయావాసనచే యుక్తుం డయ్యె. మఱియు నా ఋషభుం డొక్కదినంబునం గొంకణ

1 కుమ్మరిసారె.

వంకపటంబు లను దక్షిణకర్ణాటక దేశంబులకు యదృచ్ఛం జని
కుటకాచలోపవనంబున [1]నిజాస్యకృతశిలాకబళుండగుచు నున్మ
త్తుని చందంబున వికీర్ణ కేశుండు దిగంబరుండునై సంచరింప, వాయు
వేగవిధూత వేణుసంఘర్షణసంజాతం బగు నుగ్రదావానలంబు
తద్వనంబు దహింప నందు దగ్ధుం డయ్యె. అంత నతనికృత్యంబులు
తద్దేశవాసులగు జనంబులు సెప్ప నర్హన్నామకుం డగు తద్రాష్ట్రాధి
పతి విని నిజధర్మంబులఁ బరిత్యజించి స్వదేశస్థులతోడం గూడి
దా నాయాచారంబుల నంగీకరించి యధర్మబహుళంబగు కలి
యుగంబున భవితవ్యతచే విమోహితుండై మనుజుల నసమంజసం
బగు పాషండమతాభినివేశులం జేసె. మఱియును గలియుగంబు
నందు మనుజాధములు దేవమాయామోహితులై శాస్త్రోక్త
శౌచాచారంబులు విడిచి నిజేచ్ఛంజేసి దేవతాహేళనంబులు
సేయుచు నస్నానానాచమనాశౌచకేశోల్లుంఛనాదికాపవిత్ర
వ్రతంబులం జేయుచు నధర్మబహుళం బగు కలియుగంబునం
జెఱుపంబడ్డ బుద్ధిధర్మంబులు గలిగి వేదబ్రాహ్మణయజ్ఞపురుషుల
దూషించుచు లోకంబులం దమతమమతంబులకుం దామె సంత
సిల్లుచు నవేదమూలం బగు స్వేచ్ఛంజేసి ప్రవర్తించి యంధపరం
పరచే విశ్వాసంబు సేసి తమంతన యంధతమసంబునం బడుచు
నుండుదురు. ఈ ఋషభుని యవతారంబు రజోవ్యాప్తులగు పురుషు
లకు మోక్షమార్గంబు నుపదేశించుటకు నయ్యె. అదియునుం గాక
సప్తసముద్రపరివృతంబు లగు నీ భూద్వీపవర్షంబులందలి జనం
బులు దివ్యావతారప్రతిపాదకంబు శుద్ధంబు నగు నెవ్వని కృత్యం
బులు గీర్తింతురు, మఱియు నెవ్వని యంశంబున నతికీర్తిమంతుం
డగు ప్రియవ్రతుండు గలిగె, నెందు జగదాద్యుండగు పురాణ
పురుషుం డవతారంబు నొంది కర్మ హేతుకంబు గాని మోక్ష
ధర్మంబుం దెలిపె, వెండియు నెవ్వండు యోగమాయాసిద్ధుల [2]నస

---

1 రాతిని అన్నపుముద్ద యట్లు నోట నుంచుకొనువాఁడు, 2 'అసత్తు'లు. అయినవిఅనఁగా లేనివి, సత్తు ఆత్మ దానికి భిన్నమైనదంతయు అసత్తు.

ద్భూతంబు లగుటం జేసి నిరసించె. అట్టి ఋషభునితోడఁ దత్సిద్ధి కృతప్రయత్ను లగు నితర యోగీశ్వరులు మనోరథంబున నైన నెట్లు సరియగుదురు. ఇట్లు సకలవేదలోకదేవబ్రాహ్మణులకు గోవులకుం బరమగురుండు భగవంతుండునగు ఋషభుని చరిత్రంబు వినిన వారల దుశ్చరితంబులు దొలంగు. మంగళంబులు సిద్ధించు. మిక్కిలి శ్రద్ధతో నెవ్వండు విను వినిపించు వానికి హరిభక్తి దృఢం బగు. అట్టి హరిభక్తితాత్పర్యంబునం బెద్దలు భాగవతు లగుటం జేసి సంప్రాప్త సర్వపురుషార్థు లగుచు [1]వివిధవృజినహేతుకం బగు సంసారతాపంబును బాసి యవిరతంబుఁ దద్భక్తియోగామృతస్నానంబు సేసి పరమపురుషార్థంబయిన మోక్షంబును జెందుదురు. అని సప్తద్వీపంబులవారు నేఁడునుం గొనియాడుచుందురు. 88

ఆ॥ యాదవులకు మీకు నత్యంతకులగురు
వైన కృష్ణుఁ డెచట నైనఁ గలఁడు
కొలుచు వారి కెల్ల సులభుఁడై మోక్షంబు
నిచ్చుఁ జింతసేయ నేల మీకు ? 89

సీ. నిత్యానుభూతమా నిజరూపలాభని
వృత్తమై తగుమహాతృష్ణ గలిగి
యతులిత విపులమాయారచితం బైన
లాభంబునకుఁ [2]దగులంబు లేని
మతి గల్గి లోకుల నతివేడ్కఁ గరుణించి
యభయదానం బిచ్చి యండఁ గల
నవ్యయం బై దివ్యమై మహానందమై
యత్యంత సేవ్యమై యతులమైన

---

1 పెక్కురకములయిన పాపములకు కారణములు, 2 తగులము=మోహము సక్తి.

తే॥ తనదులోకంబు సూపంగఁ దగినయట్టి
మోక్షమార్గంబు నెఱిఁగించి ముక్తదేహుఁ
డగుచుఁ దాదాత్మ్య మొందెఁ బ్రత్యక్షవిష్ణు
వైన ఋషభుండు జనులకు నద్భుతముగ. 90

## అధ్యాయము ౭

### భరతోపాఖ్యానము

మ॥ భరతుండంత ధరాతలంబుఁ గడఁకం బాలించుచున్ ధారుణీ
శ్వరచంద్రుండగు విశ్వరూపునకు మున్ సంజాత యైయుండి ని
ర్భరకాంతిన్ విలసిల్లు పంచజని పేరం గల్గుకాంతామణిం
గర మర్థిన్ ధరఁ బెండ్లియాడె శుభలగ్నంబందు భూవల్లభా!

వ॥ ఇట్లు వివాహితుండై యాపంచజనివలన నహంకారంబునం బం
చతన్మాత్రలు జనించిన తెఱంగున సుమతి రాష్ట్రభృత్సుదర్శనా
చరణ ధూమ్రకేతువు లను నేవురు పుత్రులం బుట్టించె. అట
ము న్నజనాభం బనుపేరం బరఁగు వర్షంబు భరతుండు పాలించు
కతంబున భారతవర్షంబునాఁ బరఁగె. అంత. 92

క॥ భరతుఁడు నిజపిత లేలిన
కరణిని గర్మముల నెల్ల గైకొని ప్రజలన్
హరికృప నొందుచు నేలెను
ధరణీ సురవరులు వొగడ ధరణీనాథా! 93

సీ॥ భగవంతుఁ డగు జగత్పరితుష్టి నల్పంబులు
నధికంబు లైన పెక్కధ్వరముల
దర్శపూర్ణములచేఁ దగను జా[1]తుర్మాస్య
ముల నగ్నిహోత్రము వలనఁ గడఁకఁ

1 ఆషాఢ పూర్ణిమ మొదలు నాల్గుమాసములు వ్రతకాలము. 'మాసో వై పక్షః' అనుశ్రుతిచే నాల్గు పక్షముల కాలము కూడ చాతుర్మాస్య మనిపించుకొనును.

బశుసోమములచేతఁ బలుమాఱుఁ బూజించి
వేదోక్తమైన యావిమల కర్మ
ములఁ గల్గు ధర్మంబుఁ బురుషోత్తమార్పణం
బుగఁ జేయుచును మఖంబులను మంత్ర

తే॥ ములను బలికెడు నాద్దైవములను శ్రీశు
నవయవంబులు గాఁగ భూధవుఁడు ప్రేమ
ననుదినంబును బాయక ఘనతఁ దలఁచి
యఖిలరాజ్యానుసంధానుఁ డగుచు నుండె. 94

క॥ ఈరీతిఁ గర్మసిద్ధుల
నారయ నత్యంత శుద్ధమగు చిత్తముతో
నా రాచపట్టి భరతుఁడు 95
ధారుణిఁ బాలించె నధిక ధర్మాన్వితుఁడై.

వ॥ మఱియు నాభరతుండు శ్రీవత్సకౌస్తుభవనమాలాలంకృతుండును సుదర్శనాద్యాయుధోపలక్షితుండును నిజభక్తజన హృదయార విందనివాసుండును బరమపురుషుండును నైన వాసుదేవునియందు నధికభక్తి ననుదినంబును జేయుచు నేఁబదిలక్షల వేలేండ్లు రాజ్యం బు సేసి పితృపితామహాద్యాయాతంబగు సాధనంబును యథార్హ్యం బుగఁ బుత్రులకు బంచి యిచ్చి బహువిధసంపదలు గల గృహం బును బాసి పులహాశ్రమంబున కరిగె. అంత. 96

సీ॥ ఏ యాశ్రమంబున నిందిరాధీశ్వరుఁ
డచ్చటివారల నాదరించి
ప్రత్యక్షమున నుండుఁ బాయక యెప్పుడు,
నట్టి రమ్యం బైన యాశ్రమమున
నిలిచి సాలగ్రామములు గల గండకీ
నది యెందు నెంతయుఁ గదిసి యుండు
నచ్చోట నేకాకి యగుచును భరతుండు
బహువిధనవపుష్పపల్లవముల

తే॥ నతులతులసీదళంబుల నంబువులను
గందమూలాదిఫలములఁ గంజములను
ఘనత నర్పించి నిచ్చలుఁ దనివి లేక
సేవసేయుచు నుండె నా శ్రీపు హరిని. 97

వ॥ దానంజేసి విగత విషయాభిలాషుండై శమదమాది గుణంబులు గలిగి యథేచ్ఛంజేసి యెడతెగక పరమపురుషుని పరిచర్యాభక్తిభరంబున శిథిలీకృతహృదయగ్రంథి గలిగి సంతోషాతిశయంబునం బులకితాంగుండు నానందబాష్పనిరుద్ధావలోకనయనుండు నగుచు నిజస్వామియైన హరిచరణారవిందానుధ్యానపరిచితభక్తియోగంబునం బరమానందగంభీరహృదయం బను నమృత హ్రదంబున నిమగ్నుండగుచుఁ దా నపుడు పూజించుపూజ నెఱుంగక యిట్లు భగవద్వ్రతంబు ధరియించి యేణాజినవాస త్రిషవణస్నానంబుల నార్ద్రకుటిలకపిశవర్ణజటాకలాపంబులు గలిగి మార్తాండాంతర్గతుండయిన పరమేశ్వరుని హిరణ్మయపురుషునింగాఁ దలంచుచు నిట్లనియె. 98

సీ॥ కర్మ ఫలంబులఁ గడఁక నిచ్చుచు మనో
వ్యాపారమున నిట్టి యఖిలలోక
ములఁ జేసి యాలోకములకు నంతర్యామి
యగుచు బ్రవేశించి యంత మీఁద
నానందరూప మై నట్టి బ్రహ్మముఁ గోరు
చున్న జీవుఁ దనయం దున్న యోగ
శక్తిచేఁ దగ ననిశంబుఁ బాలనసేయు
చుండి యంతటను మార్తండమధ్య

తే॥ వర్తి యగుచు నిట్లు వఱలుచు జగముల
యందు నుండి ప్రకృతిఁ బొంద కంత
నతులదివ్యమూర్తి యైన యానందరూ
పమును శరణ మొందె భరతవిభుఁడు. 99

## అధ్యాయము ౮

వ॥ అంత నాభరతుం డొక్కనాఁ డా మహానదిం గృతాభిషేకుం డయి ముహూర్తత్రయం బంతర్జలంబులందుఁ బ్రణవోచ్చారణంబు సేయుచుండు సమయంబున నిర్భరగర్భిణియగు నొక్క[1]హరిణి జలార్థిని యై యొంటి జలాశయసమీపంబునకువచ్చి జలపానంబు సేయు నెడ నాసమీపంబున మృగపతి గర్జించి లోకభయంకరంబుగ నాదంబుసేయ నాహరిణి స్వభావంబున భీతయగుటం జేసి బెగ్గడిలి [2]హరి విలోకనవ్యాకులచిత్తయై దిగ్గన నదరి గగనంబునకు నెగిరి [3]యగతతృషయగుచు నది నుల్లంఘించు నెడ నధిక భయంబునం జేసి యా గర్భంబు యోనిద్వారంబున గళితంబై జలంబులం బడియె. ఆ హరిణి యుల్లంఘనాది భయంబునం జేసి తత్తీరంబున నుండు గిరిదరిం బడి శరీరంబుఁ బాసె. అంత నాహరిణ పోతంబు జలంబులం దేలుచున్న భరతుండు గని వచ్చి చూచి కరుణార్ద్రచిత్తుండై మృతజననియగు నా హరిణపోతంబును దన యాశ్రమంబునకుం గొంపోయి మిక్కిలి ప్రీతిసేసి యుపలాలనంబు సేయుచుండఁ బోషణపాలన ప్రీణనలాలనానుధ్యానంబుల భరతునకు నాత్మనియమంబులైన [4]యష్టాంగ యోగంబులును బరమపురుషపూజాపరిచర్యాదులు నొక్కొక్కటిగఁ గ్రమ క్రమంబునం గొన్నిదినంబులకు సమస్తంబును నుత్సన్నంబయ్యె. అంత. 100

క॥ ఘనతపము చలన మొందుట
యును భరతుం డెఱుఁగ కాత్మ యోగంబునఁ జ
య్యనఁ బాసె హరిణపోతముఁ
దనమదిలో నిల్పి ప్రీతి తప్పక పలికెన్. 101

ఉ॥ అక్కట! తల్లిఁ బాసి హరిణార్భక మాప్తులు లేమిఁజేసి యే
దిక్కును లేక యున్న నిటఁ దెచ్చితి, నాయెడ నీమృగార్భకం

---

1 లేడి, 2 సింహము, 3 దప్పితీరనిది, 4 యమ నియమాదులు = ఎనిమిది యోగాంగములు.

బెక్కుడు ప్రేమసేసి చరియించుచు నున్నది నాదు సన్నిధిన్
మక్కువ చేసి దీనిఁ గడుమన్ననలం దగఁ బ్రోతు నెంతయున్. 102

క॥ శరణని వచ్చినజంతువుఁ
గరుణం గనువిచ్చి చూచి కాచినఁ బుణ్యం
బరయఁగ నధికం బని మున్
గర మెఱిఁగించిరి మునీంద్రగణములు ప్రేమన్. 103

వ॥ అని యిట్లు హరిణపోతంబుం దనయాశ్రమంబున నత్యాసక్తిం జేసి యాసనశయ[1]నాటనస్నాన సమిత్కుశకుసుమ ఫల పలాశ మూలోదకాహరణ దేవపూజాజపాదులయెడం దనయొద్దన యునిచికొనుచు వృకసాలావృకాదిక్రూరమృగంబులవలని భయంబున వనంబుల వెనువెంటం దిరుగుచు నధిక ప్రణయభరపరీతహృదయుం డగుచు నతిస్నేహంబునం జేసి కొంతసేపు స్కంధంబుల వహించుచు, మఱి కొంత తడ వురంబున నుత్సంగంబున నుంచి కొని లాలించుచు సంతసంబు నొందు. మఱియు నా భరతుండు నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబు నిర్వర్తించు నెడ నంత నంత లేచి హరిణ [2]కుణకంబుఁ జూచుచుఁ గించిత్స్వస్థహృదయుండై దాని నాశీఃపరంపరల నభినందించుచుఁ జుంబనాదులఁ బ్రీతిసేయుచు నతిమోహంబునం బెంచుచుండు నెడ. 104

చ॥ *గురువులు వాఱి బిట్టుఱికి కొమ్ములఁ జిమ్ముచు నంత నంత డ
గ్గఱుచును గాలు ద్రవ్వుచు నఖంబుల గీఱుచు గాసిసేయుచు
న్నొఱగుచు ధారుణీశ్వరునియూరువులన్ శయనించి యంతలో
నఱకడ మెక్కుచుం బొదలి యాడుచు నాహరిణంబు లీలతోన్.

తే॥ గరిమ నీగతి మెల్లన [3]కెరలు వొడిచి
చెలఁగి యాడంగ భరతుండు చిత్తమందు

---

* కొన్ని ప్రతులలో నీ పద్యంబు గానఁబడదు.

1 శయన+అటన, — అటన = అటునిటు తిరుగుట, 2 కుణకము = పిల్ల, 3 కెరలు+పొడిచి = విజృంభించి.

సంతసిల్లుచునుండె నాశ్రమముఁబాసి
హరిణడింభక మంతలో [1]సురిఁగి చనిన. 106

వ॥ భరతుం డంతం దన్మృగశాబకంబు గానంబడమికి వ్యాకులిత
చిత్తుండగుచు నష్టధనుండునుంబోలె నతిదీనుండై కరుణతోడం
గూడి తద్విరహవిహ్వలమతియై దానిన తలంచుచు నతిశోకం
బుతో మనంబున దుఃఖించి యిట్లనియె. 107

తే॥ హరిణపోతంబ! నీకు వనాంతమందుఁ
గ్రూరమృగబాధ లేకుండఁ గోరుచుండఁ
దలఁగి పోయితె యనుచుఁ జిత్తంబునందు
రాజవృషభుండు భరతుఁ డా రాట మంది. 108

తే॥ తల్లి చచ్చిన హరిణపోతంబు వచ్చి
పుణ్యహీనుండ నగునన్నుఁబొంది పాసె
నేమి సేయుదు? నేనింక నెట్లు గందుఁ?
జేరి యేరీతిఁ గాంచి రక్షించుకొందు? 109

క॥ కట్టా! యీ యాశ్రమమునఁ
బుట్టినతృణచయము మేసి పొదలినహరిణం
బిట్టట్టుఁ దిరుగుచుండఁగఁ
బట్టి మృగేంద్రుండు గొట్టి బాధించెనొకో! 110

వ॥ ఇట్లు భరతుండు హరిణకుణకక్షేమంబు గోరుచు నెప్పుడువచ్చి
నన్ను సంతోషపఱచు,నానాప్రకారంబులైన తనగతులచేతనన్ను
నెప్పు డానందంబు నొందించు, ధ్యానసమాధి నున్నప్పుడు నన్నుఁ
గొమ్ముల గోఁకుచు నుండునట్టి వినోదంబు లెప్పుడు గనుఁగొందు,
దేవపూజాద్రవ్యంబులు ద్రొక్కి మూర్కొనినం గోపించి
చూచినం గుమారుండుంబోలె దూరంబునకుం జని నిలిచి
మరల నేఁ బిలిచిన వెనుక నిలిచి యుండు నిట్టి మెలఁకువ
స్వభావంబులు గలుగుట యెట్టులు? ఈభూదేవి యెంతతపంబు

1. చాటుఅయి.

చేసినదియో యాహరిణపాదస్పర్శంబులం బవిత్రమైనభూమి స్వర్గాపవర్గకాములైన మునులకు యజ్ఞార్హ యగు నట్టిహరిణపోతంబు నెట్లు గనుఁగొందు! అదియునుంగాక భగవంతుం డగు చంద్రుండు మృగపతి భయంబున మృతజననియు స్వాశ్రమపరిభ్రష్టంబు నైన మృగశాబకంబును గొనిపోయి పెంచుచున్నవాఁడో! మున్ను పుత్రవియోగతాపంబునం జంద్రకిరణంబులం బాపుదు. ఇపుడు హరిణపోతంబు దన శరీరస్పర్శం జేసి చంద్రకిరణంబులకన్న నధికం బగుచుం బుత్రవియోగతాపంబు నివర్తింపంజేసె. అనుచుం బెక్కుభంగుల హరిణనిమిత్తంబులైన మనోరథంబులచేతం బూర్వకర్మవశంబున యోగభ్రష్టుండగు భరతుండు భగవదారాధనంబువలన విభ్రంశితుండగుచు నితరజాతిం బుట్టిన హరిణపోతంబు మీఁద మోహం బగ్గలం బగుచుండ నుండె. అని పలికి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 111

సీ॥ జననాథ! మున్ను మోక్షవిరోధమని పాయఁ
గా రాని పుత్రాదికంబు నెల్లఁ
బాసి తపస్వియై భరతుండు హరిణశా
బకపోషణంబునఁ బాలనమున
నటలాలనప్రీణనానుషంగంబుల
యూహకబిల మతిరోషమునను
సర్పంబు సొచ్చిన చందంబునను యోగ
విఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ

ఆ॥ గాన యెంతవానికైనను గాలంబు
గడవ రామి నట్లు గాకపోదు
పరమమునులకైనఁ బాయవు కర్మంబు
లోరు లనంగ నెంత నరవరేణ్య! 112

వ॥ ఇట్లు భరతుండు మృగవియోగతాపంబు నొందుచుండు నెడ నా

మృగశాబకంబు సనుదెంచిన సంతసిల్లుచుండె. అంత నొక్కనాఁడు

మ॥ భరతుండల్లన యంత్యకాలము వెసం బ్రాపింపఁగా నప్పుడా
హరిణంబుం గడుభక్తిఁ బుత్రుగతి నత్యాసక్తి వీక్షింప, నా
హరిణంబుం దనయాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
హరిణీగర్భమునన్ జనించి హరిణంబై యొప్పెఁ [1]బూర్వస్మృతిన్.

వ॥ ఇట్లు భరతుండు హరిణీగర్భంబునం బుట్టియు భగవదారాధన
సామర్థ్యంబునం దనమృగజన్మకారణంబుఁ దెలిసి కడుం దాపంబు
నొందుచు నిట్లనియె. 115

ఉ॥ రాజులు ప్రస్తుతింప సురరాజ సమానుఁడనై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యాహరిణదేహమునందలి ప్రీతిఁ జేసి నా
యోజ సెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై. 116

వ॥ ఇట్లు శ్రీహరి శ్రవణమననసంకీర్తనారాధనానుసరణాభియోగం
బులం జేసి యశూన్యసకలయామం బగుకాలంబుగల నాకు హరిణ
పోతస్మరణంబుకతంబున యోగవిఘ్నంబు ప్రాప్తం బయ్యె.
మోక్షదూరుండనైతి. అని [2]నిగూఢనిర్వేదుం డగుచుఁ, దల్లిం
బాసి క్రమ్మఱ నుపశమశీలమునిగణసేవితం బయి భగవత్క్షేత్రం
బైన సాలతరునిబిడతమగ్రామసమీపపులస్త్యపులహాశ్రమంబు
లకుం గాలాంజనపర్వతంబువలనఁ జనుదెంచి, యందు మృగ
దేహత్యాగావసానంబు గోరుచు సంగంబు విడిచి, యేకాకియగుచు
శుష్కపర్ణతృణవీరుదాహారుండై మృగత్వనిమిత్తంబగు నా నదీ
తీర్థంబునందు నవసానంబు గోరుచుఁ దత్తీర్థోదకక్లిన్నం బగుచు
నుండు శరీరంబు విడిచె. అని శుకయోగీంద్రుండు పరీక్షిన్న
రేంద్రునకు వినిపించి మఱియు ని ట్లనియె. 117

1 పూర్వజన్మమునొక్క జ్ఞప్తితో, 2 లోలోపల విచారముపొందిన వాఁడు.

## అధ్యాయము ౯.

భరతుండు హరిణజన్మంబు విడిచి బ్రాహ్మణుండై జనించుట.

సీ॥ హరిణదేహముఁ బాసి యంతనాంగిరసాహ్వ
యుండు శుద్ధుఁడు పవిత్రుండు ఘనుఁడు
శమదమఘనతపస్స్వాధ్యాయనిరతుండు
గుణగరిష్ఠుఁడు నీతికోవిదుండు
నైన బ్రాహ్మణునకు నాత్మజుండై పుట్టి
సంగంబువలనను జకితుఁ డగుచుఁ
గర్మబంధంబుల ఖండింపఁజాలు నీ
శ్వరుని నచ్యుతు నజు శ్రవణమనన
తే॥ ములను హరిచరణధ్యానములను విఘ్న
భయమునను జేసి మనమందుఁ బాయనీక
నిలిపి సంస్తుతి సేయుచు నిలిచియుండె
భరితయశుఁడైన భరతుండు పార్థివేంద్ర! 118

వ॥ ఇట్లాంగిరసుండు ప్రథమభార్యయందుఁ బుత్రనవకంబును గనిష్ఠ భార్యయందు స్త్రీపురుషుల నిద్దఱను గలుగంజేసిన, నందుఁ బురుషుండు పరమభాగవతుండును రాజర్షిప్రవరుండును నుత్సృష్టమృగశరీరుండునుం జరమశరీరంబునం బ్రాప్తవిప్రశరీరుండును నగు భరతుం డయ్యె. అతం డాజన్మంబున నన్యజనసంగంబు జన్మపరంపరలకుఁ గారణం బని యత్యంతభయంబు నొంది కర్మబంధవిధ్వంసన శ్రవణస్మరణాదుల శ్రీహరి యనుగ్రహంబునం బూర్వజన్మపరంపరల సంస్మరించుచుఁ దనస్వరూపంబు నున్మత్తజడాంధబధిర రూపంబుల లోకులకుం జూపుచుండె. అంత. 119

మ॥ జనకుం డాంగిరసుండు నాత్మజుని వాత్సల్యంబునం బెంచుచుం
దనరం [1]చౌలముఖాగ్రకర్మములచేతన్ [2]సంస్కృతుం జేసి పా

1 చౌలము = చూడాకర్మ, ఉపనయనమునకు ముందు జరుపు కేశసంస్కారము, 2 సంస్కృతుఁడు = సంస్కరింపఁబడినవాఁడు, మంత్రాదులచేఁ బవిత్రము చేయఁబడినవాఁ డన్నమాట.

యని మోహంబున నిచ్చలుం గడఁక [1]శౌచాచారముల్ సెప్పినఁ
ఘనుఁ డాభాగవతుం డసమ్మతిని దత్కర్మంబులం గైకొనెన్.

వ॥ ఇట్లు బ్రాహ్మణకుమారుండు గర్మంబులయందు నిచ్ఛ లేక యుండి యును బితృ[2]నియోగనిర్బంధంబునం బితృసన్నిధియందే[3]యస మీచీనంబుగా వ్యాహృతిప్రణవశిరస్సహితం బగునట్లు గాయత్త్రీ మంత్రంబు జపియించుచుఁ [4]జైత్రాదిచతుర్మాసంబుల సమవేతం బుగ వేదంబుల నధ్యయనంబు సేయుచుండె. జనకుం డాత్మజుని శిష్టాచారంబుచే శిక్షింపవలయు నను లోకాచారంబు ననువర్తించి యాత్మభూతుండగు నాత్మజునందు నభినివేశితచిత్తుం డగుచు శౌచాచమనాధ్యయనవ్రతనియమగుర్వనల శుశ్రూషణాదికంబుల [5]నభియుక్తంబు లయినం బుత్రునిచే నొనరింపించుచు నప్రాప్త మనోరథుం డయ్యె. అంత. 121

క॥ ఈరీతిని గొడుకున కా
చారంబులు గఱపి చింత సద్గృహమున సం
సారి యగుచుండి విప్రుఁడు
బోరన దేహంబుఁ బాసిపోయిన మీఁదన్. 122

ఆ॥ తల్లి తండ్రితోడ దా నగ్నిఁ జొచ్చిన,
నతని మహిమ లెఱుఁగ కంతలోన
సవతితల్లి కొడుకు లవినీతు లగుచును
శాస్త్రవిద్య లతనిఁ జదువనీక. 123

వ॥ ఇట్లు బ్రాహ్మణకుమారుని సవతితల్లికొడుకులు వేదవిద్యలవలనం బాపి గృహకర్మంబుల నతని నియమించిన. 124

క॥ ధరణీసురోత్తముఁడు దా
నరుదుగఁ దమవారు సెప్పినవి యెల్లను నే

1 శుచిగా నుండుటకు వలయు ఆచారములను, 2 నియోగ=ఆజ్ఞ, 3 అస ర్థముగా, 4 చైత్రము మొదలు నాలుగు మాసములు కలియునట్లు, శ్రావణాదిగ నారంభింపవలసిన వేదవ్రతమును చైత్రాదిగనే ఆరంభించె నన్నమాట, ఇది ధర్మ శాస్త్రములకు భిన్నమయిన పద్ధతి, 5 ఇతరుల కోరికచే, తనకోరికచే.

మఱి కందుఁ బ్రీతిసేయక
నిరతము గృహకర్మ మట్లు నెఱపుచు నుండెన్. 125

వ॥ ఇట్లు గృహకర్మ ప్రవర్తనుం డగుచు నుండ మూఢు లగుద్విపాత్పశువులచే నున్మత్తజడబధిర ! యని యాహూయమానుం డగు నపుడు తదనురూపంబు లగు సంభాషణంబుల నొనర్చుచుఁ బరేచ్ఛాయదృచ్ఛలం జేసి [1]విష్టివేతనయాచ్ఞాదుల వలన నియుక్తకర్మంబులం బ్రవర్తించుచు. 126

తే॥ అతులదివ్యాన్నమైన మృష్టాన్నమైన
నెద్ది వెట్టిన జిహ్వకు హితముగాను
దలఁచి భక్షించుఁగా కొండుఁదలఁచి మిగులఁ
బ్రీతి సేయఁడు రుచులందుఁ బెంపుతోడ. 127

వ॥ మఱియు నావిప్రుండు నిత్యానందసుఖలాభంబు గలిగి బాహ్యసుఖదుఃఖంబులయందు దేహాభిమానంబు సేయక శీతోష్ణవాతవర్షాతపంబులకు నోడి పైచీర గప్పక, వృషభంబునుంబోలెఁ [2]బీనుండును గఠినాంగుండు నగుచు [3]స్థండిలశాయియై రజఃపటలంబునం గప్పంబడినదివ్యమాణిక్యంబునుంబోలె ననభివ్యక్తబ్రహ్మవర్చసుండై, మలినాంబర పరీతకటితటుండు [4]నతిమషీలిప్తయజ్ఞోపవీతుండు నగుటం జేసి యజ్ఞజనంబు లతండు బ్రాహ్మణాభాసుండు మందుండు నని పలుక సంచరించుచుండం గర్మమూలంబునం బరులవలన నాహారంబు గొనునపుడు దమవారును వ్యవసాయకర్మంబునందు నియమించిన క్షేత్ర విహితసమవిషమన్యూనాధికంబుల నెఱుంగక ప్రవర్తిల్లుచు, నూక తవుడు తెలికపిండి పొట్టు మాఁడు ద్రబ్బెడ యాదిగాఁ గల ద్రవ్యంబులయందు నమృతంబు పగిది రుచిసేసి భక్షించుచుం జేనికావలియుండు నెడ నొక్కనాఁడు. 128

---

1 విష్టి=కూలిపని, వేతన=జీతము, యాచ్ఞాదులు = అడుగుకొనుట మొదలయిన, 2 పీనుండు = బలిసినవాఁడు, 3 నేలపైఁ బండుకొనువాఁడు,[స్థండిలము = వ్రతమును పూనినవారు పండుకొనుటకు దర్భాదులుపఱచుకొని సంస్కరించిన నేల], 4 మషీ = మసిచేత, విలిప్త = బాగుగాఁ బూయఁబడిన.

## వృషలరాజభృత్యులు కాళిబలికి భరతునిం గొంపోవుట

క॥ పురిలోన వృషలపతి దా
నరుదుగ సంతానకాముఁడై వేడుకతోఁ
బురుషుఁ డగు పశువుఁ గాళికి
దఱుముక కొనిపోవఁ బశువు [1]దలఁగిన భృత్యుల్. 129

ఆ॥ అరసి కానలేక యారాత్రి వీరాస
నమునఁ జేసి కాఁపు విమలబుద్ధి
నెసఁగు విప్రయోగి నీతనిఁ బొడగాంచి
పశువు మంచి దనుచుఁ బట్టి రతని. 130

క॥ ఆరీతిని భూసురవరు
నారయ నాకాళికాగృహమునకు భృత్యుల్
బోరనఁ గొని చని సల్పిరి
[2]చారుతరాభ్యంజనాది సంస్కారంబుల్. 131

వ॥ ఇట్లభ్యంజనాదికృత్యంబులు దీర్చి నూతన వసనంబు గట్ట నిచ్చి, గంధపుష్పాభరణాక్షతాలంకృతునిం జేసి, మృష్టాన్నంబులు భుజియింపం బెట్టి, ధూపదీపమాల్య[3]లాజకిసలయాంకురఫలోపహారాదులు సమర్పించి మహావాద్యఘోషంబులతోడ నాపురుషపశువుం గాళికాదేవి సమ్ముఖంబున నాసీనుం గావించి, యా వృషలపతి పురుషపశువు రక్తంబున భద్రకాళి సంతోషపెట్టం దలంచి కాళికా మంత్రాభిమంత్రితంబు [4]నతికరాళంబు నైనఖడ్గం బంది నిజాభీష్టసిద్ధికి హింసింపం దలంచిన. 132

సీ॥ సర్వభూతములకు సఖుఁడును బ్రహ్మభూ
తాత్ముఁడు నిర్వైరుఁ డయిన బ్రహ్మ
సుతుని తేజం బంతఁ జూడ దుస్సహ మైన
భయమంది వడఁకుచు భద్రకాళి

---

1 తప్పించుకొని పోఁగా, 2 చక్కని తలగడుగు మొదలయిన అలంకారములు, 3 లాజ = పేలాలు, కిసలయ = చిగుళ్లు, 4 మిక్కిలి భయంకరము.

క్రోధంబు ముమ్మడి గొనఁగ హుంకారంబు
సలుపుచు నట్టహాసంబు సేసి
పాపాత్ములును దాష్ట్యపరులును రాజస
తామసకర్మసంధాను లగుచు

తే॥ విప్రవరు నట్లు హింసించు వృషలపతిని
భృత్యవర్గంబుఁ దోడలల్ పృథ్విఁగూల్చి
యపుడు వృషలాధిపుని శిర మంది లీలఁ
బాడియాడుచు నందంద క్రీడ సలిపె. 133

క॥ ధరలోన నెవ్వ రేనియు
ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచిన వా
రరయఁగఁ జెడుదురు నిక్కము
హరి ధరణీసురవరేణ్యు లం దుండుటచేన్. 134

వ॥ మఱియును. 135

ఉ॥ అచ్చట విప్రసూనుఁడు భయం బొకయించుక లేక చంపఁగా
వచ్చినవారియందుఁ గరవాలమునందును గాళియందుఁ దా
నచ్యుతభావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయున్
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నెంతయున్.

వ॥ మఱియు నావిప్రవరుండు చండికాగృహంబు వెలువడి క్రమ్మఱం
జని కావలియుండు నెడ. 137

## అధ్యాయము ౧౦

సీ॥ అంతటఁ గొన్ని [1]హాయనములు సన సింధు
భూపాలనము సేయు భూవరుండు
ధీరత నిక్షునదీతీరమున నున్న
కపిలమహామునిఁ గాంచి, త త్త్వ

1 సంవత్సరములు.

విజ్ఞాన మెఱిఁగెడు వేడ్కతోడుత శిబి
కారోహణము చేసి యరుగుచుండ
నాలోన నా[1]శిబి కావహు లాచేనఁ
గా పున్న విప్రునిఁ గాంచి తెచ్చి

తే॥ శిబిక మోపింత మీతని చేత ననుచుఁ
బట్టి మూఁపునఁ బల్లకిఁ బెట్టి మోవు
మనుచు మోపించునంత ధరామరుండు
శిబిక మూఁపున నిడి యందుఁ జింతలేక. 138

క॥ తన మనసుకోలఁది నప్పుడు
మునుకొని యట్లప్రయత్నమున నడవఁగ నా
జనపతి నిమ్నోన్నతమై
చనుట యెఱిఁగి శిబిక మోచుజనులకు ననియెన్. 139

ఆ॥ మీర లిప్పు డిచటఁ జేరి మిక్కిలి ప్రయ
త్నంబుతోడఁ దగిలి నడచు చుండ
[2]విషమ మగుచు గమనవేగంబు నను బాధఁ
బెట్టుచున్న దనిన బెస్త లనిరి. 140

వ॥ దేవా! యీవిషమగమనంబు మావలన నైనది గాదు.[3] ఈతురీయవాహకుండు సుఖగమనంబుగా నడవ నేరండు. వీనితోడ మేము నడవ నేరము. అనిన రహూగణుండను నారాజు [4]పాసితవృద్ధజనుండై నను బలాత్కారంబునం బుట్టిన కోపంబునం గోపించి విమర్శ దప్పి [5]నీఱు గప్పిన నిప్పునుంబోలె నెఱుంగరాని బ్రహ్మతేజంబుగల బ్రాహ్మణునికిం గంటకంబుగా నిష్ఠురవాక్యంబుల నిట్లనియె. 141

చ॥ అలసితి వెంతయుం ముసలి వాఁకట డస్సితి వెన్ను మిక్కిలిం
బలుచన యున్న దీ శిబిక భారము దూరము మోసి తేగలేం

1 పల్లకి మోయువారు. (బోయీలు), 2 విషమము = ఎగుడుదిగుడు, 3 తురీయవాహకుఁడు = నాల్గవ మోతగాడు, 4 ఉపాసిత వృద్ధజనుఁడు = పెద్దల సేవ చేసినవాఁడు, 5 నీఱు = నివురు (బూడిద).

నిలిచెద వంచు భూవరుఁడు నిష్ఠురముల్ దగఁ బల్క నాయెడం
బలుకక మోసె నాళిబిక బ్రాహ్మణవర్యుఁడు పార్థివేశ్వరా! 142

వ॥ అప్పు డావిప్రవరుండు దనకుం గడపటిశరీరం బయిన కళేబరంబు నందు నహంకారమమకారంబులం బొంద నీక మిథ్యాజ్ఞానరహితుండై బ్రహ్మభూతుం డై మౌనవ్రతంబున నాళిబిక మోచుచున్న విషమగమనంబుఁ జూచి యతికుపితుం డగుచు నాభూవరుండు వెండియు నిట్లనియె. 143

సీ॥ ఓరిదుర్మద! విన రోరి![1]జీవన్మృత!
నాయాజ్ఞఁ దప్పించి నడచె దీవు
ఈవక్రమార్గంబు లిన్నియు విడిపించి
నడపింతు నిన్ను సన్మార్గమందు
నని రాజగర్వాంధుఁ డగుచు గుణత్రయం
బున వృద్ధిఁబొందిన భూవరుం డ
బద్ధప్రలాపముల్ వల్కుచుండినఁ జూచి
శమదమాదులచేఁ బ్రశస్తుఁ డగుచు

తే॥ జగతి బ్రహ్మస్వరూపమై సకలభూత
ములకు నత్యంతహితుఁడైన భూసురుండు
యోగివర్తన దెలియ లేకున్న రాజు
నంత వీక్షించి యల్ల ని ట్లనుచుఁ బలికె. 144

—భరతుండు రహూగణునిమాటలకుఁ బ్రత్యుత్తరం బిచ్చుట—

వ॥ నరేంద్రా! నీవు సెప్పినది సత్యంబు. భారం బీ శరీరంబునకే కాని నాకుం గలుగ నేరదు. ఐనను స్థౌల్యకార్శ్యంబులు వ్యాధులు [2]నాధులు క్షుత్తృష్ణలు నిచ్ఛావిరోధభయంబులు జరామరణంబులు రోషనిద్రాజాగరణంబులు నహంకారమమకారమదశోషణాదులు దేహంబుతోడన జనియించుం గాని నాకుం గలుగనేరవు. జీవన్మృతుండ నేనకా దాద్యంతంబులు

1 బ్రతికియుండియు చచ్చినవాఁడు, 2 ఆధులు = మనోవ్యాధులు.

గలుగుటంజేసి యందఱియందును గలిగియుండు. స్వామిభృత్య సంబంధంబులు విధికృతంబు లగుచు వ్యవహారంబులంజేసి శరీరంబులకుం గలుగుం గాని జీవునికి లేకయుండును. అదియునుం గాక రాజాభిమానంబున నీవు న న్నాజ్ఞాపించెద వేనిం బ్రమత్తుండ వైన నీకుం బూర్వ స్వభావంబె ట్లుండె, అట్లు గాక యే నేమి సేయుదు నెఱింగింపుము. ఉన్మత్తమూకాంధజడులు సహజస్వభావంబునుం బొందిన నాయందు నీశిక్ష యేమిలాభంబుఁ బొందింప నేర్చు? అదియునుంగాక స్తబ్ధుండు మత్తుండునై న నాకు నీశిక్ష వ్యర్థంబగు. అని పలికి యుపశమశీలుండైన మునివరుండు పూర్వకర్మశేషంబునం గల్గు భారవాహకత్వంబుం దలంగం ద్రోయుటకు భారంబు వహించి శిబిక మోచుచుం జను నెడ నారాజవల్లభుండు తత్త్వజ్ఞానాపేక్షితుండై చనియెడివాఁడగుటం దన హృదయగ్రంథివిమోచకంబులును బహుయోగగ్రంథసమ్మతంబులును నగు బ్రాహ్మణవాక్యంబులు విని యాశిబిక దిగ్గన డిగ్గ నుఱికి యావిప్రునికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి సర్వగర్వవర్జితుండై ముకుళితహస్తుం డగుచు నిట్లనియె. 145

సీ॥ ధరణీసురులలోనఁ దలఁప నెవ్వఁడవు నీ
వవధూతవేషి వై యవనియందు
నేమిటికై చరియింపంగ వచ్చితి
చట నొక్కఁడవు నొంటి ననుట నేఁడు
ననుఁగృతార్థునిఁ జేయ ననుకూలుఁ డగుచున్న
యట్టి యా కపిలమహామునీంద్రుఁ
డవొ? నీమహత్త్వంబు దవిలి విచారింప
నెఱుఁగక చేసితిఁ, గరుణఁ జూడు

తే॥ తప్పు సైరింపు, నే యమదండమునకు
హరుని శూలంబునకును వజ్రాయుధమున

కనల చంద్రార్క ధనదశస్త్రాస్త్రములకు
వెఱవ, విప్రుని కేమది వెఱచినట్లు. 145

వ॥ మఱియు నిస్సంగుండ వయి జడుండునుంబోలె నిగూఢవిజ్ఞానంబు గలిగి చరియించుచు నున్న వాఁడవు, నీవచనంబులు యోగశాస్త్ర సమానంబు లై వాఙ్మనసంబులకు నభేద్యంబు లయి యున్న వే నవ్విష్ణుకళావతీర్ణుండు సాక్షాద్ధరియు నగు కపిలమహామునివలన బ్రహ్మవిద్య దెలియం గోరి చను చున్న వాఁడ. నీవు లోకనిరీక్షణార్థం బవ్యక్తలింగుండ వై చరియించుచున్న కపిలమహాముసీంద్రుండవు గాఁబోలుదువు. మందుండై న గృహస్థుండు యోగీశ్వరచరిత్రంబు లెట్టు లెఱుంగ నేర్చు. కర్మవశంబున దృష్టం బైన భ్రాంతి వహించుచు నడచుచు నున్న యీ యాశ్రమంబు నాకునుంబోలె నీకు నగునని తోఁచు చున్నది. అది యెట్లనిన ఘటంబు లేక జలంబు దే నేరని తెఱంగున లేనిది గలుగ నేరదు, గావునం బ్రమాణ మూలం బయిన లోకవ్యవహారంబు సత్పథంబున సమ్మతంబై యుండుటం జేసి నీ వాదువాక్యంబులు నాకు సమ్మతంబు గానేరవు. అని సింధుదేశాధీశ్వరుండు వినిపించిన నావిప్రుండు లోకవ్యవహారంబునకు నిత్యత్వం బౌపాధికం బగుం గాని నిత్యంబుగా నేరదు. అని దృష్టాంతనిదర్శనంబుగా నిట్లనియె.

సీ॥ పావకశిఖలచే భాండంబు దాఁ దప్త
మగుఁ, దప్తఘటముచే నందు నున్న
జలము తపించు, నా జలముచేఁ దండులం
బులు తప్త మొంది యప్పుడు విశిష్ట
మైన యన్నం బగు నాచందమునను దా
దేహేంద్రియప్రాణంబులఁ దెలివితోడ
నాశ్రయించుక యున్న యట్టిజీవునకు దే
హంబునఁ బ్రాణేంద్రియాదికమున

ఆ॥ జరుగు చుండు, నిట్లు సంసారఘటవృత్తి
దుండు నయిన రాజు దుష్టమైన
కర్మములకుఁ బాసి కంజాక్షుపదసేవఁ
జేసె నేని భవముఁ జెంద కుండు. 147

ఆ॥ అనుచు ధారణీసురాత్మజుఁ డీరీతిఁ
బలుకుటయును రాజు పరిణమించి,
వినయవాక్యములను వినుతించి, క్రమ్మఱఁ
బుణ్యుఁ డైన సింధుభూవరుండు. 148

వ॥ మహాత్మా! నేను రాజనని యెడి యభిమానమదాంధుండనై మహాత్ములం దిరస్కరించిన నన్నుఁ గరుణింపుము. నీ వార్తబంధుండవు. నీ కృపాదృష్టిం జేసి మహాత్ముల నవమానంబు సేసిన దురితంబువలన విముక్తుండ నయ్యెద. [1]విశ్వసుహృత్తవైన నీకుం గోపంబు గలుగ నేరదు. అసమర్థ లయినమాబోఁటివారలు మహాజనావమానంబున శీఘ్రంబె నశింతురు. కావున నీవు దయాళుండ వయి నన్ను మన్నింపు మనిన నావిప్రుం డిట్లనియె. 149

అధ్యాయము ౧౧.

క॥ కడు వేడ్క నీవు విద్వాం
సుఁడవై యుండియును మిగులఁజోద్య మవిద్వాం
సుఁడుఁబోలెను బలికెద, వి
ప్పుడు మే లనవచ్చుఁ గొంత పురుషులలోనన్. 150

ఆ॥ పరఁగఁ బెద్ద లీప్రపంచ మంతయుఁ దథ్య
మనరు ; నీవు తథ్యమనుచుఁ బలికి
తట్లు గాన నిన్ను నధికుండ వని పల్క
రాదు నాకుఁ జూడ రాజచంద్ర! 151

1 సర్వమునకు స్నేహితుఁడవు.

సీ॥ యజ్ఞాదికములందు నామ్నాయమునయందుఁ
దలఁచుగాఁ దత్త్వవాదంబు లేదు
స్వప్నంబు నందులసౌఖ్య మాకారంబు
నందుల నిత్యమై యంత లేని
యట్టి చందమున, వేదాంత వాక్యంబులు
తత్త్వంబు నెఱిఁగించి తలఁగుఁ గాని
నిత్యంబులై యుండ నేరవు, పురుషుని
చిత్తంబు గుణములఁ జెంది యెంత

తే॥ కాలముండును మఱి యంతకాలమందు
నరయ విజ్ఞానకర్మేంద్రియముల చేత
మరగి ధర్మంబులను నధర్మంబు లట్లు
దగిలి పుట్టించుచుండు నత్యంతమహిమ. 152

వ॥ మఱియు ధర్మాధర్మవాసనాయుక్తంబు విషయానురక్తంబు నైన చిత్తంబు గుణప్రవాహంబులచేత వికారంబు నొంది దేవ తిర్యఙ్మనుష్యరూపంబు లయిన దేహంబులం బుట్టించుచుఁ గాల ప్రాప్తంబు లైన సుఖదుఃఖతదుభయఫలంబుల ననుభవించుచు ననవరతంబు జీవునికిం బ్రత్యక్షంబగుచు స్థూలసూక్ష్మరూపంబుల నుండు. స్వాంతంబు గుణరహితంబైన ముక్తికారణంబగు. ఘృత వర్తులు గల దీపంబు సధూమశిఖలం బుట్టించు; ఘృతవర్తులు నాశంబు నొందిన స్వరూపంబుఁ బొందిన తెఱంగున మనంబు గుణ కర్మానుబంధంబైన జన్మాదులం బుట్టించు. గుణకర్మంబులం బాసెనేనిం బరతత్త్వంబు నొందు. జ్ఞానేంద్రియంబు లేనును విష యంబుల మీఁదఁ దోఁచుబుద్ధు లేనును నభిమానంబును నను నేకాదశవృత్తులంగూడిన మనంబు జీవునికి ననంఖ్యంబు లయిన జన్మంబుల బొందించు. మనోవృత్తుల నతిక్రమించిన జీవుండు పరం జ్యోతిర్మయైన నారాయణ స్వరూపంబుగా నెఱుంగుము. స్థావరజంగ మంబు లయిన జీవులకుం బవనుండు ప్రాణంబై యున్న చందంబున

నీశ్వరుండు సర్వభూతాంతర్యామి యగుచు జీవాత్మస్వరూపంబున నుండు. జీవాత్ముండు జ్ఞానోదయంబునం జేసి మాయ నెంతకాలంబు గెలువకుండు నంతకాలంబు ముక్తసంగుండుగాఁడు. అరిషడ్వర్గం బును జయించి పరతత్త్వంబు నెఱింగిన నీశ్వరుండగు. చిత్తం బెంత కాలంబు విషయాసక్తం బగు నంతతడవు సంసార చక్రంబునందు సంచరించుం గావున మహావీరుండైనను దనకు శత్రు వైన మనంబు నప్రమత్తుండయి యిచ్ఛావిహారంబున జరగనీక పరమ గురుండైన శ్రీహరిచరణోపాసనాస్త్రంబునం జిత్తంబు గెలిచినం బరతత్త్వంబు నొందు. అని విప్రుండు వలికిన నతనిమహిమకు వెఱఁగంది బ్రాహ్మణునకు నమస్కారంబు సేయుచు భూవరుం డిట్లనియె 153

## అధ్యాయము ౧౩.

ఉ॥ కారణవిగ్రహంబు నుఱకాయము నీ యవధూత వేషముం
భూరిధరామరత్వమును [1]బూర్వసమాగమ మాత్మభావముం
జారువిహార మత్యతులశాంతిగుణంబును గూఢవర్తనం
బారయఁ గల్గు నీకు ననయంబును మ్రొక్కెదఁ బెక్కుభంగులన్.

మ॥ జ్వరితార్తుం డగు రోగి కౌషధ మతీష్టంబైన చందంబునన్.
ధరలో నాతపతప్తదేహి గడుశీతం బైన తోయంబునుం
గరిమం గోరినరీతి, నెంతయు [2]నహంకారాహిదష్టుండనై
పరఁగన్ నాకును నీవచోమృతము దప్పన్ మందు వే యున్నదే?

ఆ॥ విప్రవర్య! నేను వేడ్కతో నా సంశ
యంబు లెల్ల నిన్ను నడిగి తెలియఁ
దలఁచి యున్నవాఁడ దప్పక యెఱిఁగింపు
ముచితవృత్తిఁ దత్త్వ యోగ మెల్ల. 156

---

1 పూర్వసమాగమము, 2 అహంకార + అహివష్టుండనై = అహంభావ మనెడి పాముచేఁ గఱవఁబడినవాఁడనై.

వ॥ అని యడిగిన యా రాజునకు విప్రుం డిట్లనియె. 157

తే॥ కాన వచ్చిన ఫలములు కర్మమూల
ము లగుటను జేసి సంసారములను జిత్త
మెపుడు వర్తించుచుండఁగా నెఱుఁగ లేవు
తత్త్వయోగంబు మిగుల నిత్యంబటంచు. 158

వ॥ మఱియు నీవసుంధర నున్న చరణంబులకు నెక్కుడు జంఘ లా మీఁద జానువు లాపొడవున నూరువు లందులకు నుపరిప్రదేశంబున మధ్యం బటమీఁద నుర మందులకు నెక్కువ కంఠం బటమీఁద స్కంధం బందుల దారు వాదారువున శిబిక శిబికయందు రాజ ననియెడి యభిమానంబు గలిగి నీ వున్నవాఁడవు. ఇట్టిచోద్యం బయిన కష్టదశం బొందిన నీవు ప్రజాపాలనంబు సేయు చున్న వాఁడ నను గర్వంబున మావంటి మహాత్ముల సభలలోనం బూజ్యుండవు గాక యున్నవాఁడవు. ఈ స్థావరజంగమంబులకు నివాసస్థానంబు వసుధర యైనచందంబున సత్క్రియలచేత నెఱుఁగం దగిన జగత్కారణంబైన తత్త్వంబు నెఱింగించెద. పరమాణుసముదయం బీ ధరిత్రి యైనచందంబున నవిద్యామనంబుల చేతం గల్పితం బయిన కృశస్థూలబృహదణుసదసజ్జీవాజీవద్రవ్యస్వభావాశయకాలనామబుద్ధిరూపం బైన మాయచే జగత్తు రెండవది యై కల్పింపంబడియె. బాహ్యాభ్యంతరంబులం గలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్ద వాచ్యంబును విశుద్ధంబును బరమార్థంబును జ్ఞానరూపంబును నైన బ్రహ్మం బొకటి సత్యంబు. జగత్తసత్యంబగును. అని పలికి మఱియును. 159

సీ॥ ధరలోన బ్రహ్మంబుఁ దపమున దానంబు
లను గృహధర్మంబు లను జలాగ్ని
సోమసూర్యుల చేత శ్రుతులచే నైనను
బరమభాగవతుల పాదసేవఁ

బొందిన మాడ్కిని బొందంగ రాదని
వలుకుదు రార్యులుఁ బరమ మునులు
ఘనతపోబాహ్యసౌఖ్యములకు విముఖులు
నయపుణ్యులు హరిగుణానువాద

తే॥ మోదితాత్ములు నగు బుధపాదసేవ
ననుదినంబును జేసిన నంత మీఁద
మోక్షమార్గంబునకును బద్ధాత్మునందు
బట్టువడియుండు నెప్పుడుఁ బరఁగ బుద్ధి. 160

వ॥ నరేంద్రా! యేను బూర్వంబున భరతుం డను రాజను, సర్వసంగ పరిత్యాగంబు సేసి భగవదారాధనంబు సేయుచు మృగంబుతోడి స్నేహంబు కతన మృగంబనై పుట్టియు నందును హరిభక్తి దప్ప కుండిన కతంబున నిప్పుడు మనుష్యుండనై మనుష్య సంసర్గంబును బాసి యేకాకినై చరియించు చున్నవాఁడ. నరుండు వృద్ధసంసేవం జేసి సంసారమోహంబును బాసి హరిధ్యానకథలచే లబ్ధజ్ఞానుండై పుండరీకాక్షునిం బూజించుచుం బరలోకంబునుం బొందు. అని పలికి విప్రుండు మఱియు నిట్లనియె. 161

**అధ్యాయములు ౧౩ - ౧౪.**

సీ॥ ధరణీశ! మాయచేతను దాఁటఁగారాని
పథమునఁ బుట్టంగఁ బట్టజీవుఁ
డెలమిమై గుణకర్మములఁ జేయుచును లాభ
మాశించి తిరుగు [1]బేహారిమాడ్కి
ఫలమపేక్షించుచుఁ బాయక జీవుండు
సంసారగహనసంచారి యగుచు
ననవరతము నుండు నా మహావనమందుఁ
గామలోభాదితస్కరులు గూడి

1 వర్తకుఁడు, 'తిరిగెడు నార్యు మాడ్కిన్'—అని పాఠము.

తే॥ ధరణి విజితేంద్రియుఁడు గాని నరునిఁ బట్టి
ధర్మ మనియెడి యామహాధనము నెల్ల
నరసి గొనిపోవు చుండుదు రనుదినంబుఁ
గాన సంసారమందు నాకాంక్ష వలదు. 162

క॥ అరయఁగ సంసారాటవిఁ
దరలక యాపుత్రమిత్రదారాదు లనం
బరఁగుచుఁ నుండెడు [1]వృకములు
పరువడి [2]నరబస్తములను భక్షించు వడిన్. 163

తరలము॥ [3]మలసి సంసృతి ఘోర కానన మందిరంబుల నెల్ల నుం
జెలఁగి గుల్మలతాతృణాదులచేత గహ్వరమైన ని
శ్చలనికుంజములందు[4] దుర్జనసంజ్ఞలం గలమక్షికం
బుల నిరోధము దన్ను సోఁకినఁ బొందుచుండు విపద్దశన్. 164

ఆ॥ మఱియు నీగృహస్థ మార్గంబునం దెల్ల
విషయములను బొంది విశ్వమెల్లఁ
గడఁకతోడ నిట్లు గంధర్వలోకంబుఁ
గాఁదలంచి మిగుల మోదమందు. 165

ఆ॥ మఱచి కాననమునఁ గొఱవిదయ్యముఁ గాంచి
యగ్నిఁ గోరి వెంట నరుగుమాడ్కిఁ
గాంచనంబు గోరికల వారియిండ్ల పం
చలను దిరుగు నరుఁడు చలన మంది. 166

ఆ॥ బహుకుటుంబి యగుచు బహుధనాపేక్షచే
నెండమావులఁ గని యేగు మృగము
కరణిఁ బ్రేమఁ జేసి [5]గురువులు వాఱుచు
నొక్కచోట నిలువకుండు నెపుడు. 167

1 తోడేళ్ళు, 2 నరులనెడి మేఁకలను, 3 మలసి = ఉద్రేకించి. లేక ఉద్యమించి, 4 దుర్మార్గులనెడి ఈఁగలు, 5 పరుగెత్తు (ఉప్పాంగు).

ఆ॥ మఱియు నొక్కచోట మత్తుఁడై [1]పవనర
జోహతాక్షుఁడగుచుఁ జూపుదప్పి
దిక్కెఱుంగ కొండు దిశ కేగు పురుషుని
కరణిఁ దిరుగు నరుఁడు నరవరేణ్య! 168

వ॥ మఱియు నొక్కచోట [2]నులూక[3]ఝిల్లీస్వనంబులతోడ సమానంబులయిన శత్రురాజతిరస్కారంబులకు దుఃఖపడుచు, నొక్కచోట క్షుధార్దితుండై యపుణ్యఫలవృక్షంబుల నాశించుమాడ్కిఁ బాపకర్ములు ద్రవ్యహీనులు నగువారి నాశ్రయించుచు, నొక్కయెడం బిపాసాతురుం డై జలహీనం బయిన నదికిఁ జనిన రీతి నిహపరదూరు లైన పాషండుల సేవించుచు, మఱియు నొక్కప్రదేశంబునం దగ్నిచేతం దప్తుఁ డయినవాఁడు దావాగ్నిం జేరి వ్యథ నొందురీతి నన్నార్థియగుచు దాయాదులం జేరి దుఃఖించుచు మఱియు నొక్కచోటఁ బరబాధం జేసి మున్ను గానక రాజ్యాభిలాషం బ్రాణసఖులైన పితృపుత్రభ్రాతృజ్యేష్ఠుల నైనను వధియించుచు, మఱియు శూరులచేతం గొట్టువడి సర్వధనంబును బోనాడి చింతాపరవశుండై దుఃఖించుచు నున్నంత గంధర్వనగర ప్రాయంబైన సంసారసుఖంబు ననుభవించి మోదించుచు మఱియు, నగారోహణంబుసేయు నరుండు గంటకపాషాణాదుల వలనం బాధపీడితుండగుచు దుఃఖించు చందంబున గృహాశ్రమోచితమహానుష్ఠానంబునకు నుపక్రమించి వ్యసనకంటకశర్కరాపీడితుండై దుఃఖించుచు నొక్కచోటఁ జఠరాగ్నిపీడితుండై కుటుంబంబుమీఁద నాగ్రహించుచు, వనంబున నజగరగళితుండై జీర్ణితుండైన చందంబున రాత్రి గృహాటవియందు నిద్రాపరవశుండై యెఱుంగక వర్తించుచు, మఱియును వనంబునఁ దృణచ్ఛన్న కూపపతితుండగుచు సర్పదష్టుండైన తెఱంగున సంసా

1 పవనరజస్ = గాలిదుమ్ముచే, హత = కొట్టఁబడిన, అక్షుఁడు = కనులు గలవాఁడై, 2 గుడ్లగూబలు, 3 ఝిల్లీ = ఈల పురుగు.

రియై దుర్జనులచేత వ్యథితహృదయుం డగుచు, నంధుండై యజ్ఞా నాంధకూపంబునంబడుచు నొక్కయెడ జంటితేనియకు నై మక్షికా బాధ నత్యంతదుఃఖితుం డయిన మాడ్కి నిసంసారకాముండై పర దారద్రవ్యాభిలాషి యగుచు, భూపాలకులచేత నైనను గృహపతి చేతనైనను దాడితుండై నరకంబునం బడుచు,యౌవనంబునసంపా దించిన ద్రవ్యంబులు పరులచేతం బోనాడినవిధంబున శీతవాతా ద్యనేకప్రయాసలబ్ధంబైన ధనంబు వోనాడి సంసారి యతిచింతా క్రాంతుండై యుండు. మఱియును వనంబున లుబ్ధకులు సంసృష్టం బయిన [1]యల్పామిషంబునకు నన్యోన్యవైషమ్యంబునం గల హించిన విధంబున [2]సంసృష్టవ్యవహారియై యల్పద్రవ్యంబులకుం బోరాడుచుండు. అని భూపాలునకు విప్రుండు సంసారాటవి తెఱంగెఱింగించి, వెండియు నిట్లనియె. 169

ఆ॥ అల్పధనుఁడు విశ్రమస్థానములఁ దృప్తిఁ
బొంద కొరులధనముఁ బొందఁగోరి
యరిగి వారివలన నవమానములఁ బొంది
యధిక మైనదుఃఖ మనుభవించు. 170

ఆ॥ అంతఁ గొందఱెల్ల నన్యోన్యవిత్తాది
వినిమయమునఁ గడుఁ బ్రవృద్ధమైన
వైరములను బొంది పోరాట వొందుదు
రాత్మ చింతలేక యనుదినంబు. 171

సీ॥ సంసారమార్గసంచారుఁడై యధికప్ర
యాసంబునను గూర్చు నర్థములను
విహరించుచును గొంద ఱిహలోకఫలములఁ
గోరుచు మోక్షంబు గోర రంతఁ

---

1 కొద్ది మాంసము, 2 సృష్టించుకొన్న వ్యవహారము కలవాఁడై (తనంతట తానే వ్యాజ్యములను గల్పించుకొని యన్నమాట).

జెడిపోవుచుండు రెప్పుడు గాని యందుకుఁ
గడపటి యోగంబుఁ గానలేరు
మానవంతులు నసమానశౌర్యులు నగు
వారు మిక్కిలి యైన వైరబుద్ధి
తే॥ నాహవంబున మడియుదు రంతెకాని
మోక్షమార్గంబు గానరు మూఢవృత్తి
ననుచు సంసారగహన విహార మెల్లఁ
దెలిపి క్రమ్మఱ ననియె ధాత్రీసురుండు. 172

వ॥ మఱియుం గాలచక్రనియంత్రితుం డై చక్రాయుధునిం గొల్వక కాకగృధ్రబకసమానులైన [1]పాషండులతోడి సఖ్యంబునం జేసి వారలచేత వంచితుం డై బ్రాహ్మణకులంబులం జేసి శ్రౌతస్మార్త కర్మానుష్ఠానపరుం డై విషయసుఖంబులందుఁ దగులువడి, కాలంబు తుద నెఱుంగక వృక్షంబులుంబోలె నైహికార్థంబులయందుఁ దృష్ణగలిగి మైథుననిమిత్తంబునసుతదారాదులయందు స్నేహంబు సేయుచుఁ బథికుండు మాతంగంబులయందు భయంబున దీర్ఘ నిమ్నకూపంబునంబడిన తెఱంగున సంసారమృత్యుగజభయం బున గిరికందరప్రాయంబయిన యజ్ఞానతమంబునం బడుం; గావున మాయచేత సంసారమార్గంబైన రాజభావంబు విడిచి సర్వభూత మైత్రి గలిగి జితేంద్రియుండ వై [2]జ్ఞానాసిచే మార్గంబు కడపల గనుమని పలికిన భూపాలుం డిట్లనియె. 173

క॥ అక్కట! మానుషజన్మము
పెక్కువ యైయుండు నెపుడ భేదమతిం బెం
పెక్కిన యోగిసమాగమ
మక్కజముగఁ గలిగె నేని నఖిలాత్ములకున్. 174

క॥ ధరణీసురవర! నీశ్రీ,
చరణాంబుజయుగళరేణుసంస్పర్శము నా

1 నాస్తికులు, 2 జ్ఞానమనెడి కత్తిచే.

దురితంబు లడఁచె నింతట
హరిభక్తియు నంతకంత కధికం బయ్యెన్. 175

వ॥ మఱియు విప్రవరులయందు యోగీశ్వరు లవధూతవేషంబున సంచరియించుచుందురు; గావున విప్రులు పిన్నపెద్ద లనక యందఱకు నమస్కారంబని స్తుతియించిన నా యోగీశ్వరుండును సింధుపతికిఁ గరుణాన్వితుండగుచుఁ దత్త్వజ్ఞానం బుపదేశించి యారాజుచేత వందితచరణుండై, పూర్ణార్ణవంబునుంబోలె సంపూర్ణకరుణారస పూరపూరితస్వాంతుండై వసుంధరం జరియించుచుండె. సింధు భూపతియును సుజనసమాగమంబున లబ్ధతత్త్వజ్ఞానుండయి దేహాత్మ భ్రమంబాసె. అని పలికిన శుకయోగీంద్రునకుం బరీక్షి న్నరేంద్రుం డిట్లనియె. 176

చ॥ అరయఁగ మక్షికంబు వినతాత్మజుఁ గూడఁగ నేనిరీతి యా
భరతుని సచ్చరిత్రములు ప్రస్తుతి సేయఁగ నీ వసుంధరన్
నరపతు లెల్ల నోపరు మనంబున నైననునెంచ; నింక నా
భరతుని పుణ్యవర్తనముఁ బ్రస్తుతి సేయఁగ నాకు శక్యమే? 177

వ॥ నరేంద్రా! భరతుండు సుతదారరాజ్యాదులను బూర్వకాలంబు నందె విడిచి భగవత్పరుండగుచు యజ్ఞరూపంబును ధర్మస్వరూపం బును సాంఖ్యయోగంబును బ్రకృతిపురుషస్వరూపంబును నైన నారాయణునకు నమస్కారం బనుచు మృగరూపంబును బాసె. అట్టి భరతుని చరిత్రం బెవ్వరు సెప్పిన నెవ్వరు వినిన నట్టివారలం బుండరీకాక్షుండు రక్షించు. ఆయురభివృద్ధి యగు. ధనధాన్య సమృద్ధియునగుచుండ స్వర్గోపభోగంబులం బొందుదురు. అని. 178

మ॥ నరదేవాసురయక్షరాక్షసమునీంద్రస్తుత్య! దివ్యాంబరా
భరణాలంకృత! భక్తవత్సల! కృపాపారీణ! వైకుంఠమం
దిర! బృందావనభాసురప్రియ ధరిత్రీనాథ! గోవింద శ్రీ
కర! పుణ్యాకర! వాసుదేవ! త్రిజగత్కల్యాణ! గోపాలకా! 179

క॥ పరమపదవాస! దుష్కృత
హర! కరుణాకర! మహాత్మ హతదితిసుత! భా
సురగోపికామనోహర!
సరసిజదళనేత్ర! భక్తజననుతగాత్రా! 180

మాలిని. సరసహృదయవాసా చారులక్ష్మీవిలాసా!
భరితశుభచరిత్రా! భాస్కరాబ్జారినేత్రా!
నిరుపమఘనగాత్రా నిర్మలజ్ఞానపాత్రా!
గురుతరభవదూరా గోపికాచిత్తచోరా! 181

గద్యము. ఇది సకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్యప్రణీతంబైన శ్రీమహాభాగవత పురాణమునందుఁ బ్రియవ్రతుని సుజ్ఞానదీక్షయు, బ్రహ్మదర్శనంబును, నాగ్నీధ్రాదులజన్మంబును నుత్తమతామసరైవతుల జన్మంబును, ప్రియవ్రతుండు వనంబునకుం జనుటయు, నాగ్నీధ్రుం డప్సరసం బరిగ్రహించుటయు వర్షాధిపతుల జన్మంబును నాగ్నీధ్రుండు వనంబునకుం జనుటయు, నాభిప్రముఖుల రాజ్యంబును, నాభియజ్ఞంబును, ఋషభుని జన్మంబును, ఋషభుని రాజ్యాభిషేకంబును, భరతునిజన్మంబును, ఋషభుండు దపంబునకుఁ జనుచు సుతులకు నతులజ్ఞానం బుపదేశించుటయు, భరతునిపట్టాభిషేకంబును, భరతుండు వనంబునకుఁ జనుటయు, భరతుండు హరిణపోతంబునందలి ప్రీతిం జేసి హరిణగర్భంబున జనియించుటయు, మరల విప్రసుతుండై జనియించుటయు, విప్రుండు చండికాగృహంబున బ్రదికి వచ్చుటయు, సింధుపతి విప్ర సంవాదంబును ననుకథలుం గల పంచమస్కంధంబునందుఁ బ్రథమాశ్వాసము. 182

ఓం తత్సద్బ్రహ్మార్పణ మస్తు.



శ్రీరస్తు.

శ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రీమదాంధ్ర

# భాగవతము

## పంచమ స్కంధము

### ద్వితీయాశ్వాసము



కాంతాహృదయప్రియ!
లోకాలోకప్రచార లోకేశ్వర! సు
శ్లోక! భవభయనివారక!
గోకులమందార! నందగోపకుమారా! 1

#### అధ్యాయము ౧౫.

వ॥ సకలపురాణార్థజ్ఞానవిఖ్యాతుం డగు సూతుం డిట్లనియె. 2

క॥ మునులార! బాదరాయణి
యనఘాత్మకుఁ డైన యుత్తరాత్మజునకు స
ద్వినయోక్తి భరతుచరితము
వినిపించుచు మఱియు నిట్లు వినిపించెఁ దగన్. 3

ఆ॥ పార్థివేంద్ర! యిట్లు భరతాత్మజుం డైన
సుమతి ధర్మవర్తనమునఁ దిరుగ
నదిమొఱంగి దుష్టులైన పాషండులు
దమమతంబు నిగులఁ దలఁచి పొగడి, 4

క॥ ధరణీవల్లభ! నిన్నును
నిరతంబును బుద్ధదేవునిం గొలిచిన యా
తెఱఁగునఁ గొలిచెద మని భా
సురమతి బోధించి రపుడు సుమతిం బ్రీతిన్. 5

వ॥ ఇట్లు పాషండబోధితుండైన సుమతికి ధ్రువసేనయందు దేవతాజిత్తను పుత్రుండు జనించె. వానికి దేవద్యుమ్నుం డను సత్పుత్రుం డాసురియం దుదయించె. అమ్మహాత్మునకు ధేనుమతియందుఁ బరమేష్ఠి జనియించె. అతనికి సువర్చలయందుఁ బ్రతీహుం డనువాఁడు సుతుం డయ్యె. అప్పరమపురుషుండు సకలజనులకు బ్రహ్మోపదేశంబు సేసి తాను శుద్ధాత్ముండై హరిస్మరణసేయుచు యజ్ఞకరణనిపుణులగు ప్రతిహర్త ప్రస్తోత యుద్గాత యను సత్పుత్రులం గాంచెను. ఆ ప్రతిహర్తకు సుతియందు వ్యోమభూమనామకపుత్రద్వయం బుత్పన్నంబయ్యె. అందు భూమునకు ఋషికుల్యయందు నుద్గీథుం డను సుతుండు జనించె. అతనికి దేవకుల్యయందుఁ బ్రస్తోత గలిగె. ఆ ప్రస్తోతకు వరరుత్సయందు విభుండను తనయుం డుద్భవించె. అతనికి భారతియందుఁ బృథుషేణుం డుదయించె. అతనికి నాకూతియందు నక్తుండు గలిగె. ఆ నక్తునకు రాజర్షిశ్రేష్ఠుం డగు గయుం డను మహాకీర్తి సంపన్నుం డుదయించె. 6

ఆ॥ అట్టి గయునివలన నఖిలజీవులఁ బ్రోవఁ
దలఁచి సాత్త్వికప్రధాన మయిన
యట్టి మేనుదాల్చి యాత్మతత్త్వజ్ఞానుఁ
డగుచు నుండె హరి నిజాంశమునను. 7

వ॥ ఇట్టి మహనీయసుగుణాకరుం డగు గయుని గాథానువర్ణనంబు పురావిదు లగు మహాత్ములచే నీ తెఱంగున నుతింపంబడుచున్నది. సావధానమనస్కుండవై యాలకింపు మని యిట్లనియె. 8

సీ॥ ధర్మ మార్గంబున ధారుణీజనులను
ప్రేమతోఁ బోషణ ప్రేషణోప
లాలనశాసనలక్షణాదులచేతఁ
బోషించుచును యజ్ఞమునను యజ్ఞ
పురుషు నీశ్వరుఁ జిత్తమున నిల్పి సేవించి
స్వాంతమం దున్న యీశ్వరునిఁ గాంచి
యఖిలజీవతతికి నానంద మొసఁగుచు
నిరభిమానతమెయి ధరణి నేలె

ఆ॥ సత్యమందు మిగులు సత్సేవయందును
ధర్మమందు యజ్ఞ కర్మమందు
గయుఁడు వసుధలోనఁ గంజాక్షుఁడే కాని
మానవుండు గాఁడు మానవేంద్ర! 9

వ॥ అట్టి మహాపురుషగుణగణపరిపూర్ణుం డగు గయునికి దక్షకన్యక లగు శ్రద్ధామైత్రీదయాదులు దమయంతన వచ్చి కోరిక లొసంగ నతని ప్రజలకు వసుంధర కామధేనువై పిదుక, వేదంబులు సకల కామంబుల నిచ్చుచుండ, సంగరంబున భంగంబు నొందిన రాజు లప్పనంబు లొసంగ, విప్రులు ధర్మం బాఱవ పాలు పంచి యిడ, నిరంతర సోమపానంబును శ్రద్ధాభక్తియోగంబుఁ గలిగి యొనర్చు యజ్ఞంబుల నింద్రాదిదేవతలు దృప్తులై యజ్ఞఫలంబుల నొసంగ బ్రహ్మాదితృణగుల్మలతాంతంబుగా సకలలోకంబుల వారినిం దృప్తింబొందించుచు, శ్రీహరిం దృప్తిఁ బొందఁ జేయుచు, గయుండు పెక్కుకాలంబు రాజ్యంబుసేసె. అట్టి గయునికి జయంతి యందుఁ జిత్రరథస్వాత్యవరోధను లను మువ్వురు గొడుకులు పుట్టిరి. నాచిత్రరథునికి నూర్ణ యందు సామ్రాట్టును, వానికి నుత్కళ యందు మరీచియు, నామేటికి బిందుమతియందు బిందుమంతుండును, నాబిందుమంతునకు సరఘుయందు మధువును, మధువునకు సుమనస యను దానియందు వీరవ్రతుండును, నావీరవ్రతునకు భోజ యందు మన్యుప్రమన్యువు లను నిరువురును,

నందు మన్యువునకు సత్య యందు భువనుండును, నతనికి దోష యందుఁ ద్వష్టయు, నాత్వష్టకు విరోచనయందు విరజుం డను వాఁడును జనియించిరి. అంత. 10

క॥ ఆవిరజున కుదయించిరి
భూవినుత! విషూచియందుఁ బుత్రశతంబున్
అవల నొక కన్యకయును
నావేళ సమస్తజనులు హర్షం బందన్. 11

క॥ ఘనుఁడు ప్రియవ్రతువంశం
బునకుం దుద యై విరజుఁడు భూపతివంశం
బును దా నలంకరించెను
విను మింద్రావరజుఁ డయిన విష్ణునిమాడ్కిన్. 12

## అధ్యాయము ౧౬

క॥ అని పలికిన శుకయోగిం
గనుఁగొని యభిమన్యుసుతుఁడు గడు మోదముతో
వనజదళాక్షుని మహిమలు
విని సంతస మంది యనియె వేడుక మఱియున్. 13

వ॥ మునీంద్రా! సూర్యరశ్మి యెందాఁకం బ్రవర్తిల్లు నక్షత్రయుక్తం బైన చంద్రకిరణంబు లెంతమేరఁ దిరుగు, నంతదూరంబు ప్రియవ్రతునిరథనేమిఘట్టనలచేత సప్తద్వీపంబులును సప్తసముద్రంబులునయ్యె, అని పలికితివి. ఆద్వీపసముద్రంబుల పరిమాణంబులు సవిస్తరంబులుగా నెఱింగింపుము; గుణమయంబును స్థూలరూపంబును నయిన శ్రీహరిశరీరం బగు నీలోకంబునందు నిలిపినచిత్తంబగుణంబును సూక్ష్మంబును నాత్మజ్యోతియు బ్రహ్మంబును నైన వాసుదేవునియందు నిల్చుం గావున ద్వీపవర్షాదివిస్తారంబు వినిపింపుము. అనిన శుకయోగీంద్రుం డిట్లనియె. 14

క॥ ధరణీవల్లభ! విను శ్రీ
హరిమాయాగుణవిభూతు లగు జలనిధులుం

బరఁగిన దీవులు వర్షము
లరయంగాఁ గొలఁదిపెట్ట నలవియె జగతిన్. 15

ఆ॥ తెలిసినంత నేను దెలిపెద సంక్షేప
మునను జిత్తగించి వినుము దెలియ;
ననుచుఁ జెప్పఁదొడఁగె నభిమన్యుసుతునకు
నింపుగాను శుకమునీంద్రుఁ డిట్లు. 16

### శుకయోగి యుపదేశరూపమునఁ జెల్పు భూగోళంబు నిర్ణయము

వ॥ నరేంద్రా! జంబుద్వీపంబు భూపద్మంబునకు మధ్యప్రదేశంబున లక్షయోజనంబుల వెడల్పు నంతియ నిడుపునుం గలిగి కమల పత్త్రంబునుం బోలె వర్తులాకారంబయి నవసహస్రయోజనపరిమితాయామంబు గల నవవర్షంబుల నష్టమర్యాదాగిరులునుం గలిగి విభక్తంబయి యుండు. అందు మధ్యవర్షం బిలావృతవర్షం బగు. అందు మధ్యమప్రదేశంబున సువర్ణమయంబయి. 17

క॥ భూపద్మమునకు మేరువు
దీపించుచుఁ [1]గర్ణికాకృతిని బెంపగుచుం
బ్రాపై కులగిరిరాజుగఁ
జూపట్టును సురగణాళిచోద్యం బందన్. 18

సీ॥ మఱియును నామేరుగిరి లక్షయోజనో
న్నతమగుచుండి యానడిమి దళము
విదితమై పదియాఱువేల యోజనములు
నంతియపాఁతునై యతిశయిల్లు
నామీఁద విస్తార మరయ ముప్పదిరెండు
వేలయోజనముల వెలసి యుండు
నాగిరి కుత్తరంబందు నీలశ్వేత
శృంగపర్వతములు నింగిముట్టి

1 తామరపువ్వులోని దుద్దు.

ఆ॥ యుండు రెండువేల యోజనంబులదాఁకఁ
బఱపు గలిగి పూర్వ పశ్చిమాయ
తంబు దక్షిణోత్తరంబును విస్తార
మగుచు మిగుల రమ్యమై నరేంద్ర! 19

వ॥ ఇట్లు పూర్వపశ్చిమంబులు లవణసాగరాంతంబులై యున్న సీమా పర్వతంబుల యందు నీలశ్వేతశృంగవత్పర్వతంబులు నిడివిని యథాక్రమంబుగ దశమాంశ న్యూనప్రమాణయోజనంబులు గల విగానుండు; వీని మధ్యప్రదేశంబున రమ్యకహిరణ్మయకురువర్షంబులను నామంబులుగల వర్షంబులుండు; వానివిస్తారంబులు నవసహస్రయోజనంబులు గలిగి లవణసముద్రాంతంబులై క్రమంబున నీలాదిపర్వతదీర్ఘపరిమాణంబుల నుండు. ఇలావృతవర్షంబునకు దక్షిణంబున నిషధహేమకూటహిమవత్పర్వతంబులను సీమా పర్వతంబులును బూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబును నగుచు నానీలాదిపర్వతంబులతీరున నుండు. ఆగిరుల మధ్యప్రదేశంబున హరివర్షకింపురుషవర్షభారతవర్షంబులను నామంబులు గల వర్షంబులుండు. ఆయిలావృతవర్షంబునకుఁ బశ్చిమంబున మాల్యవత్పర్వతంబును, బూర్వభాగంబున గంధమాదనంబును, సీమాపర్వతంబులు పూర్వపశ్చిమంబులు నిడుపును దక్షిణోత్తరంబులు విశాలంబునగుచు నీలపర్వతనిషధపర్వతంబులం గదిసి ద్విసహస్రయోజనంబుల విస్తారంబై యుండు. మాల్యవత్పర్వతంబు పశ్చిమసముద్రాంతంబై కేతుమాలవర్షంబును, గంధమాదనపర్వతంబునకుఁ బూర్వభాగంబున సముద్రాంతంబగుచు భద్రాశ్వవర్షంబును, మేరువునకుందూర్పున మందరపర్వతంబును దక్షిణంబున మేరుమందర పర్వతంబులును బడమటిపార్శ్వంబుల నుత్తరమునం గుముదపర్వతంబులు ననునామంబులు గలిగి యయుతయోజనోన్నతంబులయి మేరునగంబను మధ్యోన్నతమేధిస్తంభంబునకుం జతుర్ముఖంబుల హ్రస్వస్తంభములుంబోలె

నుండు. ఆచతుస్స్తంభంబులయందును బర్వతశిఖరంబుల వెలుఁ గొండు కేతువులునుంబో లెఁ జూతజంబూకదంబన్యగ్రోధంబులను వృక్షరాజంబులు క్రమంబున నొండొంటికి నేకాదశశతయోజనా యతంబును, శతయోజనవిస్తారంబును గలిగియుండు. మఱియు నాపర్వతశిఖరంబులం గ్రమంబునం బయోమధ్విక్షురసమ్మృష్టజలం బులు గలిగి శతయోజనవిస్తారంబు లయిన సరోవరంబులు దేజ రిల్లు. అందు సుస్నాతు లగు వారలకు యోగైశ్వర్యంబులు స్వభా వంబునం గలుగు. మఱియు నందనచైత్రరథవైభ్రాజికసర్వతో భద్రంబు లను నామంబులు గల దేవోద్యానంబు లాపర్వతశిఖరం బుల వెలుఁగొందు చుండు. అందు దేవతాగణంబులు దేవాంగ నలఁ గూడి గంధర్వుల గీతనృత్యంబులు గనుంగొనుచు విహరిం తురు. అంత. 20

ఉ॥ మందరపర్వతంబుతుది మామిడిపండ్లమృతోపమానమై
మందరశైలశృంగసుసమానము లై గిరిమీఁద నట్టిమా
కందఫలామృతంబు గలఁగంబడి జాఱి మహాప్రవాహ మై
యం దరుణోదనామమున నద్భుత మై విలసిల్లు నెంతయున్. 21

చ॥ కడుమధురంబునన్ సురభిగంధముచే నరుణప్రకాశతన్
వడిగొని మందరాచలము ప్రంతలచెంతల జాఱి యంతలోఁ
దొడితొడినాయిలావృతముఁ ద్రోచుచువింతగఁ బూర్వవాహి యై
యడరుఁ దరంగసంతతుల నాదటి నచ్చటఁ జేయు ధన్యులన్. 22

ఆ॥ ఆనదీజలంబు [1]లాడిన యచ్చటి
యంబికానుచరుల యంగగంధ
మంది పవనుఁ డంత మనుజేశ! పదియోజ
నములు సుట్టుఁ బరిమళముల నింపు. 23

ఆ॥ మేరుమందరముల మీఁద జంబూఫలం
బులు మహాగజోపములుగ వ్రాలి

1 స్నానము చేసిన;

యవిసి యంతఁ దద్రసామృతం బల్లన
యమ్మహానగంబు నందుఁ బొడమి. 24

క॥ అనుపమ మగు జంబూనది
యను పేరను వెలసి లీల నరుగుచు నంతన్
ఘనత నిలావృతవర్షము
పనుపడఁ దడుపుచును ధరణి బ్రవహించుఁదగన్. 25

ఉ॥ ఆనదినీటఁ దోఁగి పద నై యటు [2]మృత్తనిలార్కసంగతిం
బూని కడున్ విపాకమునఁ బొందుచు శుద్ధసువర్ణజాతి జాం
బూనదనామ మొంది సురముఖ్యుల కెల్లను భూషణార్హ మై
మానుగ వన్నె మించి కడు మంచిదియై విలసిల్లు నెంతయున్.

వ॥ మఱియు సుపార్శ్వనగాగ్రంబునందుఁ బంచవ్యాయామపరిణాహ బంధురంబులగు నైదుమధుధారాప్రవాహంబులు పంచముఖంబుల వెడలి సుపార్శ్వనగశృంగంబులం బడి యిలావృతవర్షంబు పశ్చిమ భాగంబుఁ దడుపుచుం బ్రవహించు. ఆ తేనియ ననుభవించువారల ముఖమారుతసుగంధంబు శతయోజనపర్యంతంబు పరిమళించు.

సీ॥ కుముదపర్వతశిఖాగ్రమున నుత్పన్న మై
కనుపట్టు వటతరుస్కంధముునను
నుదయించునట్టి పయోదధిఘృతమధు
గుడవిశిష్టాన్నంబు లుడుగ కెపుడు
నంబరశయ్యాసనాభరణాదివ
స్తువులఁ గోరికలు దీర్చుచును గుముద
పర్వతాగ్రంబునఁ బడి యిలావృతవర్ష
మున జనులకు నెల్ల భోగ్యములను

ఆ॥ వదల కొసఁగు వారి [3]వళీపలితంబులు
దలఁగుఁ, దుష్టగంధములును బాయు,

1 నేరేడుపండ్లరసముతోఁ గూడినది, 2 మృత్తు=మన్ను, 3 ముడుతలు తలపడుట, నెఱయుట.

మరణభయము ముదిమి ఘోరయ దెన్నడును, శీ
తోష్ణబాధ సెందకుండు నధిప. 28

ఆ॥ దేవదానవులును దివ్యమునీంద్రగం
ధర్వులాది గాఁగఁ దగిలి యాశ్ర
యించి యుందు రాగిరీంద్రమూలమునందు
హర్ష మంది ఘనవిహారలీల, 29

వ॥ నరేంద్రా! మేరు నగేంద్రంబునకుఁ బూర్వభాగంబున జఠర దేవ
కూటంబులును, బశ్చిమంబునం బవనపారియాత్రంబులు, ననుపర్వ
తంబులు నాలుగు దక్షిణోత్తరంబు లొండొంటికి నష్టాదశసహస్ర
యోజనంబుల నిడుపును బూర్వపశ్చిమంబులు ద్విసహస్రయోజ
నంబుల వెడల్పును దక్షిణంబునఁ గైలాస కరవీరంబులు నుత్త
రంబు నద్రిశృంగమకరంబు లను నామంబులు గల దక్షిణోత్తరం
బుల నీపర్వతంబులు నాలుగును బూర్వపశ్చిమంబుల నష్టాదశ
సహస్రయోజనంబుల నిడుపును దక్షిణోత్తరంబుల ద్విసహస్ర
యోజనంబుల వెడల్పు నగుచు నగ్నిపురుషునకుం బ్రదక్షిణంబగు
చున్న [1]పరిస్తరణంబుల చందంబున మేరువునకుం బ్రదక్షిణం
బుగా నష్టనగంబులు నిలిచి యుండు. మేరుశిఖరంబున దశ
సహస్రయోజనంబుల నిడుపు నంతియ విస్తారంబు నగుచు
సువర్ణమయం బైన బ్రహ్మపురంబు దేజరిల్లు చుండు. నా పట్టణం
బునకు నష్టదిక్కులయందును లోకపాలురపురంబు లుండు.

## అధ్యాయము ౧౭.

క॥ పరమేష్ఠి పట్టణంబున
హరి మున్ను [2]త్రివిక్రమణము లందఁగ సర్వే
శ్వరచరణాగ్రనఖాహతిఁ
బరువడి నూర్ధ్వాండ మంతఁ బగిలె నరేంద్రా! 31

1 పరిస్తరణములు = అగ్నిహోత్రము చుట్టును నుంచు దర్భలు, 2 త్రివిక్ర
మణములు = మూఁడుపాదములచే ముల్లోకములను ఆక్రమించుట.

వ॥ ఇట్లు చరణనఖస్పర్శంబు జేసి భేదింపంబడ్డ యూర్ధ్వకటాహవివరంబు వలన నంతఃప్రవేశంబుసేయుచున్న బాహ్యజలధార శ్రీహరిపాద స్పర్శం జేయుచుఁ జనుదెంచి సకలలోకజనంబుల దురితంబులు వాపుచు భగవత్పాదియను పేరం దేజరిల్లుచు దీర్ఘకాలంబు స్వర్గంబున విహరించు. విష్ణుపదంబున నుత్తానపాద పుత్రుండును బరమ భాగవతుండును నైన ధ్రువుండు దన కులదేవత యైన శ్రీహరి పాదోదకంబుఁ బ్రతిదినంబును భక్తియోగంబున నిమీలిత నేత్రుండై యానంద బాష్పంబులఁ రోమాంచిత గాత్రుండై యత్యాదరంబున నేఁడును శిరంబున ధరియించుచు నున్నవాఁడు. అతనికి నధోభాగంబున నుండు మండలాధిపతులైన సప్తర్షులును హరిపాదోదకప్రభావంబు నెఱింగి తాముపొందు తపస్సిద్ధి యాకాశ గంగాజలంబుల స్నాతులగుటయే యని సర్వభూతాంతర్యామి యగు నీశ్వరునియందు భక్తి సలిపి యితరపదార్థాపేక్ష సేయక మోక్షార్థి ముక్తిమార్గంబు బహుమానంబు సేయు తెఱంగున బహుమానయుక్తంబుగాఁ దమ జటాజూటంబులయందు నేఁడును ధరియించు చుండుదురు. 32

సీ॥ అంత నసంఖ్యంబు లైన దివ్యవిమాన
సంకులంబుల సువిశాల మైన
దేవమార్గంబున దిగివచ్చి చంద్రమం
డలముఁ దోఁచుచు మేరునగశిఖాగ్ర
మునను నా బ్రహ్మదేవుని పట్టణమునకు
వచ్చి యందులఁ జతుర్ద్వారములను
వరుసతో దీర్ఘప్రవాహంబు లగుచును
బ్రవహించి యమల ప్రభావములను

ఆ॥ నరుగు లవణసాగరాంతంబులుగ నాల్గు
మోక్షములందు నాల్గు నామములను

దన్నుఁ గన్నవారిఁ [1]దనవారిఁ [2]దోఁగిన
వారి కెల్ల నమృతవారి యగుచు. 33

వ॥ ఇట్లు సిత యనుపేర వినుతి నొందిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదనపూర్వద్వారంబున వెడలి కేసరావలయంబుఁ దడుపుచు గంధమాదనాద్రికిం జని భద్రాశ్వవర్షంబుం బావనంబు సేయుచుఁ బూర్వలవణసాగరంబునం బ్రవేశించు. చక్షువనుపేరం దేజరిల్లెడు దీర్ఘప్రవాహంబు పశ్చిమద్వారంబున వెడలి మాల్యవత్పర్వతంబు నుత్తరించి కేతుమాలవర్షంబుం బవిత్రంబు సేయుచుఁ బశ్చిమలవణార్ణవంబునం గలయు. భద్రయనుపేర వెలుఁగొందిన యతులప్రవాహం బుత్తరద్వారంబున వెడలి కుముదనీలశ్వేతాఖ్యపర్వతశిఖరంబులం గ్రమంబునఁ బ్రవహించుచు శృంగనగరంబునకుం జని మానసోత్తరంబు లగు నుత్తరకురుభూములఁ బవిత్రంబు సేయుచు నుత్తరలవణసాగరంబుఁ జేరు. అలకనంద యనం బ్రఖ్యాతిగాంచిన యమ్మహానదీప్రవాహంబు బ్రహ్మసదనదక్షిణద్వారంబున వెడలి యత్యంతదుర్గమంబులైన భూధరంబులఁ గడచి హేమకూటహిమకూటనగంబుల [3]నుత్తరించి యతివేగంబునఁ గర్మక్షేత్రంబగు భారతవర్షంబుఁ బావనంబు సేయుచు దక్షిణలవణాంబుధిం గలయు నంత. 34

సీ॥ జగతిలో మేరువాదిగఁ బర్వతములకుఁ
బుత్రికలైనట్టి పుణ్యతీర్థ
ములు వేలసంఖ్యలు గలవు జంబూద్వీప
మందు భారతవర్ష మరయఁ గర్మ
భూమి దక్కినవర్షముల దివంబుననుండి
భువికి వచ్చినవారు పుణ్యశేష
ములు భుజించుచునుంద్రు భూస్వర్గమనఁదగు
నావర్షములనుండు నట్టివార

1 తనవారిఁ=తననీటిలో, 2 తోఁగినవారికి=స్నానము చేసినవారికి, 3 దాఁటి,

ఆ॥ లయుతసంఖ్య వత్సరాయువు లయుతమా
తంగబలులు దేవతాసమాను
లతులవజ్రదేహు లధిక ప్రమోదితు
లప్రమత్తు లార్యు లనఘు లధిప! 35

వ॥ మఱియు సురతసుఖానందంబున మోక్షంబు నైనం గైకొనక [1]సకృత్ప్రసూతులగుచు ననవరతంబును త్రేతాయుగకాలంబుగలిగి ప్రవర్తింతురు. ఈయష్టవర్షంబులయందు దేవతాగణంబులు దమ భృత్యవర్గంబు లత్యుపచారంబులు సేయుచుండ నెల్లఋతువుల యందుం గిసలయకుసుమఫలభరితంబులైన లతాదుల శోభితంబు లగువనంబులు గలవర్షనిధి గిరిద్రోణులయందును, గమలామోదితంబు లగు రాజహంసకలహంసలు గల సరోవరంబులయందును, జలకుక్కుటకారండవ సారసవినోదంబులు గలిగి మత్తాళిఝుంకృతి మనోహరంబులై నానావిధంబు లయిన కొలంకుల యందును, దేవాంగనలకామోద్రేకజంబు లయిన విలాసహాసలీలావలోకనంబులం దివియం బడిన మనోదృష్టులుగల దేవగణంబులు విచిత్ర వినోదంబులు గలిగి యిచ్ఛావిహారంబులు సలుపుచుండుదురు. 36

క॥ ఈనవవర్షంబులయం
దానారాయణుఁడు వచ్చి యనవరతములో
కానుగ్రహమునకై సు
జ్ఞానం బీఁదలఁచి లీలఁ జరియించుఁ దగన్. 37

సీ॥ వసుధ నిలావృతవర్షాధిపతి యైన
పురహరుం డావర్షమున వనంబు
నందు నుండుటకు నా యంబికాశాపవ
శంబున నావనస్థలము లందు

---

1 ఒక్కమారు కన్నవారు.

నెవ్వరు వచ్చిన నింతు లై యుందు; రా
వనమందుఁ బార్వతి యనుదినంబు
నంగనాజనసహస్రార్బుదంబులతోడ
[1]నసమలోచనుఁ గొల్చు నతులభక్తి
ఆ॥ నట్టిశివునిఁ గోరి యాయిలావృతవర్ష
మునఁ జరించు జనులు మోదమునను
గదిసి తత్ప్రకాశకము లైన మంత్రతం
త్రములఁ బూజ సేసి తలఁతు రెపుడు. 38

క॥ భద్రాశ్వవర్షమందుల
భద్రశ్రవుఁ డనెడి పేరఁ బరఁగుచుఁ [2]దపనీ
యాద్రిసమధైర్యుఁ డగుచు స
ముద్రాంతం బైన జగతిఁ బాలుపుగ నేలున్. 39

క॥ ఆ నరవరునకుఁ బ్రియతముఁ
డైన హయగ్రీవమూర్తి ననవరతంబున్
ధ్యానస్తోత్రజపాను
ష్ఠానాదులఁ బూజసేసి సజ్జను లంతన్. 40

ఆ॥ తత్ప్రకాశకృత్ప్రధానమంత్రార్థసం
సిద్ధిఁ జేసి ముక్తిఁ జెంది రప్పు
డట్టి వర్షమందు నాహయగ్రీవునిఁ
దలఁచి కొలిచి మిగుల ధన్యు లగుచు. 41

సీ॥ హరివర్షపతియైన నరహరి ననిశంబు
నం దున్న జనులు మహాత్ము లయిన
దైత్యదానవ కులోత్తములు ప్రహ్లాదాది
వృద్ధులఁ గూడి సంప్రీతితోడ

1 త్రిలోచనుని (శివుని), 2 తపనీయ + అద్రి = బంగారు కొండ (మేరువు).

సుస్నాతులై భక్తిఁ జూచుచు నుందురు
రమ్యదుకూలాంబరములు దాల్చి
తత్ప్రకాశకమంత్రతంత్రజపస్తోత్ర
పఠనసుధ్యానతపఃప్రధాన

తే॥ మైనసత్పూజలను జేసి యచలబుద్ధి
శ్రీనృసింహునిఁ జేరి పూజించి యతని
కరుణ నొందుచు నతుల ప్రకాశు లగుచు
భక్తిముక్తులఁ గైకొంద్రు భూపవర్య! 42

వ॥ మఱియుఁ గేతుమాలవర్షంబునందు భగవంతుండు శ్రీదేవికి సంతోషంబు నొసంగుటకుఁ గామదేవరూపంబున నుండును. అమ్మహా పురుషుని యస్త్ర తేజః ప్రకాశంబునఁ బ్రజాపతిదుహిత లగు రాత్ర్యధిదేవతల గర్భంబులు సంవత్సరాంతంబున నిర్జీవంబులై స్రవించును. ఆకామదేవుండును దనగతివిలాసలీలావిలోకనసుందరభ్రూమండలసుభగవదనారవిందకాంతులం జేసి శ్రీ రమాదేవిని రమింపం జేయు భగవన్మాయారూపిణి యగు శ్రీదేవియుఁ బ్రజాపతి పుత్రికలును బుత్రులు నైన రాత్రులం బగళ్లం గూడి కామదేవుని స్తోత్రపఠన పూజాధ్యానాదులం బూజించు చుండు. మఱియును. 43

క॥ విమలమతిఁ జిత్తగింపుము
రమణీయం బైన విపుల రమ్యక మను వ
ర్షమునకు నధిదేవత దా
నమరంగా మత్స్యరూపుఁ డగు హరి దలఁపన్. 44

ఆ॥ అట్టివర్షమునకు నధిపతి యగుచున్న
మనువు పుత్రపౌత్రమంత్రివరులఁ

గూడి మత్స్యమైన [1]కుంభినీధరుఁ జిత్త
మతులభక్తియుక్తిహత్తఁ గొలుచు. 45

ఆ॥ తత్ప్రకాశకృత్ప్రధానమంత్రస్తోత్ర
ములను ధర్మకర్మములను హోమ
ములను జనులు సేసి పుణ్యులై భుక్తి ము
క్తులను బొందుచుందు రెలమి తోడ. 46

క॥ వినుము హిరణ్మయవర్షం
బునకుం గూర్మావతారమును దాల్చిన యా
వనజోదరుఁ డధిదేవత
యనఘుఁడు పితృపతి మహాత్ముఁ డర్యముఁడు నృపా! 47

క॥ ఆవర్షమందు నర్యముఁ
డావర్షజనంబు గూడి హరిఁ జిత్తములో
భావించి సంస్తవంబులు
గావించుచుఁ గాంతు రతని కైవల్యంబున్. 48

క॥ అరయఁగ సీతాలక్ష్మణ
పరివృతుఁ డై వచ్చి రామభద్రుఁడు గడిమిం
బరఁగు నధిదేవతగఁ గిం
పురుషమహావర్షమునకు భూపవరేణ్యా! 49

ఆ॥ అట్టి రామభద్రు నంజనీసుతుఁడు గిం
పురుషగణముఁ గూడి పూజ సేసి
తత్ప్రకాశకప్రధానమంత్రస్తోత్ర
పఠనములను దగను బ్రాప్తిసేయు. 50

సీ॥ భారతవరాధిపతి యైన బదరికా
శ్రమమున నున్న నారాయణుండు
భూనాథ ! యా మహాత్ముని నారదాదులు
భారతవర్షంబు ప్రజలఁ బ్రేమఁ

---

1 భూమిని మోసినవాఁడు (హరి).

బాయక చేరి యుపాస్తిసేయుచు సాంఖ్య
యోగంబు నుపదేశ ముచితవృత్తి
నంది యందఱును గృతార్థులై యట్టి నా
రాయణదేవు నారాధనంబు

ఆ॥ సేసి యాత్మఁ జాలఁ జింతించి తత్ప్రకా
శకము లయిన మంత్ర సంస్తవములఁ
బూజ సేసి ముక్తిఁ బొందుచు నుండుదు
రచల మైనభక్తి ననుదినంబు. 51

క॥ భారతవర్షమునందుల
సారాంశము లైనపుణ్య శైలంబులు గం
భీరప్రవాహములు గల
వారయ నెఱిఁగింతు వాని నవనీనాథా! 52

వ॥ మలయపర్వతంబును మంగళప్రస్థంబును మైనాకంబును త్రికూటంబును ఋషభపర్వతంబును గూటరంబును గోల్లంబును సహ్యాపర్వతంబును వేదగిరియును ఋష్యమూకపర్వతంబును శ్రీశైలంబును వేంకటాద్రియును మహేంద్రంబును వారిధరంబును వింధ్యపర్వతమును శుక్తిమత్పర్వతంబును ఋక్షగిరియును బారియాత్రంబును ద్రోణపర్వతంబును జిత్రకూటంబును గోవర్ధనాద్రియును రైవతకంబును గుకుంభంబును నీలగిరియును గాకముఖంబును నింద్రకీలంబును రామగిరియును నాదిగాఁగల పుణ్యపర్వతంబు లనేకంబులు గల వాపర్వతపుత్రిక లైన చంద్రపటయు దామ్రపర్ణియు నవటోదయుఁ గృతమాలయు వైహాయసియుఁ గావేరియు వేణియుఁ బయస్వినియుఁ బయోదయు శర్కరావర్తయుఁ దుంగభద్రయుఁ గృష్ణవేణియు భీమరథియు గోదావరియు నిర్వింధ్యయుఁ బయోష్ణియుఁ దాపియు రేవానదియు శిలానదియు సురసయుఁ జర్మణ్వతియు వేదస్మృతియు ఋషికుల్యయుఁ ద్రిసమయుఁ గౌశికియు మందాకినియు యమునయు సర

స్వాతియుఁ దృషద్వతియు గోమతియు సరయువును భోగవతియు సుషమయు శతద్రువును జంద్రభాగయు మరుద్వృధయు వితస్తయు నసిక్నియు విశ్వయు నను నీమహానదులును సింధుశోణంబులను నదంబులు నిట్టిమహాప్రవాహంబు లీభారత వర్షంబునఁ గలవు. అందు సుస్నాతులైన మానవులు ముక్తిం జెందుదురు. మఱియు నీభారతవర్షంబున జన్మించిన పురుషులు శుక్లలోహితకృష్ణవర్ణ రూపంబు లగు త్రివిధకర్మంబులం జేసి క్రమంబుగ దేవమనుష్య నరకగతులను త్రివిధగతులం బొందుదురు. వినుము రాగద్వేషాది శూన్యుండు నవాఙ్మానస గోచరుండు ననాధారుండు నగు శ్రీవాసుదేవమూర్తియందుఁ జిత్తంబు నిలిపి భక్తియోగంబున నారాధించెడు మహాత్ములవిద్యాగ్రంథి దహనంబు గావించుట జేసి పరమభాగవతోత్తములు పొందెడు నుత్తమగతిం జెందుదురు. కావున భారతవర్షంబు మిగుల నుత్తమంబని మహాపురుషు లిట్లు స్తుతించుచుందురు. 53

ఉ॥ భారతవర్ష జంతువుల భాగ్యము లేమని చెప్పవచ్చు నీ
భారతవర్షమందు హరిపల్మఱుఁ బుట్టుచు జీవకోటికిన్
ధీరతతోడఁ దత్త్వ ముపదేశముసేయుచుఁ జెల్మిసేయుచు
న్నారయ బాంధవాకృతిఁ గృతార్థులఁ జేయుచుఁ దును నెంతయున్.

క॥ తనజన్మకర్మములనుం
గొనియాడెడి వారికెల్లఁ గోరిన వెల్లం
దనియఁగ నొసఁగుచు మోక్షం
బనయముఁ గృపసేయుఁ గృష్ణుఁడవనీనాథా! 55

వ॥ ఇట్లు భారతవర్షంబునందుల జనంబులకు నెద్దియునసాధ్యంబు లేదు. నారాయణస్మరణంబు సకలదురితంబుల నడంచు. తన్నామస్మరణ హితంబులైన తపోదానాదులు దురితంబుల నడంపలేవు. బ్రహ్మ కల్పాంతంబు బ్రదికెడియితరస్థానంబునం బునర్జన్మభయంబున భీతిల్లుచు నుండుటకన్న భారతవర్షంబునందు క్షణమాత్రంబుఁ

మనంబున సర్వసంగత్యాగంబు సేసినపురుషశ్రేష్ఠునకు శ్రీమన్నారాయణపదప్రాప్తి యతిసులభంబుగ సంభవించుం గావున నట్టి యుత్తమంబగు నీభారతవర్షంబె కోరుచుండుదురు. మఱియు నెక్కడ వైకుంఠుని కథావాసన లేకుండు, నేదేశంబున సత్పురుషులైన పరమభాగవతులు లేకుండుదు, రేభూమిని యజ్ఞేశ్వరుని మహోత్సవంబులు లేకయుండు, నది సురేంద్రలోకంబైన నుండం దగదు. జ్ఞానానుష్ఠానద్రవ్యకలాపంబులచేత మనుష్యజాతింబొంది తపంబున ముక్తింబొందకుండెనేని మృగంబులమాడ్కి నతండు దనకుం దానెబంధనంబు నొందు. భారతవర్షంబునందుఁ బ్రజలచేత శ్రద్ధాయుక్తంబుగా ననుష్ఠింపంబడిన యజ్ఞంబులయందు వేల్వంబడు హవిస్సులను బెక్కునామంబులం బుండరీకాక్షుండంది తనమీఁదిభక్తి యధికంబుగాఁ జేయునట్టి భారతవర్షంబు నందలి ప్రజమీఁదం గరుణించి సర్వేశ్వరుం డిహపరసౌఖ్యంబుల నొసంగుచుండు. జంబూద్వీపంబున సగరాత్మజు లశ్వమేధాశ్వంబు నన్వేషింపంబూని [1]భూఖననంబు సేయుటం జేసి స్వర్ణప్రస్థచంద్ర శుక్లావర్తనరమణకమందేహారుణపాంచజన్య సింహళలంకాద్వీపంబుల ననిమిదియుపద్వీపంబులు గలిగె. 56

సీ॥ లక్షయోజనముల లవణాబ్ధిపరివృత
మగుచు జంబూద్వీప మతిశయిల్లు
విను రెండులక్షల విస్తృతముగను ప్లక్షద్వీప*ముండు నాక్షారసాగ
రముఁ జుట్టి యందుల రమ్యమై యొప్పెడు
వృక్షంబు ప్లక్షంబు విదితముగను
దనరు నా ద్వీపంబు దరునామమహిమచే
మిగులఁ బ్లక్షం బన మించి రహిని

* మిక్షురసాబ్ధిచేత; నావృతమైయుండు నారూఢముగ నందు—అని పాఠాంతరము. ఈ పాఠమే సమంజసముగాఁ దోఁచెడి.

1 నేలను త్రవ్వుట.

ఆ॥ నందు సంచరించునట్టి వారల కగ్ని
దేవుఁ డమరు నాదిదేవతయుఁ గ
నందులోన నా ప్రియవ్రత పుత్రుండు
నిధ్మజిహ్వుఁ డగు మహీవరుండు. 57

వ॥ నరేంద్రా! యాయిధ్మజిహ్వుం డా ప్లక్షద్వీపంబు నేడువర్షంబులుగ విభజించి యందు నావర్షనామధారులుగా నుండు తన పుత్రులగు శివయశస్యసుభద్రశాంతక్షేమాభయామృతు లని యెడు నేడుగుర నేడువర్షంబుల కధిపతులం గావించి తపంబునకుం జనియె. ఆ వర్షంబులయందు మణికూట వజ్రకూట నింద్రసేన జ్యోతిష్మద్ధూమ్రవర్ణ హిరణ్యగ్రీవ మేఘమాల లను నామంబులు గల సప్తకులపర్వతంబులును; నరుణయు నృమ్ణయు నాంగిరసయు సావిత్రియు సుప్రభాతయు ఋతంభరయు సత్యంభరయును నన సప్త మహానదులును నానదులయందు సుస్నాతులగుచు గతపాపులైన హంసపతంగోర్ధ్వాయనసత్యాంగు లను నామంబులు గల చాతుర్వర్ణ్యంబును గలిగి యుండు. అందుఁ బురుషులు సహస్ర వత్సరజీవులును దేవతాసములును దృష్టిమాత్రంబునం [1]గ్లమస్వేదాదిరహితంబగు నపత్యోత్పాదనంబు గలవార లగుచు వేదత్రయాత్మకుండును స్వర్గద్వారభూతుండును భగవత్స్వరూపియు నగు సూర్యుని వేదత్రయమ్మున సేవింపుదురు. ప్లక్షద్వీపం బాదిగా మీఁదటి ద్వీపపంచకంబు నందలి పురుషులకు నాయురింద్రియ పటుత్వంబులును దేజోబలంబులును దోడనె జనియించు చుండు. 58

క॥ ప్లక్షద్వీపము ద్విగుణిత
లక్షేక్షురసాబ్ధి చుట్టిరా విలసిల్లు
న్నిక్షురసోదద్విగుణం
బక్షయమగు శాల్మలీమహాద్వీప మిలన్. 59

వ॥ అందు శాల్మలీవృక్షంబు ప్లక్షాయామంబై తేజరిల్లు అవ్వృక్ష

1 వాడుట, చెమటపట్టుట.

రాజంబునకు నధోభాగంబునం [1]బతత్రిరాజుగా నుండు గరుత్మం తుండు నిలుకడగా వసించు. ఆశాల్మలీవృక్షంబు పేర నాద్వీపంబు శాల్మలీద్వీపం బన విలసిల్లు. ఆద్వీపపతియైనప్రియవ్రతాత్మజుం డగు యజ్ఞబాహువు దనపుత్రులగు సురోచన సౌమనస్య రమ ణక దేవబర్హ పారిబర్హాప్యాయనాభిజ్ఞాతు లనియెడు వారిపేర నేడు వర్షంబుల నేర్పఱిచి యావర్షంబులయం దేడ్వురఁ గుమారుల నభిషిక్తులం జేసె. ఆవర్షంబులయందు స్వరశతశృంగవామదేవ కుముదముకుందపుష్పవర్షశతశ్రుతులను పర్వతసప్తకంబును, నను మతియు సినీవాలియు సరస్వతియుఁ గుహువును రజనియు నందయు రాకయు నను సప్తమహానదులును గలవు. అందు శ్రుత ధరవిద్యాధరవసుంధరేధ్మధరసంజ్ఞ లగు నావర్షపురుషులు భగవ త్స్వరూపుండు వేదమయుండు నాత్మస్వరూపుండు నగు సోముని వేదమంత్రంబులచే నారాధింపుదురు. ఆద్వీపంబు లక్షచతుష్టయ పరిమితయోజనవిస్తృతం బయిన సురాసముద్రంబుచే నావృత్తం బై తేజరిల్లు నందు. 60

సీ॥ భూనాథ! యాసురాంభోధికిఁ జుట్టుగా
నుండు కుశద్వీప మూర్వి మీఁదఁ
[2]దోరమై తా ద్విచతుర్లక్షయోజనం
బులను విస్తారమై పొలుపు మిగుల
నందుఁ గుశస్తంభ మనిశంబు దేవతా
కల్పితం బై నట్టి కాంతిచేత
దిక్కులు వెలిఁగించు ద్వీపంబునకుఁ దన
పేరను సత్కీర్తి పెంపుసేయు

తే॥ నట్టి దీవికి నధిపతియగు ప్రియవ్ర
తతనయుండు హిరణ్యరేతసుఁడన నద

---

1 పక్షిరాజు, 2 పెద్దది అయి.

నరెడి భూపతి తనసుతనామములను
వర్షముల సేసె నత్యంత హర్షమునను. 62

వ॥ ఇట్లు హిరణ్యరేతసుండు వసుదానదృఢరుచినాభిగుప్తసత్యవ్రత విప్రవామదేవు లను నామంబులుగల పుత్రులనామంబుల సప్త వర్షంబులం గావించి, యాకుమారుల నందు నిలిపి, తాను దపంబు నకుం జనియె. ఆవర్షంబునందు బభ్రుచతుశ్శృంగకపిల చిత్రకూట దేవానీకోర్ధ్వరోమద్రవిణంబు లను నామంబులు గల సప్తగిరులును, రసకుల్యయు మధుకుల్యయు శ్రుతవిందయు మిత్రవిందయు దేవ గర్భయు మృతచ్యుతయు మంత్రమాలయు నను సప్తమహానదు లును గలవు. ఆనదీజలంబులఁ [1]కృతమజ్జను లగుచు భగవంతుం డగు యజ్ఞపురుషునిఁ గుశలకోవిదాభియుక్తులను కులంబులు గల వర్షపురుషు లారాధించుచుందురు. 62

సీ॥ ఆకుశద్వీపంబు నరికట్టుకొని యుండు
నెనిమిదిలక్షలఘనఘృతాబ్ధి
యాఘృతసాగరం బవ్వల షోడశ
లక్షయోజనముల లలిత మగుచు
నుండుఁ గ్రౌంచద్వీప, ముర్వీశ ! యందు మ
ధ్యప్రదేశంబున నట్టిదీవి
పేరుగాఁ దనపేరఁ బెద్దగాఁ జేసిన
క్రౌంచాద్రిగల దానగంబు మున్ను

ఆ॥ [2]షణ్ముఖుండు [3]దివ్యశరమున [4]ఘననితం
బంబు దూయ సేయఁ [5]బాలవెల్లి
గరిమఁ దడుపుచుండు వరుణుండు రక్షింప
నందు మిగుల భయము నొందకుండె. 63

---

1 స్నానమాడినవారు, 2 కుమారస్వామి, 3 దివ్యమైన బాణముచేత, 4 గొప్ప, నితంబంబు=కొండయొక్క మధ్యభాగమును, 5 తూటుపడునట్లు కొట్టగా, 6 పాలసముద్రము.

వ॥ నరేంద్రా! యాక్రౌంచద్వీపపతి యగు ఘృతపృష్ఠుండు దన కుమారుల నాపేళ్లుగల యామోదమధువహమేఘపృష్ఠసుధామ ఋషిజ్యలోహితార్ణవనస్పతు లనువర్షంబుల కభిషిక్తులం జేసి, పరమకల్యాణగుణయుక్తుం డయిన శ్రీ హరిచరణారవిందంబుల సేవించుచుం దపంబునకుం జనియె. ఆవర్షంబులయందు శుక్లవర్ధమాన భోజనోపబర్హణానందనందనసర్వతోభద్రంబు లను సప్తసీమా పర్వతంబులును, నభయయు నమృతౌఘయు నార్యకయుఁ దీర్థవతియుఁ దృప్తిరూపయుఁ బవిత్రవతియు శుక్లయు నను సప్తనదులును గలవు. అందులఁ బవిత్రోదకంబు లనుభవించుచు గురుఋషభ ద్రవిణక దేవకసంజ్ఞలు గలిగి వరుణదేవుని నుదకాంజలులం బూజించుచున్న చాతుర్వర్ణ్యంబు గలిగియుండు. 64

సీ॥ జగతీశ! వినుము క్రౌంచద్వీపమును జుట్టి
యుండు షోడశలక్ష యోజనముల
విస్తారమై పాలవెల్లి యందునను శా
కద్వీప మతుల ప్రకాశ మొందు.
దండిమై ముప్పది రెండులక్షల యోజ
నముల విస్తారమై యమరి యుండు
నందుల శాకవృక్షామోద మాద్వీప
మును సుగంధంబునఁ బెనఁగఁ జేసి

తే॥ యంతఁ దనపేరదీవి ప్రఖ్యాత మగుటఁ
జేసి యందుల మిగులఁ బ్రసిద్ధికెక్కె
నందు మేధాతిథియుఁ గర్తయగుచు నుండెఁ
దవిలి వేడుకఁ దనదు నందనులఁజూచి. 65

వ॥ మఱియు నాప్రియవ్రతపుత్త్రుండయిన మేధాతిథి దనపుత్త్రులపేరం గలపురోజవమనోజవ వేపమానధూమ్రానీకచిత్రరథ బహురూప విశ్వాచారంబు లను సంజ్ఞలుగల సప్తవర్షంబులయందు వారలకుఁ బట్టంబుఁగట్టి, శ్రీ హరిపాదసేవ సేయుచుఁ దపోవనంబునకుం

జనియె. ఆశాకద్వీపంబునందు నీశానోరుశృంగబలభద్రశతకేసర
సహస్రస్రోతో దేవపాలమహానసనామంబులుగల సీమాగిరులును,
ననఘాయుర్దోభయసృష్ట్యపరాజితపంచపదీసహస్రస్రుతినిజధృతు
లను సప్తనదులును గలవు. ఆనదీజలంబు లుపయోగించి యచ్చటి
వారలు ప్రాణాయామంబుసేసి విధ్వస్తరజస్తమోగుణులయి పరమ
సమాధిని వాయురూపంబైన భగవంతుని సేవింతురు. ఋతవ్రత
సత్యవ్రతదానవ్రతనువ్రతనామంబులుగల చాతుర్వర్ణ్యం బందుఁ
గలిగియుండు. 66

సీ॥ అట్టిశాకద్వీప మరికట్టి తత్ప్రమా
ణంబున దధిసముద్రంబు వెలుఁగు;
నందుకుఁ బరివృతంబయి పుష్కరద్వీప
మిలఁ జతుష్షష్టి లక్షల విశాల;
మమ్మహాద్వీపమం దయుతకాంచనపత్త్రి
ములు గల్గి కమలగర్భునకు నాస
నం బగు పంకేరుహంబుండు; నాద్వీప
మధ్యంబునను నొక్కమానసోత్త

ఆ॥ రంబనంగఁ బర్వతంబుండుఁ దనకుఁ బూ
ర్వాపరముల నుండు నట్టివర్ష
ములకు రెంటి కట్లు నిలిచిన మర్యాద
నగ మనంగఁ జాలఁ బొగడ నెగడు. 67

వ॥ ఇట్లు దనకు లోపలి వెలుపలి వర్షంబులు రెంటికి మర్యాదా
చలంబునుంబోలె నున్న మానసోత్తరపర్వతం బయుతయోజన
విస్తారంబును నంతియయౌన్నత్యంబునుం గలిగియుండు. ఆనగం
బునకు నలుదిక్కులయందు నాలుగు లోకపాలుర పురంబు లుండు.
ఆమానసోత్తరపర్వతంబు తుద సూర్యరథ్యచక్రంబు సంవత్సరా
త్మకంబయి యహోరాత్రంబులయందు మేరుప్రదక్షిణంబు సేయు.
అందు నా పుష్కరద్వీపాధిపతియగు వీతిహోత్రుండు రమణకథా

తక నామంబులు గల పుత్రుల నిరువుర వర్షద్వయంబునం దభిషి
క్తులం జేసి తాను బూర్వజు లేగిన తెఱంగున భగవత్కార్యశీలుం
డగుచుఁ దపంబునకుం జనియె. అంత. 68

క॥ మనుజేశ్వర! యావర్షం
బున నప్పుడు సంచరించు పురుషులు పద్మా
సనునిఁ దగ నర్చనారా
ధన సేయుదు రచలబుద్ధితాత్పర్యమునన్. 69

క॥ ధరణీవల్లభ! విను పు
ష్కర మనుద్వీపమున లేరు చాతుర్వర్ణ్యల్
పరఁగఁగ భేదము లేకే
సరసత సములగుదు రందు సకలజనములున్. 70

వ॥ మఱియు పుష్కరద్వీపంబు చతుష్షష్టిలక్ష యోజనవిస్తారం బైన
శుద్ధోదకసముద్రముద్రితం బగు చుండు; అవ్వల లోకాలోకపర్వ
తంబుండు. శుద్ధోదకసముద్రలోకాలోకపర్వతంబుల నడుమ రెండు
కోట్ల యోజన విస్తారం బయిన నిర్జనభూమి [1]దర్పణోదరసమా
నం బై దేవతావాసయోగ్యంబుగా నుండు. ఆభూమిం జేరిన
పదార్థంబు మరలఁ బొంద నశక్యంబుగా నుండు. అటమీఁద
లోకాలోకపర్వతం బెనిమిదికోట్ల యోజనంబులు సువర్ణభూ
మియు సూర్యాది ధ్రువాంతంబులగు జ్యోతిర్గణంబులమధ్యంబున
నుండుటం జేసి లోకాలోకపర్వతం బనం దగియుండు. పంచాశ
త్కోటి యోజనవిస్తృతం బగు భూమండలమానంబునకు దురీ
యాంశ ప్రమాణంబుగల యాలోకాలోక పర్వతంబుమీఁద నఖిల
జగద్గురు వగు బ్రహ్మచేతఁ జతుర్దిశలయందు ఋషభపుష్కర
చూడవామనాపరాజితసంజ్ఞలు గలదిగ్గజంబులు నాలుగును
లోకరక్షణార్థంబు నిర్మితం బై యుండు. మఱియును. 71

1 అద్దము నడిమిభాగము వంటిదై,

సీ॥ తనదు [1]విభూతులై తనరినయాదేవ
బృంద తేజశ్శౌర్య [2]బృంహణార్థ
మై భగవంతుండు నాది దేవుండును
నైన జగద్గురుం డచ్యుతుండు
సరిలేనిధర్మవిజ్ఞానవైరాగ్యాదు
లయిన విభూతుల నలరియున్న
యట్టి విష్వక్సేను డాదిగాఁ గలుగు పా
ర్షదులతోఁ గూడి ప్రశస్తమైన

తే॥ నిజవరాయుధదోర్దండనిత్యసత్త్వుఁ
డగుచు నాపర్వతంబుపై నఖిలలోక
రక్షణార్థంబు కల్పపర్యంతం మతఁడు
యోగమాయావిరచితుఁడై యొప్పుచుండు. 72

వ॥ ఇట్లు వివిధమంత్రగోపనార్థం బానగాగ్రంబున నున్న భగవంతుండు దక్క లోకాలోకపర్వతంబునకు నవ్వల నొరులకు సంచరింప నశక్యంబయి యుండు; బ్రహ్మాండంబునకు సూర్యుండు మధ్యగతుండై యుండు; ఆసూర్యునకు నుభయపక్షంబులయందు నిరువదేనుకోట్లయోజనపరిమాణంబున నండకటాహం బుండు. అట్టి సూర్యునిచేత నాకాశదిక్స్వర్గాపవర్గంబులును నరకంబులును నిర్ణయింపంబడు. దేవతిర్యఙ్మనుష్యనాగపక్షితృణగుల్మలతాది సర్వజీవులకును సూర్యుం డాత్మ యగుచు నుండు. 73

క॥ కర మనురాగంబున నీ
ధరణీమండలము [3]సంవిధానం బెల్ల
న్నెఱిఁగించితి నింతియ కా
దెఱిఁగించెద సర్గమాన మెల్ల నరేంద్రా! 74

---

1 ఐశ్వర్యములు (మహిమలు), 2 బృంహణార్థము = పెంపొందించుటకు, 3 ఏర్పాటు.

భగణవిషయము

ఆ॥ కమలజాండమధ్యగతుఁడైన సూర్యుండు
భరితమైన యాతపంబుచేత
మూఁడులోకములను ముంచి తపింపఁగఁ
జేసి కాంతి నొందఁ జేయుచుండు. 75

వ॥ ఇట్లు భాస్కరుండు త్తరాయణ దక్షిణాయన విషువు లను నామంబులు గలమాంద్యతీవ్రసమానగతుల నారోహణావరోహణస్థానంబులయందు దీర్ఘహ్రస్వ సమానంబులుగాఁ జేయుచుండు. 76

ఆ॥ మేషతులలయందు [1]మిహిరుం డహోరాత్ర
మందుఁ దిరుగు సమవిహారములను
బరఁగఁగ వృషభాది పంచమాసముల నొ
క్కొక్క గడియ రాత్రి దక్కు నడచు. 77

ఆ॥ మించి వృశ్చికాది పంచమాసముల నొ
క్కొక్కగడియ రాత్రి నిక్కు నడచు
దినము లందు నెల్ల దిగజారు నొక్కొక్క
గడియ నెలకుఁ దప్పి కారమునను. 78

వ॥ మఱియు నివ్విధంబున దివసంబు లుత్తరాయణ దక్షిణాయనంబుల వృద్ధిక్షయంబుల నొంద, నొక్క యహోరాత్రంబున నేక పంచాశదుత్తరనవకోటియోజనంబుల పరిమాణంబు గల మానసోత్తర పర్వతంబున సూర్యరథంబు దిరుగుచుండు. ఆమానసోత్తర పర్వతంబునందుఁ దూర్పున దేవధాని యను నింద్రపురంబును, దక్షిణంబున సంయమని యను యమనగరంబును, పశ్చిమంబున నిమ్లోచని యను వరుణపట్టణంబును, నుత్తరంబున విభావరి యను సోముని [2]పుటభేదనంబును దేజరిల్లుచుండు; ఆ పట్టణంబుల యందు నుదయమధ్యాహ్నాస్తమయనిశీథంబు లనియెడు కాల

1 సూర్యుఁడు, 2 పట్టణము.

భేదంబులను భూతప్రవృత్తి నిమిత్తం బచ్చట జనులకుఁ బుట్టించు చుండు. సూర్యుం డెప్పు డింద్రనగరంబున నుండి గమనించు నది యాదిగాఁ బదియేను గడియలను రెండుకోట్ల ముప్పదియేడు లక్షలడెబ్బదియైదు వేలయోజనంబులు నడచు. ఇవ్విధంబున నింద్రయమవరుణపురంబులమీఁదఁ జంద్రాదిగ్రహనక్షత్రం బులం గూడి సంచరించుచుఁ బండ్రెం డంచులు నాలుగమ్ములును మూఁడు దొలులుం గలిగి సంవత్సరాత్మకంబయి యేకచక్రం బయిన సూర్యుని రథంబు ముహూర్తమాత్రంబున ముప్పది నాలుగులక్షలు నెనమన్నూఱు యోజనంబులు సంచరించు. 79

సీ॥ ఇనురథంబున కున్న యిరుసొక్కటియు మేరు
శిఖరంబు నందును జేరి యుండు
నొనరఁ జక్రము మానసోత్తర పర్వతం
బందులఁ దిరిగెడు నా రథంబు
నిరుసున నున్న రెం డిరుసులు దగులంగఁ
బవనపాశంబుల బద్ధమగుచు
ధ్రువమండలంబు నందుల నంటి యుండఁగా
సంచరించుచు నుండు సంతతంబు

తే॥ నట్టి యరదంబు ముప్పది యాఱులక్ష
లందు నంటిన కాఁడియు నన్ని యోజ
నముల విస్తారమై తురంగముల కంధ
రములఁ దగులుచు వెలుఁగొందు రమణతోడ. 80

వ॥ ఆరథంబునకు గాయత్రీచ్ఛందం బాదిగా సప్తచ్ఛందంబులు నశ్వంబులై సంచరించు. భాస్కరునకు నగ్రభాగంబున నరు ణుండు నియుక్తుండై రథంబు గడపుచుండు. వెండియు [1]నంగుష్ఠ పర్వమాత్రశరీరంబులు గల యఱువదివేల వాలఖిల్యాఖ్యు లగు

1 పోటనప్రేలి కణుపు.

ఋషివరులు సూర్యుని ముందట సౌరసూక్తంబుల స్తుతియింప మఱియు ననేకములును గంధర్వకిన్నరకింపురుషనాగాప్సరః పతంగాదులును నెల నెల వరుసక్రమంబున సేవింపం దొమ్మిది కోట్లునేఁబదియొకలక్ష యోజనంబులపరిమాణంబు గలభూమండలంబునం దొక క్షణంబున సూర్యుండు రెండువేలయేఁబది యోజనంబులు సంచరించుచు, నొక యహోరాత్రంబు నందె యీ భూమండలం బంతయు సంచరించు. అనిన శుకయోగీంద్రునకుఁ బరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 81

క॥ మునివర ! మేరుధ్రువులకు
నొనరఁ బ్రదక్షిణము దిరుగు చుండెడు*నజుఁ డా
యినుఁ డభిముఖుఁడై రాసుల
కనుకూలత నేగు నంటి వది యెట్లొప్పున్. 82

క॥ అని పలికిన భూవరునిం
గనుఁగొని శుకయోగి మిగులఁ గరుణాన్వితుఁడై
మనమున శ్రీహరిఁ దలఁచుచు
విను మని క్రమ్మఱఁగ నిట్లు వినిపించెఁ దగన్. 83

వ॥ నరేంద్రా! యతి వేగంబునఁ దిరుగుచుండు [1]కులాలచక్రంబునందు జక్రభ్రమణంబునకు వేఱైన [2]గతినొంది బంతి సాగి తిరిగెడు పిపీలికాదుల చందంబున, నక్షత్రరాసులతోడం గూడిన కాలచక్రంబు ధ్రువమేరువులం బ్రదక్షిణంబు దిరుగు నపుడా కాలచక్రంబునెదుర సంచరించు సూర్యాది గ్రహంబులకు నక్షత్రాంతరంబులయందును రాశ్యంతరంబులయందును నునికి గలుగుటం జేసి సూర్యాదిగ్రహంబులకుఁ జక్రగతిస్వగతులవలన గతిద్వయంబు గలుగుచుండు. మఱియు నా సూర్యుం డాదినారాయణమూర్తి

---

* యానూ ర్యునకును రాసుల కెదురుగఁ జనుచందము తేటపడఁగఁ జను తెఱఁగింపక — అని పాఠాంతరము.

1 కుమ్మరి సారె, 2 నడకను.

యగుచు లోకంబుల యోగక్షేమంబులకు వేదత్రయాత్మకంబై కర్మసిద్ధినిమిత్తంబై దేవర్షిగణంబులచేత వేదాంతార్థంబుల ననవరతంబు [1]వితర్క్యమాణం బగుచున్న తనస్వరూపంబును ద్వాదశవిధంబులుగ విభజించి వసంతాదిఋతువుల నాయా కాల విశేషంబులయందుఁ గలుగఁ జేయుచుండును. అట్టి పరమ పురుషుని మహిమ నీలోకంబున మహాత్ములగు పురుషులు దమ తమ వర్ణాశ్రమాచారముల చొప్పున వేదోక్తప్రకారంబుగా భక్త్యతిశయంబున నారాధించుచు క్షేమంబు నొందుచుందురు. అట్టి యాదినారాయణమూర్తి జ్యోతిశ్చక్రాంతర్వర్తియై స్వకీయ తేజఃపుంజదీపితాఖిలజ్యోతిర్గణంబులుగలవాఁడై ద్వాదశరాసుల యందు నొక సంవత్సరంబున సంచరించుచుండు. అట్టి యాదిపురుషుని గమన విశేషకాలంబును లోకు లయనఋతుమాసపక్షతిథ్యాదులచే వ్యవహరించుచుందురు; మఱియు నప్పరమపురుషుం డారాసులయందు షష్ఠాంశసంచారంబు నొందిన సమయంబును ఋతు వని వ్యవహరింపుదురు. ఆ రాసులయందు నర్థాంశ సంచారమ్మున రాశిషట్కభోగం బొందినతఱి నయనం బని చెప్పుదురు. సమగ్రంబుగా రాసులయందు సంచార మొందినయెడల నట్టి కాలంబును సంవత్సరంబని నిర్ణయింపుదురు. అట్టి సమగ్రరాశి సంచారంబునందు శీఘ్రగతి మందగతి సమగతు లనియెడు త్రివిధ గతివిశేషంబులవలన వేఱుపడెడు నావత్సరంబును సంవత్సరంబు పరివత్సరం బిడావత్సరం బను వత్సరం బిద్వత్సరం బని పంచ విధంబులఁ జెప్పుదురు. చంద్రుండు నీ తెఱంగున నా సూర్య మండలంబు మీఁద లక్ష యోజనంబులనుండి సంవత్సరపక్షరాశి నక్షత్రభుక్తులు గ్రహించుచు నగ్రచారియై శీఘ్రగతిం జరించు. అంత వృద్ధిక్షయరూపంబునం బితృగణంబులకుఁ బూర్వపక్షాపర పక్షంబులచేత నహోరాత్రంబులఁ గలుగఁ జేయుచు సకలజీవ ప్రాణంబై యొక్కనక్షత్రంబు త్రింశన్ముహూర్తంబు లనుభ

1 వితర్కింపఁ బడుచున్న

వించుచు షోడశకళలు గలిగి మనోమయాన్నమయామృతమయ
దేహుండై దేవపితృమనుష్యభూతపశుపక్షిసరీసృపవీరుత్ప్ర
భృతులకుఁ బ్రాణాప్యాయశీలుం డగుటం జేసి సర్వసముం డనం
బడు. 84

క॥ చందురునకు మీఁదై యా
నందంబున లక్షయోజనంబులఁ దారల్
గ్రందుకొని మేరుశైలం
బంది ప్రదక్షిణము దిరుగు [1]నభిజిద్భముతోన్. 85

సీ॥ అటమీఁదఁ దారల కన్నిటి కుపరి యై
రెండులక్షల శుక్రుఁ డుండి భాస్క
రునిముందటం బిఱుఁ దను సామ్యమృదుశీఘ్ర
సంచారములను భాస్కరునిమాడ్కిఁ
జరియించుచుండును జనులకు ననుకూలుఁ
డై వృష్టినొసఁగుచు నంతనంతఁ
జతురత వృష్టివిష్కంభకగ్రహశాంతి
నొనరించువారల కొసఁగుశుభము

తే॥ లుండు నామీఁద సౌమ్యుండు రెండు లక్ష
లను జరించుచు రవిమండలంబుఁ బాసి
కానఁబడినను జనులకు క్షామడాంబ
రాదిభయములఁ బుట్టించు నతులమహిమ. 86

సీ॥ ధరణీతనూజుఁ డం తటిమీఁద రెండు ల
క్షలనుండి మూఁడు పక్షముల నొక్క
రాశిదాఁటుచు నుండుఁ గ్రమమున ద్వాదశ
రాసులు భుజియించు రాజసమున

1 అభిజిన్నక్షత్రము.

వక్రించియైన నవక్రత నైనను
దలఁచుగాఁ బీడలు నరుల కొసఁగు
నంగారకుని[1] కెంకి కావల రెండు ల
క్షలయోజనంబుల ఘనత మించి

ఆ॥ యొక్కరాశినుండి యొక్కొక్కవత్సరం
బనుభవించుచుండు నమరగురుఁడు
వక్రమందునైన [2]వసుధామరులకును
శుభము నొసఁగు నెపుడు నభినవముగ. 87

క॥ సురగురునకు మీఁదై భా
స్కరసుతుఁ డిరులక్షలను జగములకు బీడల్
జరపుచుఁ [3]ద్రింశన్మాసము
లరుదుగ నొక్కొక్కరాశి యందు వసించున్. 88

క॥ ప్రాకటముగ రవిసుతునకు
నేకాదశలక్షలను మహీసురులకు నీ
లోకులకు మేలు గోరుచుఁ
జోకగ మునిసప్తకంబు సొంపువహించున్. 89

క॥ మునిసప్తకమున కెగువం
దనరుచు నామీఁద ద్రియుతదశలక్షలఁ బెం
పున శింశుమారచక్రం
బనఁగా నిన్నిఁటికి నుపరి యగుచుండు నృపా! 90

సీ॥ ఆ శింశుమారాఖ్య మగు చక్రమున భాగ
వతుఁడైన ధ్రువుఁ డింద్రవరుణకశ్య
పప్రజాపతియమప్రముఖులతోఁ గూడి
బహుమానముగ [4]విష్ణుపదముఁ జేరి

---

1 నివాసస్థానము, 2 బ్రాహ్మణులకు, 3 ముప్పదిమాసములు, 4 ఆకాశము,

కణఁకనిచ్చలుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుచుఁ
జెలఁగియుండును గల్పజీవి యగుచు
ననఘుఁ డుత్తానపాదాత్మజుఁ డార్యుఁడు
నయిన యాధ్రువుని మహాత్త్వమెల్లఁ

తే॥ తెలిసి వర్ణింప బ్రహ్మకు నలవిగాదు
నే నెఱింగినయంతయు నీకు మున్న
తెలియఁ బలికితిఁ గ్రమ్మఱఁ దలఁచికొనుము
జితరిపువ్రాత! శ్రీపరీక్షిన్నరేంద్ర! 91

వ॥ మఱియు నాధ్రువుండు నిమిషమాత్రంబు నెడలేక సంచరించు జ్యోతిర్గ్రహనక్షత్రంబులకు నీశ్వరునిచేత ధాన్యాక్రమణంబునఁ బశువులకై యేర్పఱిచిన మేధిస్తంభంబుతెఱంగున మేటిగాఁ గల్పింపంబడి ప్రకాశించుచుండు. గగనంబునందు మేఘంబులును శ్యేనాది పక్షులును వాయువశంబునం గర్మసారథులై చరించు తెఱంగున జ్యోతిర్గణంబులును బ్రకృతిపురుషయోగగృహీతాశులై కర్మనిమిత్తగతి గలిగి వసుంధరం బడుదురు. 92

క॥ పొందుగ జ్యోతిర్గణముల
నందముగా శింశుమార మందుల నుండం
గొందఱు దఱచుగఁ జెప్పుచు
నుందురు వినిపింతు విను మనూనచరిత్రా! 93

క॥ తలక్రిందై వట్రువ యై
సలలిత మగు శింశుమార చక్రమునందుం
దెలకొని పుచ్ఛాగ్రంబున
నిలిచి ధ్రువుం డుండు నెపుడు నిర్మలచరితా! 94

వ॥ మఱియు నాశింశుమారచక్ర[1]పుచ్ఛంబునఁ బ్రజాపతియు నగ్నీంద్ర ధర్ములును, బుచ్ఛమూలంబున ధాతృవిధాతలును. గటి

---

1 లోఁకయందు,

ప్రదేశంబున ఋషిసప్తకంబును, దక్షిణావర్తకుండలీభూతభూత
శరీరంబునకు నుదగయననక్షత్రంబులును, దక్షిణపార్శ్వంబున
దక్షిణాయన నక్షత్రంబులును, బృష్ఠంబున దేవమార్గంబును
నాకాశగంగయు, నుత్తరభాగంబునఁ బునర్వసుపుష్యంబులును,
దక్షిణభాగంబున నార్ద్రాశ్లేషలును, దక్షిణవామపాదంబుల నభి
జిదుత్తరాషాఢలును, దక్షిణ వామనాసారంధ్రంబుల శ్రవణ
పూర్వాషాఢలును, దక్షిణవామలోచనంబుల ధనిష్ఠామూలలును.
దక్షిణవామకర్ణంబుల మఘాదినక్షత్రంబులును, వామపార్శ్వం
బున దక్షిణాయనంబును, దక్షిణపార్శ్వంబునఁ గృత్తికాదినక్షత్ర
త్రయంబును నుత్తరాయణంబును, వామదక్షిణస్కంధంబుల శత
భిజ్జ్యేష్ఠలును, నుత్తమహానువున నగస్త్యుఁడును, నపరహానువున
యముండును, ముఖంబున నంగారకుండును, గుహ్యంబున శనై
శ్చరుండును, మేఢ్రంబున బృహస్పతియును, వక్షంబున నాది
త్యుండును, నాభిని శుక్రుండును, మనంబునఁ జంద్రుండును,
స్తనంబుల నాశ్వినులును, ప్రాణాపానంబుల బుధుండును, గళం
బున రాహువును, సర్వాంగంబులఁ గేతుగ్రహంబును, రోమం
బులఁ దారలును నుండును. అది సర్వదేవతామయంబైన
పుండరీకాక్షుని దివ్యదేహంబు ధ్రువునింగా నెఱుంగుము. 95

సీ॥ ఇట్టి దివ్యశరీర మెవ్వఁడు ప్రతిదినం
బందు సంధ్యాకాల మతులభక్తి
మనమందు నిలిపి యేమఱక మిక్కిలి ప్రయ
త్నంబున నియతుఁడై తత్త్వబుద్ధి
మౌనవ్రతంబునఁ బూని వీక్షించుచు
నీసంస్తవంబు దా నెంతో ప్రేమ
జపియించి కడుఁ బ్రశస్తమును మునీంద్రసే
వ్యమును జ్యోతిస్స్వరూపమున వెలుఁగు

ఆ॥ విపులశింశుమారవిగ్రహంబునకు వం
దనము వందనంబు లనుచు నిలిచి
సన్నుతించె నేని సకలార్థసిద్ధులఁ
బొందు మీఁద ముక్తిఁ జెందు నధిప! 96

క॥ ఇనమండలంబునకుఁ గ్రిం
దను దశసాహస్రయోజనంబుల స్వర్భా
నుని మండలంబు గ్రహ మై
ఘనముగ నపసవ్యమార్గగతి నుండు నృపా! 97

క॥ అనురాధముఁ డగు రాహువు
[1]బిసరుహసంభవుని వరము పెంపున నెంతో
పస యగు నమరత్వంబున
నసమానం బైనగ్రహవిహారముఁ బొందెన్. 98

సీ॥ జననాథ! రాహువు జన్మకర్మంబులు
వినిపింతు ముందఱ విస్తరించి
యయుతయోజనవిస్తృతార్కమండలము ద్వా
షట్సహస్రవిశాలచంద్రమండ
లముఁ బర్వకాలంబులను ద్రయోదశసహ
స్రవిశాలమై మీఁద రాహు గప్పు
నది సూచి [2]యుపరాగ మనుచును బలుకుదు
రెల్లవారును స్వధర్మేచ్ఛ లగుచు

ఆ॥ నంతలోన నినశశాంకమండలములఁ
గరుణఁ బ్రోవఁ దలఁచి హరి సుదర్శ
నంబు వచ్చు ననుభయంబున నైదాఱు
గడియలకును రాహు [3]నడఁకి తొలఁగు. 99

క॥ నరవర యీ రాహువునకు
నరసత నా క్రింద సిద్ధ చారణ విద్యా

1 బ్రహ్మ, 2 గ్రహణము, 3 నడఁకు = చలించు (ఒదుఁగు) వెనుదీయు.

ధరు లయుత యోజనములఁ
దిరముగ వసియించి లీలఁ దిరుగుదు రచటన్. 100

క॥ పరికింప సిద్ధవిద్యా
ధరులకుఁ బదివేలు క్రింద దరలక యక్షుల్
మఱియును భూతప్రేతులు
జరియింతురు రాక్షసులు పిశాచులు గొలువన్. 101

ఆ॥ వారిక్రిందఁ దగిలి వాయువశంబున
మలయుచుండు మేఘమండలంబు
మేఘమండలంబు మీఁదగఁ జుండు భూ
మండలంబు క్రింద నుండు నధిప! 102

వ॥ అట్టి భూమండలంబు క్రింద యోజనాయుతాంతరంబున నండక టాహాయామంబు గలిగి క్రమంబున నొండొంటికిం గ్రిందగుచు, నతలవితలసుతలరసాతలతలాతలమహాతల పాతాళలోకంబులుండు. అట్టి బిలస్వర్గంబులయందు సుపరిస్వర్గంబున కధికం బైన కామ భోగంబుల నైశ్వర్యానందంబులను సుసమృద్ధవనోద్యానక్రీడా విహారస్థానంబుల ననుభవించుచు దైత్యదానవ[1]కాద్రవేయాది దేవయోనులు నిత్యప్రముదితానురక్తు లగుచుఁ గళత్రాపత్య సుహృద్బంధుదాసీదాసపరిజనులతోఁ జేరుకొని మణిగణఖచి తంబులగు నతి రమణీయగృహంబులయందు నీశ్వరునివలనం జేటులేనికాయంబులు గలిగి వివిధమాయావిశేషవినిర్మితనూతన కేళీసదనవిహారణమండపవిచిత్రోద్యానాదులయందుఁ గేళీవినో దంబులు సలుపుచుఁ జరియింతురు. అంత. 103

సీ॥ అట్టిపాతాళంబు లందును మయకల్పి
తము లగు పుటభేదనముల యందు
బహురత్ననిర్మితప్రాకారభవనగో
పురసభాచైత్యచత్వరవిశేష

1 సర్పములు (నాగులు).

ములయందు నాసురాదుల మిథునములచే
శుకపికశారికానికరసంకు
లముల శోభిల్లు కృత్రిమభూములను గల
గృహములచే నలంకృతములగుచు

ఆ॥ కుసుమచయసుగంధి కిసలయస్తబకసం
తతులచేత ఫలవితతులచేత
నతులరుచిరనవలతాంగనాలింగిత
విటపములను గలుగు విభవములను. 104

వ॥ మఱియు నానావిధజలవిహంగమ మిథునంబులుగలిగి, నిర్మలజల పూరితంబులై మత్స్యకులసంచారక్షుభితంబు లైన కుముదకువల యకహ్లారలోహిత[1]శతపత్త్రాదికంబులం దేజరిల్లెడు సరోవరంబులు గల యుద్యానవనంబులయందుఁ [2]గృతనికేతనులై స్వర్గభూముల నతిశయించిన వివిధవిహారంబులు గలిగి యహోరాత్రాదికాల విభాగభయంబులు లేక మహాహిప్రవరుం డయిన శేషుని శిరో మణిదీధితులచే నంధకారోపద్రవంబు లేక యెల్లప్పుడు [3]దివసాయ మానంబుగా నుండు నా లోకంబునందు నఖిలజనులు దివ్యౌషధి రసరసాయనంబుల ననవరతంబు నన్నపానంబులుగా సేవించుటం జేసి యచ్చటివారలకు నాధివ్యాధులును వలితఫలితంబులును, జరారోగంబులును శరీరవైవర్ణ్యంబులును స్వేదదౌర్గంధ్యంబులును గలుగక పరమకల్యాణమూర్తులగుచు హరిచక్రభయంబు దక్క నన్యం బగు మృత్యుభయంబు నొందక యుందురు. అదియునుంగాక,

తే॥ అట్టి పాతాళలోకంబు నందు విష్ణు
చక్ర మెప్పుడేనిని బ్రవేశంబు నొందు
నప్పు డెల్లను దైత్యకులాంగనలకు
గర్భసంపద లందంద కరఁగు చుండు. 106

1 పద్మము, 2 నివాసము గల్పించుకొన్నవారు, 3 పగటివలె నైనది.

చ॥ అతలమునందు నమ్మయుని యాత్మజుఁడైన బలాసురుండు స
మ్మతిఁ జరియించు [1]షణ్ణవతిమాయలఁ గూడి వినోద మందుచుం
గుతలములందు నేఁడు నొకకొందఱు నచ్చటిమాయఁ జెంది సం
తతముఁ జరించుచుండుదురు దప్పక మోహనిబద్ధచిత్తులై. 107

వ॥ అట్టి బలుని యావలింతలును [2]స్వైరిణులు కామినులు [3]పుంశ్చలులను స్త్రీగణంబులు జనియించిరి. ఆ కామినీజనంబులు పాతాళంబుఁ బ్రవేశించిన పురుషునికి హాటకరసం బనియెడు సిద్ధరసఘుటిక నిచ్చి రససిద్ధునిం గావించి యతనియందు స్వవిలాసావలోకనానురాగస్మితసల్లాపోపగూహనాదుల నిచ్ఛావిహారంబులు సలుపుచుండ నాపురుషుండు మదాంధుండై తానె సిద్ధుండ ననియును నాగాయుతబలుండ ననియును దలంచి నానావిధరతిక్రీడలఁ బరమానందంబు నొందుచుండు. 108

సీ॥ హాటకేశ్వరుఁడైన యంబికాధీశుండు
వితలంబునందుల వేడ్కఁ నిలిచి
తనదుపార్షద భూతతతులతో బ్రహ్మాస
ర్గోపబృంహణమున నొక్కచోటఁ
బార్వతీసంభోగ పరుఁడగుచుండఁగా
వారలవీర్యంబు వలనఁ బుట్టి
నట్టిది హాటకి యనియెడినది యని
లాగ్నులు భక్షించి యందు నుమియ

తే॥ నదియు హాటక మనుపేర నతిశయిల్లి
వన్నె మీఱుచు శుద్ధ సువర్ణ మయ్యె
నాసువర్ణంబు నాలోకమందు నున్న
జనుల కెల్లను వినుత భూషణము లయ్యె. 109

---

1 తొంబదిఆఱు, 2 స్వైరిణి = ఇష్టము వచ్చినట్లు తిరుగులాడుది, 3 జంకులాండ్రు.

సీ॥ ఆ క్రింద సుతలంబునందు మహాపుణ్యుఁ
డగు విరోచనపుత్రుఁ డైనయట్టి
బలిచక్రవర్తి యాపాకశాసనునకు
ముద మొసంగఁగఁ గోరి యదితిగర్భ
మున వామనాకృతిఁ బుట్టి యంతటఁ ద్రివి
క్రమరూపమునను లోకత్రయంబు
నాక్రమించిన దానవారాతిచేత ముం
దటన యీఁబడినయింద్రత్వ మిట్లు

ఆ॥ గలుగువాఁడు పుణ్యకర్మసంధానుండు
హరిపదాంబుజార్చనాభిలాషుఁ
డగుచు శ్రీరమేశు నారాధనము సేయు
చుండు నెపుడు నతి మహోత్సవమున. 110

వ॥ నరేంద్రా! సకలభూతాంతర్యామియు దీర్ఘభూతుండును నయిన వాసుదేవునియందుఁ జిత్తంబు గలిగి యిచ్చిన భూదానంబునకు సాక్షాత్కరించిన మోక్షంబు ఫలంబగుం గాని పాతాళస్వర్గ రాజ్యంబులు ఫలంబులు గానేరవు. అయిన నెవ్వరికిని మోక్షంబు సాక్షాత్కృతంబు గాకుండుటం జేసి లోక ప్రదర్శనార్థంబు పాతాళ స్వర్గరాజ్యంబుల నిచ్చె. [1]క్షుతపతన ప్రస్ఖలనాదులందును వివశుం డైన యెడల నామస్మరణంబు సేయుపురుషుండు గర్మబంధంబున లన విముక్తుండగుచు సుజ్ఞానంబునం బొందునట్టి వాసుదేవుం డాత్మజ్ఞానప్రపోషణంబు సేయు. మాయామయంబు లైన భోగై శ్వర్యంబుల నెల్ల నెట్లొసంగు ననవలదు; భగవంతుండు యాచన సేసి సకలసంపదలఁ జేకొని శరీరమాత్రావశిష్టునిం జేసి వారుణ పాశంబులం గట్టి విడిచినప్పుడు బలీంద్రుం డిట్లనియె. 111

1 క్షుత = తుమ్ము.

సీ॥ పరమేశ్వరునకు నెప్పటిపదార్థములందుఁ
దృష్ణ లేకుండుట దెలిసినాఁడ
నింద్రాదు లెల్ల నుపేంద్రునిఁ బ్రార్థించి
యడిగిరి గాని శ్రీ హరికిఁ గోరి
కలు లేవు మిక్కిలి గంభీర మగు మహా
కాలస్వభావంబు గలుగు చుండ
నరయంగ మన్వంత రాధిపత్యమును లో
కత్రయంబును నెంత కాన తలఁప

ఆ॥ మత్పితామహుండు మానవంతుండు ప్ర
హ్లాదవిభునిఁ జూచి హర్ష మంది
యెద్దియైనఁ గోరు మిచ్చెద ననుటకు
నంతలోన నీశ్వ రాజ్ఞఁ దెలిసి. 112

వ॥ ఇట్లు కృతార్థుండై పిత్ర్యంబయిన రాజ్యంబు నొల్లక పరమే
శ్వరుదాస్యంబ కోరె. ఆ ప్రహ్లాదచరిత్రకథనావసరమ్మున నీ తం
డ్రికిని నీకును విశేషంబుగా నే పురుషుండు భగవదనుగ్రహంబుఁ
బొంద నోపు నని పుండరీకాక్షుం డానతిచ్చిన వాక్యంబులు వక్ష్య
మాణగ్రంథంబున విస్తరించెద, నా బలిచక్రవర్తి గృహద్వారం
బున నఖిలలోక గురుండగు న శ్రీమన్నారాయణుండు గదాపాణి
యును నిజజనానుకంపితుండును శంఖచక్రాద్యాయుధ ధరుండును
నగుచు నిప్పుడును దేజరిల్లుచుండు. అట్టి బలిద్వారంబున లోకం
బుల గెలువ నిచ్చగొన్న దశగ్రీవుం డుల్లంఘితశాసనుండై ప్రవే
శంబు గావింప న య్యాదిపురుషుండు దనపాదాంగుష్ఠంబున యో
జనాయుతాయుతంబులం బాఱం జిమ్మె. వినుము. 113

క॥ అసుతలమునకుఁ గ్రిందై
భాసిల్లుఁ దలాతలంబు ప్రభు వందు మయుం
డాసురపురనిర్మాతగ
వాసిగఁ బొగడొంది యేలు వసుధాధీశా! 114

చ॥ పురహరుచే రమేశ్వరుఁడు భూతహితార్థముగాఁ బురత్రయం
బరుదుగ నీఱు సేసె శరణాగతు నామయుఁ గాచి యెంతయుం
గరుణఁ దలాతలంబునకుఁ గర్తగ నిల్పిన నున్నవాఁడు శ్రీ
ధరుని సుదర్శనంబునకుఁ దప్పి విముక్తభయుండు గాఁ దగన్.

క॥ తలఁపఁగ నాక్రింద మహా
తలమునఁ గద్రూవధూటి తనయులు సర్పం
బులు గలవు పెక్కు శిరములు
నలరంగాఁ గ్రోధవశగణావళి యనఁగన్. 116

వ॥ మఱియును గుహకతక్షకకాళియసుషేణాదిప్రధాను లయిన వార
లతులశరీరంబులు గలిగి యాదిపురుషుని వాహనం బైన పతగ
రాజభయంబున ననవరతంబు [1]నుద్వేజితు లగుచు స్వకళత్రా
పత్యసుహృద్బాంధవ సమేతులయి యుండుదురు. ఆ క్రింద రసా
తలంబున దైత్యులు దానవులు నగు నివాతకవచకాలకేయు లను
హిరణ్యపురనివాసు లగు దేవతాశత్రువులు మహాసాహసులును
దేజోధికులును నగుచు సకలలోకాధీశ్వరుం డైన శ్రీహరి తేజంబు
నం [2]బ్రతిహతులై వల్మీకంబునందు నడంగి యున్న సర్పంబుల
చందంబున నింద్రదూత యగు సరమచేఁ జెప్పఁబడెడు మంత్రా
త్మకవాక్యంబులకు భయంబు నొందుచుండుదురు. 117

క॥ [3]ఇందుకులోద్భవ! వినుమా
క్రిందటిపాతాళమునను గ్రీడించుచు నా
నందము నొందుచు నుండును
సందడిఁబడి నాగకులము చతురతతోడన్. 118

వ॥ ఇట్లు వాసుకిప్రముఖు లైన శంఖకుళికమహాశంఖశ్వేతధనంజయ
ధృతరాష్ట్రశంఖచూడకంబళాశ్వతరదేవదత్తాదులయిన మహానా
గంబు లైదు నేడు పదినూఱువేయిశిరంబులు గలిగి ఫణామణి
కాంతులం జేసి పాతాళతిమిరంబును బాపుచుండుదురు. 119

---

1 ఉద్వేజితులు = బెదరువారు, 2 ఓడినవారై, 3 చంద్రవంశమునఁ బుట్టినవాఁడా.

సీ॥ పాతాళలోకంబు పాఁతున శేషుండు
వెలయంగ ముప్పదివేలయోజ
నంబుల వెడలుపునను దోఁకఁ జుట్టగా
జుట్టుక యుండు, విష్ణునిమహోగ్ర
మైన తాను శరీరమైన యనంతాఖ్య
సంకర్షణుం డుండు సంతతంబు
నట్టి యనంతనామాభిధానుని మస్త
కమున సిద్ధార్థంబు కరణి ధరణి

ఆ॥ యంత నావిభుండు నఖిలలోకంబుల
సంహరింపఁ గోరి చండకోప
వశత సృజనఁజేయు వరుస నేకాదశ
రుద్రమూర్తు లనెడు రౌద్రమతుల. 120

ఆ॥ అట్టిరుద్రమూర్తు లతులత్రినేత్రులు
నఖిలశూలహస్తు లగుచు నుందు
రందు నున్న ఫణికులాధిపుల్ శేషుని
పాదపంకజముల భక్తిఁ జేరి. 121

ఆ॥ నమ్రులగుచు ననుదినంబును మౌళిర
త్నముల చేతఁ గడు ముదంబు నొంది
కోరికలు దలిర్ప నీరాజనంబుల
నిచ్చుచుండు రెపుడు మచ్చికలను. 122

వ॥ మరియు నా సంకర్షణమూర్తిం జేరి నాగకన్యకలు కోరికలు గల వార లగుచు నొప్పెడి శరీరవిలాసంబులం జేసి యగరుచందన కుంకుమపంకంబులను లేపనంబులు సేయుచు సంకర్షణమూర్తి దర్శనస్పర్శనాదుల [1]నుదో్భధితమకరధ్వజావేశితచిత్తంబులు గలిగి చిఱునవ్వు లొలయ నధికాభిలాషం జేసి స్మితావలోకనంబుల

1 ఉదో్భధిత = రేఁపఁబడిన, మకరధ్వజ + కామముచే, ఆవేశిత = తన్మయములయిన, చిత్తంబులు = మనస్సులు,

[1]సవ్రీడితలై యవలోకించుచుండ ననంతగుణంబులు గలయనంత దేవుం డుపసంహరింపం బడిన క్రోధంబు గలిగి, లోకంబులకు క్షేమంబు గోరుచు, సురాసురసిద్ధగంధర్వవిద్యాధరమునిగణంబు లనవరతంబు ధ్యానంబు సేయ సంతతసంతోషాతిశయంబున భ్రమాఁగన్ను వెట్టుచు, సలలితగీతవాద్యంబుల నానందంబు నొందుచుఁ దన పరిజనంబుల నతిస్నేహంబున నవలోకించుచు నవతులసీగంధపుష్పరసామోదితమధుకరవ్రాతమధురగీతంబులు గల వైజయంతీ వనమాలికల ధరియించుచు నీలాంబరధరుండును హలధరుండును నగుచు నితండు మహేంద్రుండో హరుండో యనుచు జనంబులు వలుకుచుండఁ గాంచనాబరధరుండై ముముక్షువులు ధ్యానంబులు సేయ నధ్యాత్మవిద్యాయుక్తం బయిన యానందహృదయగ్రంథిని భేదించు నట్టి శేషుని స్వాయంభువుండగు నారదుండు తుంబురుప్రభృతు లగు ఋషిశ్రేష్ఠులతోఁ జేరఁగొని కమలాసనుని సభాస్థానమునందు నిట్లు స్తుతియించుచుండు. 123

సీ॥ ఓలిమై నెవ్వని లీలావినోదముల్
జన్మసంరక్షణక్షయములకును
హేతువు లగుచుండు, నెవ్వని చూపుల
జనియించె సత్త్వ రజస్తమంబు,
లెవ్వనిరూపంబు లేకమై బహువిధం
బులను జగత్తులఁ బ్రోచుచుండు,
నెవ్వని నామంబు లెఱుఁగక తలఁచిన
యంతన దురితంబు లఁడఁగుచుండు

తే॥ నట్టి సంకర్షణాఖ్యుండు నవ్యయుండు
నైన శేషుని వినుతి సేయంగఁ దరమె

1 సిగ్గుకలవారై.

తలఁప నెప్పుడు వాఙ్మనంబులకు నింక
మూఁడులోకంబు లందును భూతతతికి? 124

ఆ॥ మఱియుఁ బెక్కుగతుల మాబోఁటివారల
బ్రోవఁ దలఁచి శేషమూర్తి సాత్త్వి
కస్వభావ మొందెఁ గడఁకతో నట్టి శే
షునకు మ్రొక్కుచుందు ననుదినంబు. 125

వ॥ మఱియు నాశేషుని నెవ్వండేని నాకస్మికంబుగ నయినను నార్తుం డగుచు నయినను స్మరించినమాత్రాన, యఖిల పాపంబులం బాసి సకల శ్రేయస్సులం బొందు నట్టి శేషునిసే ముముక్షువు లాశ్ర యించి ధ్యానం బొనర్చి భవబంధనిర్ముక్తు లగుదురు. అతని ఫణం బుల యందు భూగోళం బణుమాత్రం బగుచునుండు. అతని మహి మలు గణుతింప సహస్రజిహ్వాలుగల పురుషుండైన నోపండని పలుకుచుందురు. ఆయనంతుండు పాతాళంబున నుండి సకలలోక హితార్థంబు భూమిని ధరియించు నని లోకతిర్యఙ్మనుష్య గతులను లోకస్థితియును శుకయోగీంద్రుండు వినిపించి యింక నేమి విని పింతు నెఱింగింపు మనినం, బరీక్షిన్నరేంద్రుండు శుకయోగీం ద్రున కిట్లనియె. 126

క॥ మునివర లోకచరిత్రం
బనుపమము మహావిచిత్ర మగునట్లుగ నా
కును వినిపించితి వంతయుఁ
బనుపడి నా చిత్తమందుఁ బాయకనిలిచెన్. 127

వ॥ అనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 128

ఆ॥ జంతుజాలములకు శ్రద్ధలు త్రిగుణాత్మ
కములు గాన వారి కర్మగతుల
తారతమ్యములును దగిలి యిన్నియు వివి
ధంబు లగుచు సంతతంబు నుండు. 129

వ॥ నరేంద్రా! ప్రతిషిద్ధలక్షణంబగు నధర్మం బాచరించు నరుని శ్రద్ధ

విపరీతంబుగాఁ బ్రవర్తిల్లు. నట్టివానికిఁ గలిగెడి కర్మఫలంబును విపరీతంబు గానె యుండుం గావున ననాద్యకామప్రవర్తల వలనఁ బెక్కు తెఱంగులఁ గలిగెడు కర్మగతుల సంగ్రహంబుగ నెఱింగిం చెద ననిన శుకునితోఁ బరీక్షిన్నరేంద్రుం డి ట్లనియె. 130

ఆ॥ మునివరేణ్య! నరకములు ముజ్జగంబుల
యందొ యంతరాళ మందొ వెలినొ
యదియుఁ గాక దేశమందుండు భూవిశే
షములయందొ తెలుపు సంతసమున. 131

వ॥ అనిన శుకయోగీంద్రుం డి ట్లనియె. 132

శుకయోగి పరీక్షిత్తునకుఁ దెలిపెడి నరకలోక వర్ణనము

క॥ ఎడతెగక ముజ్జగంబుల
కడపల నయ్యామ్యదిశను గదలక నిలుచుం
గడుఘోరములుగ నరకము
లడరంగా నంతరాళమందుల నధిపా! 133

వ॥ మఱియును దక్షిణంబున నగ్నిష్వాత్తాదిపితృగణంబులు తమ గోత్రజులకు మేలుగలుగుట కొఱకు సత్యంబులగు నాశీర్వాదంబుల నొసంగు చుండుదురు. అచ్చటి పితృపతి యగు శమనుండు దనలోకంబునకుం జనుదెంచుజంతువుల కర్మంబులకుం దగినఫలంబుల నిచ్చి శిక్షించుచునుండు. అందుఁ దామిస్రంబును నంధతామిస్రంబును రౌరవంబును మహారౌరవంబును గుంభీపాకంబును గాలసూత్రంబును, నసిపత్త్రవనంబును సూకరముఖంబును నంధకూపంబును గ్రిమిభోజనంబును సందంశంబును దప్తోర్మియు వజ్రకంటకశాల్మలియు వైతరణియుఁ బూయోదంబును బ్రాణరోధంబును విశసనంబును లాలాభక్షంబును సారమేయాదనంబును నవీచిరయంబును రేతఃపానంబును నను నేకవిశంతి మహానరకంబులును, మఱియును క్షారకర్దమంబును రక్షోగణభోజనంబును శూలప్రోతంబును దందశూకంబును నవటనిరోధనంబును బర్యావర్తనంబును సూచీముఖంబును

నన సప్తవిధనరకంబులతోడం గూడి యష్టావింశతినరకంబులు
గల వని కొందఱు నొడువుదురు. అందు. 134

క॥ పరపుత్రకళత్రంబులఁ
బరికింపక యపహసించు పాపాత్ముఁడు దు
ష్కరపాశబద్ధుఁ డై యమ
పురుషులచే నధిక బాధఁ బొందుచు నుండున్. 135

వ॥ మఱియు నవ్విధంబున బాధితుం డగుచుఁ దామిస్రనరకంబునం
బడి యనశనాద్రిపాతనదండతాడనతర్జనాదిబాధలం జెంది
కడుభయంబున మూర్ఛలం బొందు చుండు. 136

క॥ పరకాంత నెవ్వఁడేనిం
బురుషుం డుండంగ [1]మొఱఁగి పొందిన యమకిం
కరు లతనిఁ బట్టి వడిఁ ద
త్తఱమునఁ బడవైతు రంధతామిస్రమునన్. 137

వ॥ నరేంద్రా! యెవ్వఁడేనిం గుటుంబపోషణార్థంబు పరులకు ద్రోహం
బుసేయు నానరుండు రౌరవనరకంబునం బడు. ఎవ్వం డిహలోకం
బునందు స్వేచ్ఛావిహారంబున సంచరించుచుఁ బరోపద్రవపరాఙ్ము
ఖంబు లయి యుండు పశుపక్షిమృగాదుల బాధించ నాయామృ
గంబులు రురురూపంబులఁ దాల్చి యట్టిపాపజనుల నానావిధ
యాతనల బాధించుటం జేసి రౌరవమహారౌరవనరకంబు లనంబడు.
నెవ్వండేని దేహపోషణార్థంబు మూషకాదుల బిలనిరోధంబుసేసి
వధించు నానిష్కరుణుండైన పురుషునిం గుంభీపాక నరకంబుల
యందుఁ గళత ప్తతైలంబులం బెక్కుబాధలం బొందింతురు. 138

సీ॥ తల్లిదండ్రులకును ధరణీసురులకును
నహితంబుసేసిన యట్టివాఁడు
కాలసూత్రంబను కడుఁదీవ్ర నరకంబు
నందును, నందంద యయుతయోజ

[1] మొఱఁగి=దాఁగి.

నాయతపాత్రాదు లందుల సూర్యుఁడా
మీఁద గ్రిందను వహ్ని మిగుల మండ
నత్యంత క్షుత్పిపాసాదుల చేతను
బాధితుం డగు చుండుఁ బాయ కెపుడుఁ

ఆ॥ బరువు వెట్టుచున్నఁ బడి యున్న నిలిచినఁ
గదల కున్నఁ జాల నొదిగియున్న
బాధఁబొందుచుండుఁ బశురోమముల లెక్క
వరుస నపరిమేయ వత్సరములు. 139

వ॥ మఱియు వేదమార్గంబు విడిచి పాషండమార్గంబు లాదరించుపురుషుని [1]నసిపత్రవనంబునందు యమకింకరులు [2]తఱట్ల నడుచుచుఁ బరిహాసించుచుఁ దోలునెడ, నాయసిపత్త్రంబు లిరుగెలంకుల శరీరంబుఁ ద్రెంచుచుండ నడుగడుగున మొఱవెట్టుచుండ బాధించుచుండుదురు. 140

క॥ దండింపఁ దగనివారల
దండించిన విప్రవరుల తనువులు ముట్టం
దండించిన దుర్మతులం
దండింతురు కాలసూత్ర నరకములందున్. 141

ఆ॥ మఱియు నట్టిదుష్టమానవుఁ గింకరుల్
విఱిచి చెఱకుఁగోల విఱిచినట్లు
బాధపెట్టుచుండఁ బడి మూర్ఛఁ జెందుచు
మొఱలు వెట్టుచుండు భూపవర్య! 142

వ॥ నరేంద్రా! యెవ్వండేని యీశ్వరకల్పితవృత్తి గలజంతువుల హింసించు నట్టివాని నంధకూపం బను నరకంబునం బడవైచిన నందు నతండు దొల్లి తాను జేసిన భూతద్రోహంబున నచ్చట వివిధక్రూరపక్షి మృగపశుసర్పమశకమత్కుణమక్షికాదులచేత హింసం బొందుచు మహాంధకారంబునందు నిద్రానుభవసుఖ

1 కత్తుల వనము, 2 కొరడాలచేత.

లేశంబును లేక కుశరీరంబునందుల జీవుండునుంబోలె మృత ప్రాయుండై యుండు. అంత. 143

క॥ తనకలిమి నెవ్వఁడేనిం
దనబాంధవ వరులఁ గూడి తగఁ గుడువక తా
నును వాయసంబు భక్షిం
చిన మాడ్కిం దిన్నవాని శీఘ్రమె యచటన్. 144

క॥ క్రిమిభోజన మనిమెడి నర
కమునం బడి క్రిములె కూడు గాఁ గుడుచుచుఁ దాఁ
గ్రిమి యగుచు లక్షపరివా
ణముఁ గల క్రిమిగుండమందు నాఁటుక యుండున్. 145

వ॥ మఱియు నీభూలోకంబున నెవ్వఁడేని నవిపన్నుండై చౌర్యవృత్తిచే బ్రాహ్మణాదుల హిరణ్యరత్నాదిద్రవ్యంబు లపహరించు, నట్టి పురుషుని నగ్నివర్ణంబు లగు నయఃపిండంబుల నగ్నితప్తంబు లగు శూలంబుల నతనిశరీరంబునం దివియు చుండుదురు. మఱియును మదనాతురు లగుచు స్త్రీపురుషు[1]లగమ్యాగమనంబు సేసిరేని నట్టివారిని యమలోకంబున నతి తీక్ష్ణ[2]కశాతాడితులం జేసి యగ్ని మయంబు లయిన యుక్కుప్రతిమల నాలింగనంబు సేయింతురు.

ఆ॥ సర్వజంతుజాల సంగమ మొందెడు
వానిఁ బట్టి కట్టి వజ్రదంష్ట్ర
కములు గలుగునట్టి ఘనతరశాల్మలీ
తరువులందుఁ జేర్చి దంతు రెపుడు. 147

ఆ॥ పార్థివేంద్ర! నరుఁడు పాషండదర్శనుఁ
డగుచు ధర్మమార్గ మడఁచెనేని
వాఁడు నరకమందు వైతరణీనది
నుడుగ కెపుడుఁ బొరలి పడుచు నుండు. 148

వ॥ మఱియు నట్టి వైతరణీనదియందు జలగ్రాహంబులు దిగ్గిఛి

1 వెళ్ళఁగూడనిదానితో వెళుట, 2 కొరడా.

భక్షింపం బ్రాణంబులు నిర్గమింపం దన పాపంబు లుచ్చరించుచు
విణ్మూత్రపూయశోణితకేశనఖాస్థిమేదోమాంసవసావాసినియగు
నందుఁ దప్తుండగుచు నుండు. విప్రుండు శూద్రకామినులం
బొంది శౌచాచారంబులం బాసి గతలజ్జుం డై పశువుంబోలెఁ
జరియించెనేని నతండు నరకంబునుం బొంది యందుఁ బూయ
విణ్మూత్రలాలా శ్లేష్మపూర్ణార్ణవమందు ద్రొబ్బంబడి యతిభీభత్సి
తంబు లగు నా ద్రవ్యంబుల భుజియించుచుండు. 149

క॥ శునకములఁ బెంచి యెవ్వం
డనయంబును వేఁట సలిపి యాత్మార్థముగా
వనమృగములఁ జంపును నా
మనుజాధము నస్త్రములను మర్దింతు రొగిన్. 150

ఆ॥ ద్రవ్యలోభమునను దంభార్థమై పశు
వులను జంపి జన్నములను జేయు
వానిఁ బట్టి యముని వారలు గోయుచు
నుందు రెపుడు మిగుల సందడిలుచు. 151

వ॥ కామమోహితుం డై యెవ్వండేనిఁ దన భార్యచేత రేతఃపానంబు
సేయించు నా పాపాత్ముని రేతోప్రవాదంబునం ద్రోచి యారేతం
బునె పానంబు సేయింపుదురు. రాజపుత్రులైనను జోరు లైనను
ధనికుల గ్రామంబుపైఁ బడి యందు గృహదాహంబు సేయువార
లను, విషాదులవలన నన్యులఁ జంపెడువారలను, వజ్రదంష్ట్రలు
గల వింశత్యుత్తర సప్తశతశునకంబు లెడ తెగక తిరిగి భక్షించు
చుండు. 152

సీ॥ లంచంబుఁగొని సాక్షి వంచించి యనృతంబు
వలికెడు పాపాత్ముఁ బట్టి కట్టి
యంత*మానకవీచి యను నరకమునందు
శతయోజనోన్నత శైలశిఖర

* మహావీచి—అని పాఠాంతరము.

మునఁ దలక్రిందుగా నునిచియధో ముఖం
బుగఁ బడద్రొబ్బిన బొబ్బలిడుచుఁ
గల్లోలములు లేని కమలాకరముఁబోలెఁ
జటులమై యున్న పాషాణ మందుఁ

తే॥ బడిన యంతన దేహంబుపగిలి పెక్కు
తునుకలై పాసి యది గూడికొనుచు నుండ
నుండి యాకులతను బొందుచుండుఁగాని
చావులేకుండు నా దుష్ట జంతువునకు. 153

ఆ॥ సోమయాజిభార్యఁ గామించి పొందిన
వానిఁ గపట మద్య పాన సోమ
పాన మనుదినంబుఁ బానంబుసేయు వి
ట్క్షత్రియులను బట్టి సంభ్రమమున. 154

ఆ॥ బొమ్మఁ ద్రొక్కి మోము ఱిమ్మవట్టఁగ మోది
యనలముఖమునందు నగ్నివర్ణ
ముగను గాఁచి వక్త్రమున నిండఁగా నుక్కు
నీరు వోతు రేచి నిష్ఠురముగ. 155

వ॥ మఱియు నీచవర్ణుండు నిష్ట సలుపుచుఁ దపోదాన విద్యాచారంబులఁ బెద్దల కవమానంబు సేయువాఁడు క్షారకర్దమం బను నరకంబునందు నధోముఖుం డగుచు బాధలం బొందు. స్త్రీ పురుషు లెవ్వరేని శరీరరక్షణార్థంబు పశువుల మానవుల బలియిచ్చి రేని వారల నిరయంబునందు యమకింకరులు [1]సురియలందునిమి, తద్రక్తంబు పానంబుసేయుచుం బాటాడుచుందురు. గ్రామారణ్యంబులయందు జంతువుల శూలప్రోతంబులం గావించి హింసించుచు హర్షించుచున్న వారలను శూలసూత్రంబను నరకంబునందు శూలప్రోతులం జేసిన క్షుత్పిపాసాపరవశు లగుచుండఁ గంకగృధ్రాదులు దీక్ష్ణ తుండాగ్రంబులం దిగిచి భక్షించుచుండు. మఱియు ధూర్తస్వభా

1 కత్తులు.

వంబున జంతుపీడనంబుఁ గావించెడు పాపాత్ముల దందశూకం బను నరకంబునందు నైవ నైదు నేడు ముఖంబుల సర్పంబులు గఱచు చుండు. 156

ఆ॥ ఎనయ దొడ్డిలోన నిండ్లలో నైనను
బశుపతంగహరిణపంక్తి నెల్లఁ
బట్టి హింససేయు పాపాత్ము విషవహ్ని
ధూమశిఖల ద్రొబ్బుదురు నృపాల! 157

క॥ తనయింటికి వచ్చిన మను
జుని నతిథిం గ్రోధదృష్టిఁ జూచిన వానిం
గనుఁగవల వజ్రదంష్ట్రలఁ
దనరినయాకంకగృధ్రతతి భక్షించున్. 158

మ॥ ధనవంతుం డగుమానవుండు గడఁకన్ ధర్మోపకారంబులన్
ఘనతం జేయక యుండెనేని యమలోకంబందు సూచీముఖం
బనునాదుర్గతిఁ బట్టి త్రోచి యిది గాపై యున్నభూతం బట
న్చను పాశంబులఁ బట్టి కట్టి వడితో నొప్పింతు రత్యుగ్రులై. 159

ఆ। నరవరేణ్య! యిట్టి నరకముల్ యమలోక
మందుఁ గలవు మఱి సహస్రసంఖ్య
లందు [1]శమనదూత లనిశంబు బాధింతు
రవని ధర్మదూరు లయిననరుల. 160

ఆ॥ ధర్మవంతులెల్ల దప్పక స్వర్గంబు
నందు భోగసమితిఁ బొందు చుందు
రెలమి బుణ్యపాపముల శేషములవల్లఁ
బుట్టు చుందు రవనిఁ బుణ్యచరిత! 161

వ॥ నరేంద్రా! మోక్షమార్గంబు మున్నె వినిపించితి. ఇప్పుడు నీ కెఱింగించిన వెల్లను బ్రహ్మాండకోశంబునం గలవని పురాణం

1 యమదూతలు.

బులు వలుకుచుండు. అట్టి బ్రహ్మాండంబు శ్రీమన్నారాయణుని స్థూలశరీరం బగుటం జేసి బ్రహ్మాండం బెవ్వరు వర్ణింతు రెవ్వరు విందురు వారలకు సకలశ్రేయస్సులుం గలుగును. ఈశ్వరస్థూల శరీరంబుఁ దెలిసినవారికి శ్రద్ధాభక్తులం జేసి స్థూలదేహంబు నెఱుంగ వచ్చు. భూద్వీపవర్ష సరిదద్రినభస్సముద్రపాతాళ దిఙ్నరకతారాగణలోకసంస్థితం బయి సకలజీవనికాయ్యం బైయద్భుతం బైన శ్రీహరిస్థూలశరీరంబు వినిపించితిని. అని. 162

చ॥ జలజభవాది దేవమునిసన్నుతతీర్థపదాంబుజాత! ని
ర్మలనవరత్ననూపురవిరాజిత! కౌస్తుభభూషణాంగ! యు
జ్జ్వలతులసీకురంగమదవాసనవాసితదివ్యదేహ! శ్రీ
నిలయశరీర! కృష్ణ! ధరణీధర! భానుశశాంకలోచనా! 163

క॥ శ్రీతరుణీహృదయస్థిత!
పాతకహార! సర్వలోకపావన! భువనా
తీతగుణాశ్రయ! యతివి
ఖ్యాతసురార్చితపదాబ్జ! కంసవిదారీ! 164

మత్తకోకిలము॥ దండితారిసమూహ భక్త! నిధాన! దాసవిహార! మా
ర్తాండమండలమధ్యసంస్థిత తత్త్వరూపగదాసికో
దండశంఖసుదర్శనాంక! సుధాకరార్కసునేత్ర! భూ
మండలోద్ధరణార్తపోషణ మత్తదైత్యనివారణా! 165

గద్యము॥ ఇది శ్రీసకలసుకవిజనానందకర బొప్పనామాత్యపుత్ర గంగనార్య ప్రణీతం బైన శ్రీమద్భాగవతమహాపురాణంబునందు భరతాత్మజుం డైన సుమతికి రాజ్యాభిషేకంబును, పాషండదర్శనంబును, సుమతిపుత్రజన్మవిస్తారంబును, గయునిచరిత్రంబును, గయుని సంస్తుతియు, భూద్వీపవర్ష సరిదద్రినభస్సముద్రపాతాళదిఙ్నరకతారాగణసంస్థితియు నను కథలుం గల పంచమస్కంధంబునందు ద్వితీయాశ్వాసము. 166

ఓం తత్స ద్బ్రహ్మార్పణమస్తు.

శ్రీరస్తు.

శ్రీనివాస పరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# భాగవతము

## షష్ఠస్కంధము.



వత్సాంకితకౌస్తుభస్ఫురిత లక్ష్మీచారువక్షస్స్థల
శ్రీవిభ్రాజితు, నీలవర్ణు, శుభు, రాజీవాక్షుఁ, గంజాతభూ
దేవేంద్రాదిసమస్త దేవమకుటోద్దీప్తోరురత్నప్రభా
[1]వ్యావిద్ధాంఘ్రిసరోజు, నచ్యుతుఁ, గృపావాసుం,
ప్రశంసించెదన్.

### శివస్తుతి

ఉ॥ నిందుమతిం దలంతుఁ గమనీయ భుజంగమరాజమండలీ
మండనుఁ, జంద్రఖండపరిమండితమస్తకుఁ, [2]తారమల్లికా
పాండురవర్ణుఁ, జండతరభండను; [3]హేమగిరీంద్రచారుకో
దండు, మహేశు, గంధగజదానవభంజను, భక్తరంజనున్. 2

### బ్రహ్మస్తుతి

ఉ॥ [4]హంసతురంగముం బరమహంసము నంచితదేవతాకులో
త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్యరమావతంసముం

---

1 వ్యావిద్ధ = మిక్కిలి అతికియున్న, 2 తార = వెండిలేక ముత్యము, 3 బంగారు కొండ (మేరువు) విల్లుగాఁ గలవాఁడు, 4 హంస వాహనముగాఁ గల వాఁడు.

[1]గంసజిఘాంసునంశమును [2]గర్బ్బర సూత్రసమావృతాంసముఁ
హింస నడంచు బ్రహ్మమున హీనశుభంబులకై భజించెదన్. 3

ఉ॥ మోదకహస్తునిన్, సమదమూషకవాహను, నేకదంతు, లం
బోదరు, నంబికాతనయు, నూర్జితపుణ్యు, గణేశు, దేవతా
హ్లాదగరిష్ఠు, [3]దంతిముఖు, నంచితభక్తఫలప్రదాయకున్,
మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్. 4

ఉ॥ కల్లతనంబుగాక పొడగట్టినపూర్వపురీతి నేఁడు నా
యుల్లమునందు నుండుము సమున్నతతేజముతోడ భక్తి రం
జిల్లినచూపు గూడ విధిఁజెందినప్రోడ బుధాళినీడ మా
తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ! 5

క॥ విలసత్కంకణరవరవ
కలితంబగునభయవరదకరముల బెరయం
జెలరేఁగి భక్తులకు నల
కలుముల దయసేయుజలధికన్యకఁ దలఁతున్. 6

క॥ కాళికి బహుసన్నుతలో
కాళికిఁ గమనీయవలయ కరకీలితకం
కాళికిఁ దాపసమానస
కేళికి వందనము సేసి కీర్తింతుమదిన్. 7

వ॥ అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి. 8

చ॥ పరమసమాధిధుర్యుఁ, బటు పావనకర్మవిధేయు, దేవతా
వరనరవంద్యు, సద్విమలవాక్యు జనార్దనకీర్తన క్రియా
భరణసమర్థు, వేదచయపారగు, భవ్యుఁ, ద్రికాలవేది, భా
సురమతిఁ గొల్చుటొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్.

క॥ వ్యాసుఁడు భగవత్పదసం
వాసుం డాగమపురాణ వరవిష్ణుకథా

1 కంసశత్రువు (హరి) యొక్క అంశము అయినవాడు, 2 బంగరు యజ్ఞోపవీతములోఁ గూడిన మూఁపుగలవాఁడు, 3 గజముఖుని (గణపతిని).

వాసుఁడు నిర్మలకవితా
వ్యాసునిపదపద్మయుగము భావింతుమదిన్. 10

సీ॥ వరకవిత్వోద్రేకి వాల్మీకిఁ గొనియాడి
భాగవతార్థివై భవముఁ బలుకు
శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి,
బాణమయూరుల ప్రతిభ నొడివి
భాససౌమిల్లికభారవిమాఘుల
ఘనసుధామధురవాక్యములఁ దలఁచి,
కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షముఁ గొల్చి,
నన్నపాచార్యు వర్ణనలఁ బొగడి,
తే॥ వెలయఁ దిక్కన సోమయాజుల భజించి,
యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చఁ గొల్చి,
సుకవిసోముని నాచనసోము నెఱిఁగి,
కవిమనోనాథు శ్రీనాథు ఘనతమెచ్చి. 11

ఉ॥ [1]ఎమ్మెలు సెప్ప నేల, జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్
సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు సేసినవాని, భక్తిలో
నమ్మినవాని, భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ, బేర్మితో
బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్. 12

వ॥ అని సకలసుకవినికరంబులకు ముకుళితకరకమలుండనై. 13

ఉ॥ ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు, విభూతికారణం
బెయ్యది, సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము
న్నెయ్యది, సర్వమంత్రముల నేలిన దెయ్యది, మోక్షలక్ష్మి రూ
పెయ్యది, దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్యమంత్రమున్.

వ॥ అని శ్రీ మహాభాగవతపురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్ర
భాష రచియింపంబూని యాకృతికిం బతిగా నద్దేవుండు గలండని
వితర్కించి నాకుం గవిత్వమహత్త్వంబు సంప్రాప్తంబగు కాలంబు

1 ఎమ్మెలు=విలాసపు పలుకులు, ముఖప్రీతిమాటలన్నమాట.

దలంచి నారాయణుండె దైవంబని యెఱింగి మనోరథంబు సఫలం బయ్యెనని యాకృతిఁ గృష్ణార్పణంబుచేసితిని. అది యెట్లనిన, నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండొకనై యుండ నొక్క నాఁడు దివంబున.

చ॥ కలితవిశేషవస్త్రమును గట్టి హిమాంబు సుగంధచందనం
బలఁది వినూత్నభూషణము లారఁగఁదాల్చి వినోదలీల నిం
పుల మృదుశయ్య నిద్రఁదగఁ బొందినచోఁ గనుపట్టెఁ బల్మఱుం
దలమునఁ గమ్మ [2]క్రొమ్మెఱుఁగుదండమురూపున నిల్చుపోలికన్.

సీ॥ ఉరవడిఁ బ్రాగ్వీథి నుదయించుమార్తాండ
కోటిబింబచ్ఛాయ గూడినట్లు
హరిహరబ్రహ్మల యాత్మలలో నుబ్బి
కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు
ఖరకరకరతీవ్రగతిని గరంగుచు
హేమాద్రి చెంతఁ బెల్లెగసినట్లు
ఫణిరాజఫణరాజిమణిగణవిస్ఫూర్తి
[3]సుషిరంపు వెలిఁ దలచూపినట్లు

తే॥ లుట్టిపడ్డట్లు [4]కట్టెఱ్ఱనూఁదినట్లు
తేజ మెసఁగంగ నాత్రోవ దివ్యవాణి
పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ
జూచి యిట్లని పలికె మంజులముగాను. 17

ఉ॥ ఆటలుఁ బాటలుం జదువు లద్భుతముల్ విననొప్పువాద్యముల్
సాటి దలంప రానిబలుసాములు మున్నగువిద్య లెల్ల నీ
కాటలుఁ బాట లయ్యె విను మన్నిటికిన్ మెఱుఁగిడ్డభంగి నా
చాటునఁ [5]జాటుకారపదసాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్. 18

---

1 కొండొక = బాలుఁడు, 2 క్రొత్తమెఱుపు, దండమురూపున = దండాకారముగా నిల్చినట్లు, 3 పాతాళలోకమునుండి భూమిని రంధ్రములుచేసికొని పైకివచ్చినట్లు, 4 కట్టెఱ్ఱ 5 సరసములయిన పదములచే మృదువయిన కవిత్వము.

వ॥ అని యానతిచ్చు జగన్మాతృకృపావలోకనసుశ్లోకుండనై యేనొక్క శ్లోకంబు నాతుణంబ నుడివితిని. అది యెట్టిదనిన. 19

శ్లో॥ హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణపుణ్యపతయే హరయే నమస్తే. 20

వ॥ ఈశ్లోకం బద్దేవి యంగీకరించె. అంత మేలుకాంచి యానంద భరితుండనై నాఁటనుండి చంద్రానుగత యగుచంద్రికయుంబోలె నారాయణాంకితం బయిన కవిత్వతత్త్వజ్ఞానంబు గోచరం బయ్యె. దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని, 21

ఆ॥ పలుకఁ గలిగె మొదలభాగవతార్థంబు
భర్త కృష్ణుఁ డయ్యె భాగ్యమొదవె
నమృతరసముఁ గోర నలరు చింతామణి
పాత్ర సంభవించుభంగి నిపుడు. 22

ఆ॥ భాగవతము దేటపఱుప నెవ్వఁడుసాలు?
శుకుఁడు దక్క నరుని [1]సకుఁడు దక్క
బుద్ధిఁ దోచినంత బుధులచే విన్నంత
భక్తి నిగిడినంత పలుకువాఁడ. 23

ఉ॥ పుట్టిననాఁటనుండియును బుట్టద యెట్టియదట్టునైనఁ జే
పట్టి నుతింపఁ జిత్తము శుభంబగు మద్వరవాక్యసీమకుం
బట్టము గట్టినాఁడ హరిఁబాయక తత్కథనామృతంబు నే
నుట్టిపడంగఁ జెప్పెదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్. 24

వ॥ అని, 25

---

1 స్నేహితుఁడు.

సీ॥ శ్రీవత్సగోత్రుండు శివభక్తి యుక్తుఁడా
పస్తంబసూత్రుఁ డపారగుణుఁడు
నేర్పారిశాసనం డెత్తనప్రెగ్గడ
పుత్రుండు వీరన పుణ్యమూర్తి
కాత్మజుం డగునాదయామాత్యునకుఁ బోల
మాంబకునందను లమితయశులు
కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి
సింగధీమణియు నంచితగుణాఢ్యు
తే॥ లుద్భవించిరి తేజంబు లూర్జితముగ
సౌరిదిమూర్తిత్రయం బన శుభ్రకీర్తిఁ
బరఁగి రందులఁ గసువనప్రభువునకును
ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె. 26

ఉ. ఆడదు భర్తమాట కెదురాడదు వచ్చినవారి వీడఁగా
నాడదు పెక్కుభాష, లెడ నాడదు వాకిలి వెళ్ళి, కల్ల మా
టాడదు మిన్నకేని, సుగుణావళి కిందిర గాక సాటి యే
చేడియ లేదు చూరికుల శేఖరుకస్వయ ముమ్మడమ్మకున్. 27

క॥ ఆకసువయమంత్రికిఁ బు
ణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మ మము న్న
వ్యాకులచిత్తుల నిరువుర
శ్రీకరగుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్. 28

క॥ [1]అంగజసమలావణ్యశు
భాంగులు హరిదివ్యపదయుగాంబుజవిలస
ద్భృంగాయమానచిత్తులు
సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనఁగన్. 29

క॥ అందగ్రజుండ శివపూ
జం దనరినవాఁడ విష్ణుచరితామృతని

1 మన్మథునివంటి లావణ్యముగల మేలి శరీరములుగలవాఁడు.

వ్యాందిపటువాగ్విలాసా
నందోచితమానసుండ నయకోవిదుఁడన్. 30

వ॥ కావునం గృష్ణపాదారవిందసందర్శనాదర్శతలాయమానచిత్తుండ
నయి. 31

షష్ఠ్యంతములు

క॥ శ్రీపతికి మత్పతికి నుత
గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధసం
తాపనివారణమతికిని
బ్రాపితసనకాదితతికి బహుతరధృతికిన్. 32

క॥ హరికి గురుకలుషకుంజర
హరికి బలాభీలహరికి సంతస్థితగ
హ్వరికి నరహరికి రక్షిత
కరికిఁ గరాగ్రస్థగిరికి ఘనతరకిరికిన్. 33

క॥ గుణికి సమాశ్రితచింతా
మణికి మహేంద్రాదిదివిజమండలచూడా
మణికిఁ బ్రకల్పితశయ్యా
ఫణికి నురోభాగ కౌస్తుభప్రియమణికిన్. 34

క॥ కంసాసుర సంహారున
కంసాంచితకర్ణకుండలాభరణునకున్
హింసాపరపరమస్తక
మాంసకరాళితగదాభిమతహస్తునకున్. 35

క॥ వరయోగిమానసాంతః
కరణసుధాంభోధిభావకల్లోలలస
త్పరతత్త్వశేషశాయికిఁ
జిరదాయికి సకలభక్తచింతామణికిన్. 36

వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన షష్ఠస్కంధంబునకుఁ గథా

ప్రారంభక్రమం బెట్టి దనిన, హరిచరణస్మరణపరిణామవినోదు లయిన శౌనకాదులకు నిఖిలపురాణేతిహాసనిర్ణయవిఖ్యాతుండైన సూతుం డి ట్లనియె. 37

## అధ్యాయము ౧.

క॥ శ్రీరమణీరమణకథా
పారాయణచిత్తుఁడగుచుఁ బలికెఁ బరీక్షి
ద్భూరమణుఁ డాదరంబున
సూరిజనానందసాంద్రు శుకయోగీంద్రున్. 38

సీ॥ షడ్గుణైశ్వర్యశాశ్వతమూర్తివయినట్టి
మునినాథ! దయతోడ ముక్తిపదము
మున్నుగా నేమార్గమున వినిపించితి
వారయ నపవర్గభూరిమహిమఁ
గ్రమయోగసంభవ బ్రహ్మంబుతోఁ గూడ
నను వొంద నగు నని వినుతి కెక్క
మఱియు సత్త్వరజస్తమఃప్రభావంబులఁ
గడిఁది యై యున్నట్టి కర్మచయము
తే॥ నప్పటప్పటి కడఁగని యట్టిప్రకృతిఁ
గలుగు పురుషుని భోగార్థ ఘటన దేహ
కారణారంభరూపమార్గంబు మొదలు
మాటిమాటికి నన్నియుఁ దేటపడఁగ. 39

వ॥ మఱియు ననేక పాపలక్షణంబులగు నానావిధ నరకంబులును వానికాద్యంతంబులును స్వాయంభువసంబంధి యగు మన్వంతరంబును బ్రియవ్రతోత్తానపాదుల వంశంబును దచ్చరిత్రంబును ద్వీపవర్ష సముద్రాది నద్యుద్యాన వనస్పతులును భూమండల సంస్థాపనంబును వాని పరిమాణంబును జ్యోతిశ్చక్రచలనప్రకారంబును విభుండయిన పరమేశ్వరుం డెవ్విధంబున నిర్మించె నావిధం బంతయు నెఱింగించినాఁడవు. ఇప్పుడు. 40

ఆ॥ కడిఁది వేదనలకుఁ గారణం బై యుండు,
గుఱుతులేని నరకకూపరాశి
పాలుగాక నరుఁడు బ్రతికెడుమార్గంబు
పరమపుణ్య! తెలియఁ బలుకవయ్య! 41

వ॥ అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 42

క॥ కట్టా త్రికరణ మెఱుఁగక
పుట్టిన దురితములనపుడ పొలియింపని యా
కట్టఁడి దేహం బుడిగినఁ
గొట్టాడును బిట్టునరక కూపంబులలోన్. 43

ఉ॥ కావునఁ గాలకింకరవికారము గానకమున్న మృత్యుదు
ర్భావనఁ జిత్తముల్ వెగఁగు పాటును జెందకమున్న మేనిలో
జీవము వెల్గుచుండఁ దన చెల్వము దప్పకమున్న పన్నుగాఁ
బావనచిత్తుఁడై యఘముఁ బాయు తెఱం గొనరింపఁగాఁదగున్.

క॥ కాలం బెడగని పాపము
మూలముఁ జెఱుపంగ వలయు మును రోగములం
దేలినదోషము నెఱుఁగుచు
వాలాయము దాని నడఁచు వైద్యునిభంగిన్. 45

సీ॥ అనవుడు నాతని కనియె భూకాంతుండు
[1]కనుకలి వినుకలి గలిగినట్టి
పాపము దనకు నొప్పని దని కని చాలఁ
బరితప్తుఁ డయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు
మూఢాత్మునకు దోషమోచనం బెయ్యది?
యారయ నెఱిఁగింపు; మదియుఁగాక
కలుష మొక్కొకచోటఁ గావించునొకచోటఁ
గావింపకుండుఁ దత్కర్మ మెఱిఁగి,

1 చూచుటవలన వినుటవలన.

ఆ॥ యిట్టిజనుఁడు పుణ్యమేరీతిఁ జేసిన
నది ఫలింప నేరదని తలంతు
సలిలమందు మేని మలినంబు వోకుండ
గజము గ్రుంకువెట్టుగతియుఁ బోలె. 46

వ॥ అనిన శుకుం డిట్లనియె. 47

క॥ కర్మము గర్మముచేతను
నిర్మూలముగాదు, తెలియనేరక తానే
కర్మముసేసిన దత్ప్రతి
కర్మంబొనరింపవలయుఁ గలుషవిదూరా. 48

క॥ హితవుగల[1]కుడుపు మఱి రు
[2]గ్వ్రతతులఁ బొడమంగనీనివిధమున నతిస
ద్వ్రతుఁడై నవాఁడు నిర్మల
మతిచే నఘరాశి నెల్లమట్టముసేయున్. 49

చ॥ తపమున బ్రహ్మచర్యమున దానమునన్ శమసద్దమంబులన్
జపమున సత్యశౌచముల సన్నియమాదియమంబులం గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము [3]హృత్తనువాక్యజంపుపా
పపుగుది ద్రుంతు రగ్ని [4]శతపర్వవనంబుల నేర్చుకైవడిన్. 50

వ॥ అదియుం గాక. 51

ఉ॥ కొందఱు పుణ్యవర్తనులు గోపకుమారపదారవిందజా
నందమరందపానకలనారతషట్పదచిత్తులౌచు గో
విందపరాయణుల్ విమలవేషులు దోషమడంతు రాత్మలం
జెందిన భక్తిచేత రవి చేకొని మంచు నడంచుకైవడిన్. 52

క॥ హరిభక్తిచేతఁ గొందఱు
పరిమార్తురు మొదలుముట్ట పాపంబుల ని

1 కుడుపు = ఆహారము, 2 రోగసమూహమును, 3 హృత్ = మనస్సువలన తను = శరీరమువలన, వాక్య = మాటలవలన, జము = పుట్టినది. పాపపుగుది = పాపసమూహము, 4 వెదురు టడవులను.

స్ఫురతరకరముల సూర్యుం
డరుదుగఁ బెనుమంచుఁ [1]బెంచమడఁచినభంగిన్. 53

క॥ దంతిపురనాథ! విను మొక
మంతన మెఱిఁగింతు శమదమంబులు [2]నంహో
వంతు శుభవంతుఁ జేయవు
[3]కంతునిగురుభక్తి ముక్తిఁ గలిగించుగతిన్. 54

సీ॥ హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగ నుండు
వానికైవల్య మెవ్వనికి లేదు
వనజలోచనుభక్తపరుల సేవించిన
వానికైవల్య మెవ్వనికి లేదు
వైకుంఠనిర్మల వ్రతపరుం డైనట్టి
వానికైవల్య మెవ్వనికి లేదు
సరసిజోదరుకథా శ్రవణలోలుం డైన
వానికైవల్య మెవ్వనికి లేదు

తే॥ లేదు తపముల బ్రహ్మచర్యాదినియతి
శమదమాదుల సత్యశౌచముల దాన
ధర్మ మఖముల సుస్థిరస్థాన మైన
వైష్ణవజ్ఞానజనితనిర్వాణపదము. 55

తే॥ అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టిముక్తి
వర్త్మ మీలోకమందు నెవ్వరికిఁ గలదు
సాధులును బుణ్యశీలురు సజ్జనులును
హరిపరాయణతత్పరు లయినఁ గాక. 56

క॥ అరుదుగ నరహరిభక్తిం
బొరయనియాపురుషు సుకృతపుంజంబులు వేఁ

---

1 నాశనముచేయునట్లు, 2 అంహోవంతున్ = పాపములు గలవానిని, 3 కంతునిగురుభక్తి = మన్మథుని తండ్రియగు విష్ణునిమీఁది భక్తి.

మఱుఁ బుణ్యుఁ జేయనేరవు
నరవర [1]మధుఘటముఁ బెక్కు నదులుం బోలెన్. 57

చ॥ సతతముఁ గృష్ణపాదజలజంబులయందు మనంబు నిల్పు సు
వ్రతులు తదీయశుద్ధగుణ రాగులుఁ గాలునియుగ్రపాశసం
హతులధరించు తత్సుభటకౌఘములం గలలోనఁ గాన, శో
కతులను దుష్టకర్మములు గైకొని వారలఁ జెంద నేర్చునే? 58

వ॥ కావున నీయర్థంబునకుం బురాతనం బగు నొక్క యితిహాసంబు గలదు. అది విష్ణుదూత యమదూత సంవాదం బనంబడు. దాని నెఱింగింతు నాకర్ణింపుము. 59

## అజామిళోపాఖ్యానము

సీ॥ నరనాథ! వినుము కన్యాకుబ్జపురమునఁ
గలఁడు బ్రాహ్మణుఁ డజామిళుఁ డనంగఁ
బాతకుం డతులనిర్భాగ్యుం డవజ్ఞుండు
నష్టసదాచారి కష్టరతుఁడు
జూదంబులందు దుర్వాదంబులందును
శౌర్యంబునందు మచ్చరము గలిగి
[2]తొత్తాత్మపత్నిగా మత్తుఁడై వర్తించి
కొడుకులఁ బదుగురఁ బడసి, చాల

ఆ॥ మోహజలధిలోన మునిఁగి, ముచ్చట దీఱ
బాలలాలనాదిలీలఁ దగిలి,
పెద్దకాల మతఁడు పెంపార సుఖియించి
ఫలిత మెల్ల వదలి పతితుఁ డయ్యె. 60

సీ॥ నిర్మలం బనఁ జాల నెఱయుచిత్తం బన
నల్లని వెంట్రుకల్ దెల్ల నయ్యెఁ
దగు మోహపాశబంధంబు జాఱినమాడ్కిఁ
బొదలిన యంగముల్ వదలి వ్రేలె

1 కల్లుకుండను, 2 భోగముది.

నింద్రియంబుల కోర్కి లేక నొల్ల ననుభంగి
నుడుగక తల చాల వడఁకఁజొచ్చెఁ
దమకంబు ప్రాయంబుఁ దగిలిపోయినమాడ్కి
లోచనంబులచూడ్కి నీచమయ్యె

ఆ॥ వగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు
[1]నుక్కిసయును దగ్గుఁ బిక్కటిల్లె
శిరసు నొవ్వఁదొడఁగెఁ జెదరె మనం బంతఁ
గడిఁది యైనముప్పు కాలమునకు. 61

ఆ॥ ఎనయ నతని కెనుబ దేనిమిది వర్షంబు
లంతనరుగుటయును భ్రాంతుఁడగుచుఁ
గోరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు
బాలుఁ డగుట మిగుల భక్తిఁ జేసి. 62

క॥ తనసతియుఁ దాను గూరిమి
మనమునఁ బెనఁగొనఁగ నక్కుమారుని ననిశం
బును ముద్దుసేయుచుండెను
జనవర! వాత్సల్య మాత్మ సందడిగొనఁగన్. 63

క॥ బాలుని ముగ్ధవచోబుజు
ఫాలుని నిజజనకబంధుపరిణామకళా
శీలుని లోలతఁ గనుఁగొని
[2]యాలరి బ్రాహ్మణుఁడు నందితాత్ముం డగుచున్. 64

క॥ అత్యంతపానభోజన
కృత్యంబులఁ బొత్తు గలిగి క్రీడలఁ దత్సాం
గత్యంబు వదల కాగత
మృత్యువుఁ గన నేరఁ డయ్యె మిక్కిలి జడుఁడై. 65

తే॥ తెలియ కీరీతి నతఁడు వర్తించుచుండ
భయదమగుమృత్యుకాలంబు ప్రాప్తమైన

1 కాసరోగము, 2 దుష్టుఁడు.

భూరివాత్సల్యవృత్తి నప్పుత్రుఁ దలఁచి
యాత్మఁ బ్రలపించె నారాయణా! యటంచు. 66

వ॥ అప్పుడు. 67

క॥ కింకరుల ధర్మరాజవ
శంకరుల దురంతదురితసమధికజననా
శంకరుల సకలలోకభ
యంకరులం గనియె నింద్రియాకులుఁ డగుచున్. 68

క॥ ఘాతుకుల దండదండిత
పాతకుల మహోగ్రకర్మభరనిష్ఠురణా
జాతకులఁ బ్రేతనాయక
దూతకసంతతుల నతఁడు దూరమునందున్. 69

మ॥ కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోమనిష్ఠ్యూతులన్
ఘన[1]పీనోష్ఠవిశారవక్త్రవిలసద్గర్వేక్షణోపేతులన్
జనసంత్రాసకరోద్యతాయతసుపాశశ్రేణికాహేతులన్
హననవ్యాప్తివిభీతులన్ మువుర[2]నాత్మానేతలన్ దూతలన్. 70

వ॥ ఇట్లతి వికృతతుండగండాభోగవిభాగవిషమవివృత్తనేత్రులు నతి పుష్టనిష్ఠురతనుయష్టిసంవేష్టితమహోర్ధ్వరోములు నభ్యస్త సమస్తజీవాపహరణకరణప్రశస్తహస్తవిన్యస్తపాశధారులునగు యమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును వికంపితప్రాణుండును వికృతలోచనుండును విహ్వలాత్మకుండునునై. 71

క॥ దూరమున నాడుచాలుఁడు
జోరనఁ దనచిత్తసీమఁ జొడగట్టిన నో
నారాయణ! నారాయణ!
నారాయణ! యనుచు నాత్మనందను నొడివెన్. 72

---

1 పీన = దళసరిగానున్న, ఓష్ఠ = పెదవులు, 2 ఆత్మ + ఆనేతలన్ = తనను దీసికొని పోశెడివారిని.

చ॥ మరణపువేళ నద్దనుజమర్దనుసంస్మరణంబు సేయఁ ద
త్పరిసరవర్తు లాత్మపరిపాలకునామము నాలకించి ని
ష్ఠురగతి నేగుదెంచి పొడ సూపి యదల్చిరి కాలుదాసులన్
ఖరతరభాషులన్ వికటకల్పితవేషుల దీర్ఘరోషులన్. 73

క॥ దాసీభర్త నజామిళ
భూసురుఁ దత్తనువువలన భోరన వెలికిం
దీసిన యమభటులఁ దోలఁగఁ
ద్రోసిరి శ్రీవరునికూర్మిదూతలు కడిమిన్. 74

విష్ణుదూత యమదూతల సంవాదము.

వ॥ ఇట్లు విష్ణుదూతలవలన నిర్ఘాతప్రయత్నులై యమదూత లిట్లనిరి.

క॥ ఎవ్వనివారలు ? మాతోఁ
[1]జివ్వకుఁ గతమేమి ? యిట్లు చిక్కినవానిం
ద్రొవ్వన విడిపించితి ; రిఁక
నవ్వులకో జమునిశాసనంబులు జగతిన్ ? 76

వ॥ అదియునుంగాక. 77

సీ॥ ఎవ్వరు మీరయ్య ? యీభవ్యరూపముల్
గన్నుల కద్భుతక్రమ మొనర్చె
దివిజులో భువిజులో దేవతాప్రవరులో
సిద్ధులో సాధ్యులో చెప్పరయ్య
దళితపాండురపద్మదళదీర్ఘనేత్రులు
వరపీతకౌశేయవాసులరయ
గండమండలనటత్కుండలద్వయులును,
బటుకిరీటప్రభాభాసితులును

తే॥ భూరిపుష్కరమాలికాచారువక్షు,
లమితకోమలనవయౌవనాధికులును

1 చివ్వ = పోరు.

బాహుకేయూరమణిగణభ్రాజమాన,
ఘనచతుర్భుజు లభ్రసంకాశరుచులు. 78

క॥ ధనువులు [1]నిషంగచయములుఁ,
గనదంబుజశంఖచక్రఖడ్గగదాసా
ధనములు ధరియించిన మీ
తనువులు లోకముల కద్భుతం బొనరించెన్. 79

క॥ శాంతంబు లయినమీతను
కాంతులు జగములను దిశలఁ గలిగిన బహుళ
ధ్వాంతములఁ బాఱఁ దోలుచు
సంతస మొనరించె నిపుడు [2]సర్వంకషమై. 80

వ॥ ఇట్లఖిలలోకానందకరకమ్రాకారులు నఖిలవిభ్రాజమాన తేజో దుర్నిరీక్ష్యమాణులును నిఖిలధర్మపాలురును నగుమీరు ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతం బేమి? యనిన ధర్మరాజానుచరులు గారను తలంపున మందస్మితకందళితముఖారవిందులయి గోవిందుని[3]కందువ మందిరంబుకావలివారలు [4]వారివాహగంభీర నిర్ఘోషపరిపోషణంబులైన విశేషభాషణంబుల నిట్లనిరి. 81

ఉ॥ మీరు పరేతనాయకుని మేలిమిదూతలఁ టేనిఁ బల్కుఁడా
ఘోర పుఁబుణ్యలక్షణము దుష్కృతభావము దండకృత్యముల్
బీరముతోడ నీతని కభీష్టనివాసము నోలి దండ్యు లె
వ్వారలొ సర్వభూతములో వారొకకొందఱు పాపకర్ములో? 

వ॥ అనిన యమభటు లిట్లనిరి. 83

క॥ [5]వేదప్రణిహితమే యను
మోదంబుగ ధర్మ మయ్యె మున్ను తదన్యం

---

1 అమ్ముల పొదులసమూహము, 2 అంతటను నిండినదై, 3 కందువ = నివాసస్థానము – గోవిందునికందువ, మందిరము = విష్ణునినివాసమందిరమునైకుంఠము, 4 మేఘము నుఱుమువలె గంభీరములయిన మాటలచేత, 5 వేదముచే నేర్పరుపఁబడినది.

బేది యగు నది యధర్మం
బాదియు హరిహాపు వేదమని వినుకతనన్. 84

సీ॥ ఎవ్వనిచేఁ దన యిరవొందు త్రిగుణ స్వ
భావమైనట్టి యీ ప్రాణిచయము
లను గుణనామ క్రియారూపములచేత
నేర్పడుగతిఁ దాన యెఱుఁగఁబడును
[1]నర్యముం డనలంబు నాకాశమును బ్రభం
జనుఁడు గోచయమును శశధరుండు
సంధ్యలు దివములు [2]శర్వరీచయములుఁ
గాలంబు వసుమతీజాలములును

తే॥ దేహధారికి సాక్షులై తెలుపుచుండు
దండనస్థానవిధము సద్ధర్మగతియుఁ
దగులు మీరీక్రమానురోధనము సేసి
యఖిలకర్ములు దండార్హు లరయ నెపుడు. 85

తే॥ కోరి కర్మంబునడపెడు వారికెల్ల
గలితశుభములు నశుభముల్ గలుగుచుండు
నరయఁగా దేహి గుణసంగి యైనయపుడె
పూని కర్మంబుసేయక మానరాదు. 86

క॥ ప్రకృతమునఁ దానొనర్చిన
సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే
వికృతి గని యనుభవించును
నకృతమతిం దత్ఫలంబు నతినిపుణుండై. 87

వ॥ మఱియు వినుండు; జన్మంబు శాంతఘోరమూఢగుణంబులచేత
నైననను సుఖదుఃఖగుణంబులచేతనైనను ధార్మికాదిగుణంబుల చేత
నైనను సకలభూతంబులుఁ దై్రవిధ్యంబు నే ప్రకారంబునం బొందు

1 సూర్యుఁడు, 2 రాత్రులసమూహము.

నా ప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు; దేవుండైన యముండు సర్వజీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తంబైన పూర్వ రూపంబులవిశేషరూపంబులచేతం జూచుచుండి వాని కనురూపం బులఁ జింతించుచుండు. అవిద్యోపాధిజీవుండు తమోగుణ యుక్తుండై ప్రాచీనకర్మంబులచేత నేర్పడిన వర్తమానదేహంబు నేనని తలంచుచుండి నష్టజన్మస్మృతి గలవాఁడై పూర్వాపరంబు లెఱుంగంజాలకుండు; మఱియుఁ గర్మేంద్రియంబులచేతఁ గర్మం బులం జేయుచుండి జ్ఞానేంద్రియములచేతఁ దమోవిషయంబులైన శబ్దస్పర్శరూపరసగంధంబుల నెఱుంగుచుండి పదియాఱవదియైన మనంబుతోఁగూడి పదియేడవవాఁడగుచుండి షోడశోపాధ్యంతర్గ తుండై యొక్కరుండైన జీవుండు సర్వేంద్రియవిషయ [1]ప్రతి సంధానంబుకొఱకు జ్ఞానేంద్రియకర్మేంద్రియమనోవిషయంబులఁ బొందుచుండి షోడశకళలు గలిగి లింగశరీరంబనం బరఁగి గుణ త్రయకార్యం బను నిమిత్తంబున హర్షశోకభయంబుల నిచ్చు చున్న సంసారంబు ధరియించుచుండు. [2]విజితషడ్వర్గుండైన దేహి కర్మంబులొల్లని బుద్ధి నెఱింగియు వినియుఁ గర్మంబులు సేయుచుండి తనసంచారకర్మంబునం జుట్టుకొన్న [3]పసిఁడికాయపురువునుంబోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు. వర్తమాన వసంతాదికాలంబు భూతభావివసంతాదికాలయోగ్యంబైన పుష్ప ఫలాదులు తత్కాలజ్ఞాపకంబు నెట్లు సేయు నట్లు భూతభావిజన్మం బులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు; ఒక్క నరుండు నొకక్షణంబును గర్మంబు సేయకుండువాఁడ లేఁడు పూర్వసంస్కారంబులం గలగుణంబులచేతఁ బురుషుం డవశుండు గావున బలిమిఁ గర్మంబు సేయింపంబడుచుండు. అవ్యక్తనిమిత్తంబు నొంది తదనురూపంబులైన స్థూలసూక్ష్మశరీరంబులు మాతా పితృసదృశంబులగుచుండు. ఇట్టివిపర్యయంబు పురుషునికిఁ బ్రకృతి

1. ప్రతిసంధానము = కూడిక, 2 కామక్రోధాదుల జయించినవాఁడు, 3 పొత్తినూలుకాయ.

సంగమంబునం గలుగుచుండు. ఆప్రకృతి పురాణపురుషుం డైన
యప్పరమేశ్వరుని సేవించినం దలంగుచుండు. 88

సీ॥ కావున నితఁడు సత్కర్మవర్తనమున
భూదేవకులమునఁ బుట్టినాఁడు
దాంతుఁడై శాంతుఁడై ధర్మసంశీలుఁడై
సకలవేదంబులఁ జదివినాఁడు
అనయంబు గురువుల నతిథులఁ బెద్దలఁ
జేరి శుశ్రూషలఁ జేసినాఁడు
సర్వభూతములకు సమబుద్ధియై చాల
బహుమంత్రసిద్ధులఁ బడసినాఁడు

తే॥ సత్యభాషణనియమంబుఁ జరపినాఁడు
నిత్యనైమిత్తికాదుల నెరపినాఁడు
డంబిలోభాదిగుణములఁ దరపినాఁడు
మంచిగుణములు తనయందు మరపినాఁడు. 89

క॥ సతతాచారసమంచిత
మతియై సుజ్ఞానమునకు మరగెడుతఱి నా
యతగతి [1]నాతనికంగజ
మతమై నవయౌవనాగమం [2]బెడసాచ్చెన్. 90

సీ॥ కడకంట యౌవనగర్వంబు వొడగట్టె
మదిలోన నుద్రేకమదము [3]దొట్టెఁ
గడుమేనఁ గామవికారంబు దలచూపె
ముఖమునఁ జిరునవ్వు మొలకలెత్తె
నతిపుష్టి నిష్ఠురం బయ్యె దేహంబెల్లఁ
గచభారమున [4]నెఱికప్పు మెఱసెఁ
గటిభారమున నూరుకాండముల్ జిగి మీఱె
బాహుశాఖలు దీర్ఘభంగిఁ దోఁచె

---

1 మన్మథునికి అంగీకారమై, 2 ఎడసాచ్చెన్ = సమకూడెను, 3 తొట్టెన్ = అతిశయించెను. (వ్యాపించెను), 4 నెఱి = చక్కని, కప్పు = నలుపు.

ఆ॥ నురము విపులమయ్యె నుల్లసద్వరకాంతి
పూర మంగకమునఁ బొందుపడియె
భూరి తేజుఁ డయిన భూసురాన్వయునకు
నభినవైకయౌవ నాగమమున. 91

క॥ హృదయమునఁ బొడమువయౌవన
మదము వెలిం దోఁచుభంగి మానితరుచిఁ ద
ద్వదనమున నూఁగుమీసలు
వొదలుచుఁ గప్పడరి చూడఁ బొంకంబయ్యెన్. 92

వ॥ మఱియును. 93

క॥ తమ్మివిరిమీఁద వ్రాలిన
తుమ్మెదపంక్తియునుబోలెఁ దోరపులీలం
గ్రమ్మకొని విప్రతనయుని
నెమ్మొగమునఁ గానబడియె నెఱిమీసంబుల్. 94

వ॥ అంత [1]ననంగబ్రహ్మతంత్రంబునకు వసంతుం డొనర్చు[2]నంకురార్పణారంభంబునుం బోలె లలితకిసలయవిసరప్రసారభాసురబహుపాదపాదిపురోపవనపవనజవనప్రభావపరికంపితవిటవిటీజనహృదయ[3]ప్రఫుల్లపల్లవభల్లంబును నసూనప్రసూననిర్భరగర్భావిర్భూత[4]సురభిపరాగపటలపటఘటితనభోమండలంబును నమందనిష్యందమరందబిందుసందోహాకందళితచిత్తమత్తమధుపసంకులఝుంకారముఖరితసకలదిశావలయంబును నిరంతరధారాళరసభరితపరిపక్వఫలానుభవప్రభవసమ్మోదవాదశుకప్రముఖపంతగకోలాహలంబునునై మధుమాసంబు సర్వజనమనోహరంబునునై నిఖిల

1 అనంగబ్రహ్మతంత్రము = మన్మథ యజ్ఞము, 2 అంకుర + అర్పణము = క్రియావిశేషము. (పాలికలు ఉంచుట ప్రసిద్ధము), 3 చిరుగుటాకులనెడి యీటెలు కలది, 4 పుష్పాడి సమూహమనెడి వస్త్రముచే, ఘటిత = కూర్పఁబడిన, నభోమండలము = ఆకాశమండలము కలది. పూలపుప్పొడిక్రమ్మి ఆకాశమున నలముకొని చాందినీ కట్టినట్లుండెనని భావము.

వనపాదపంబుల నలంకరించె. అయ్యవసరంబున నజామిళుండు పితృనిర్దేశంబునం గుశసమిత్పుష్పఫలార్థంబు వనంబున కరిగి తిరిగి వచ్చుసమయంబున నొక్కలతాభవనంబున. 95

క॥ బద్ధానురాగయై స్మర
యుద్ధంబున కలరుబుద్ధి నురుకామకళా
సిద్ధి యగు[1] వృషలితోఁ బ్రియ
వృద్ధిం దగఁగూడియున్న విటు నొరుఁ గాంచెన్. 96

క॥ భటునిన్ రతిశాస్త్రకళా
ర్భటునిన్ వరయౌవనానుభవమదవిభవో
ద్భటునిన్ సురతేచ్ఛాసం
ఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్. 97

శా॥ [2]హాలాఘూర్ణితనేత్రతో మదనతంత్రారంభసంరంభతో
[3]ఖేలాపాలనయోగ్యభ్రూవిభవతోఁ [4]గీర్ణాలకాజాలతో
హేలాలింగనభంగివేపవతితోఁ నిచ్ఛావతీమూర్తితోఁ
గేలిం దేలుచునున్నవానిఁ గనెఁ బుంఖీభూతరోమాంచుఁడై. 98

క॥ కలికి వదుమదనకదనపుఁ
బలుకులకలకలము [5]బెడఁగు వదుమేఖలము
వ్వాలరవళిఁ దగిలి గతిగొనఁ
గలకంఠి రతంబు సలుపు గమకముఁ గనియెన్. 99

క॥ కవకవనై పదనూపుర
రవరవ లాగుబ్బుకొన్న రతిపతిగతులం
[6]జివచివనై విటుచెవులకు
రవళిన్ రతిసల్పురతుల రవరవ గనియెన్. 100

---

1 శూద్రస్త్రీ, 2 కల్లుత్రావుటచే, ఘూర్ణిత=గిరగిర తిరుగుచున్న, నేత్ర= కన్నులు గలది, 3 ఖేలా = విలాసములయొక్క, పాలన = చక్కఁబెట్టుకొనుట యందు, యోగ్య = తగియున్న, భ్రూ = కనుబొమలయొక్క, విభవము కలది, 4 చెదరిన ముంగురుల గుంపులు కలది, 5 బెగడువడు, 6 చివచివనై.

చ॥ కురు లలికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీడఁగ, గుబ్బదోయిపై
సరములు చౌకళింపఁ, గటిసంగతి [1]మేఖల తాళగింప, స
త్కారవరకంకణావళులు గర్జిలఁ, [2]గౌ నసియాడ, మీఁదుగా
మరునివినోదముల్ సలిపె మానిని యౌవనగర్వరేఖతోన్. 101

క॥ [3]మవ్వపుసుకుమారాంగిని
జవ్వని నుపగూహనాది సముచిత రతులన్
నివ్వటిలుదానిఁ గని మది
నువ్విళ్లూరంగ మన్మథోద్దీపనుఁడై 102

తరలము. బహుళదృక్పరిపాకమోహాని బద్ధుఁడౌచు మనంబులో
సహజకర్మము వేదశాస్త్రము సాత్త్వికంబుఁ దలంచి త
న్నిహితచిత్తము వట్టి పట్టఁగ నేరఁ డయ్యె సదామనో
గహనమందు మరుండు పావకు కైవడిం జరియింపగాన్. 103

శా॥ ఆలీలావతిగండపాళికలపై హాసప్రసాదంబుపై
నాలోలాలకపంక్తిపై నళికపై నాకర్ణదృగ్భాతిపై
హేలాపాదికుచద్వయోరుకటిపై నిచ్చల్ పిసాళింపఁగా
జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనోజాతానలోపేతుఁడై.

తే॥ మఱి కులాచారవర్తన మాటుచేసి
పరఁగుపిత్రర్థములు దాని పాలుచేసి
సాధులక్షణగుణవృత్తిఁ జాలుచేసి
లోలలోచనపసఁజెంది లోలుఁడయ్యె. 105

క॥ [4]శ్యామను [5]సుమాస్త్రఖేలన
శామను సుగుణాభిరామఁ గమనీయగుణ
స్తోమ నిజభామ నొల్లక
ధామమున నటించె[6] గ్రించుఁ దనమున జడుఁడై. 106

---

1 మొలనూలు, 2 నడుము, 3 మవ్వపు = కోమలమైన, 4 నడివయసులో నున్నది, 5 మరునియాటయందు వలపుగలది, 6 నీచత్వముచేత.

ఉ॥ బంధులఁ దిట్టి, సజ్జనులఁ బాధలఁబెట్టి. యనాథకోటిఁ బెం
బందెలు [1]సుట్టి; [2]యీరములు వట్టి, పథంబులు గొట్టి, దిట్ట యై
నిందలకోర్చి సాధులకు నిందితుఁడై గడియించువిత్తమా
సుందరి కిచ్చి మచ్చికలు సొంపెసఁగూర్చి వసించెఁ దత్కృపన్.

సీ॥ సముచితశ్రుతిచర్చఁ జర్చింప నొల్లక
సతికుచద్వయ [3]చర్చఁ [4]జర్చసేయుఁ
దర్కకర్కశపాఠ [5]తర్కంబు గాదని
కలికితోఁ బ్రణయతర్కంబు సేయు
స్మృతిపదవాక్యసంగతి గాక తత్సతి
పదవాక్యసంగతి పరఁగఁ జేయు
నాటకాలంకార నైపుణం బుడిగి త
న్నాటకాలంకారపాటిఁ దిరుగుఁ

తే॥ బరఁగఁజిరకాల మీరీతిఁ బాపనియతి
రమణ దాసీకుటుంబభారము వహించి
యదికుటుంబిని గాఁగఁ బాపాత్ముఁడగుచు
నశుచియునుదుష్టవర్తనుఁడై మెలంగె. 108

క॥ అటు గాన పాపకర్మునిఁ
గుటిలుని సుజనార్త ధూర్తుఁ గ్రూరుని నే [6]మా
రటమునఁ గొని యేగెద మం
తట దండమువలన నితఁడు ధన్యత నొందున్. 109

## అధ్యాయము ౨.

వ॥ ఇట్లు పలుకుచున్న యమదూతల వారించి నయకోవిదులైన భగవ
ద్దూత లిట్లనిరి. 110

---

1 చుట్టి = ఆవరించి, 2 ఈరములు=పొదలు, 3 చర్చన్=గంధపుఁబూఁతను గూర్చి, 4 విమర్శించును, 5 ఆలోచన, 6 అరటమునన్ = ఆరాటములో,

క॥ అవురా! ధర్మవివేక
ప్రవరులపస గానఁబడియెఁ బాపము పుణ్యో
ద్భవుల యదండ్యులదండన
వివరం బొనరింపఁ బడియె విధి యెఱుఁగమిచేన్. 111

చ॥ సములును సాధులున్ విహితశాసనులున్ సుదయాళురున్ శుభో
త్తమగుణులై నయట్టితలి దండ్రులు బిడ్డల కెగ్గు సేయుచోఁ
గ్రమమున వార లెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁ జాలువారు సం
భ్రమమున మీమనంబులఁ దిరంబుగఁ జర్చ యొనర్చి చూడుఁడా!

ఆ॥ ఎఱుక గలుగునాతఁ డేది యొనర్చిన
నదియొనర్తు రితరులైనవార
లతఁడు సత్య మిట్టి దని రేని లోకంబు
దత్ప్రివర్తనమునఁ దగిలి యుండు. 113

ఆ. నెమ్మిఁ దొడలమీఁద నిద్రించు చెలికాని
నమ్మఁదగినవాఁడు నయము విడిచి
ద్రోహబుద్ధిఁ జంప దొడరునే యెందైనఁ
బ్రీతి లేక ధర్మదూతలార! 114

ఆ॥ చిత్త మెల్ల నిచ్చి చెలితనంబున వచ్చి
నచ్చి కలయ మెచ్చి నమ్మువానిఁ
గరుణ గలుగువాఁడు కడుసౌమ్యుఁడగువాఁడు
చింత సేయ కెట్లు చెఱుప నేర్చు. 115

వ॥ అదియునుం గాక. 116

ఉ॥ ఈతఁడు కోటిసంఖ్యలకు నెక్కుడుపుట్టువులందుఁ జెంది [1]యా
యాతములైనపాపనివహంబుల నన్నిటిఁ బాఱఁ దోలి ప్ర
ఖ్యాతమతిన్ మహామరణకాలమునన్ హరిపుణ్యనామసం
భూతసుధామయాద్భుతవిభూతికరాక్షరసంగ్రహంబునన్. 117

1 ఆయాతములు = వచ్చిపడినవి.

సీ॥ బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని
కీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మష క్రూరసర్పములకుఁ
[1]గేకులు హరినామ కీర్తనములు
[2]తపనీయచౌర్యసంతమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ కీర్తనములు
మధుపానకిల్బిషమదనాగసమితికిఁ
గేసరుల్ హరినామకీర్తనములు

తే॥ మహితయోగోగ్రనిత్య సమాధివిధుల
నలరు బ్రహ్మాది సురలకు నందరాని
భూరినిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
[3]ఖేలనంబులు హరినామకీర్తనములు 118

సీ॥ ముక్తికాంతైకాంత మోహనకృత్యముల్
గేలిమై హరినామ కీర్తనములు,
సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్
గేలిమై హరినామ కీర్తనములు,
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్
గేలిమై హరినామ కీర్తనములు;
బహుకాలజనితతపఃఫలసారముల్
గేలిమై హరినామ కీర్తనములు

తే॥ పుణ్యమూలంబు లనపాయపోషకంబు
లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
[4]లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ
లార్తశుభములు హరినామకీర్తనములు. 119

---

1 నెమళ్లు, 2 తపనీయ = బంగారముయొక్క, చౌర్య=దొంగతనమనెడి, సంతమసంబు = చీఁకటి, 3 ఖేలనంబులు = విలాసములు, 4 వేదాంతములచేఁ బొందఁబడునవి.

క॥ కామంబు పుణ్యమార్గ
[1]స్థేమంబు మునీంద్రసాంద్రచేతస్సరసీ
ధామంబు విష్ణునిర్మల
నామంబుఁ దలంచువాఁడు నాథుఁడు గాఁడే. 120

క॥ డెందంబు పుత్రువలనం
జెందిన దని తలఁప వలదు శ్రీపతిపేరే
చందమున నైనఁ బలికిన
నందకధరుఁ డందుఁ గలఁడు నాథుండగుచున్. 121

ఆ॥ బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రామ
కేళి నైన మిగులఁ [2]గేలినయినఁ
బద్యగద్యగీతభావార్థముల నైనఁ
గమలనయనుఁ దలఁపఁ గలుషహరము 122

ఉ॥ కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం
బ్రేలినచోట సర్పముఖ పీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణుభవదూరునిఁ బేర్కొని రేని మీఁద న
క్కాలునియాతనావితతిఁ గానరు; పూనరు దుఃఖభావముల్. 123

సీ॥ అతిపాపములకుఁ బ్రయత్నపూర్వకముగఁ
దనుపాపముల కమితంబుగాఁగ
సన్మునివరులచే సంపాద్యమైయుండు
నిర్మలం బగుపాపనిష్కృతములు
క్రమరూపమున నుపశమనంబు లగుఁ గాని
తత్పాపచయములు దలఁప లేవు
సర్వకర్మంబుల సంహార మొనరించి
చిత్తంబునకుఁ దత్త సిద్ధి నొసఁగు

---

1 స్థిరమైనది, 2 గేలి = పరిహాసము.

ఆ॥ నీరజాక్ష నీదు సేవ యోగిమానససరో
వాసుసేవ హేమవాసుసేవ
వేదవేద్యుసేవ వేదాంతవిభుసేవ
పరమపురుషపాద పద్మసేవ. 124

క॥ హరి నెఱుఁగనియాబాలుఁడు
హరిభక్తులతోడఁ గూడి హరి యనువాఁడున్
సరియై దోషము లడఁచును
[1]గరువలితో నగ్నిదృణముఁ గాల్చినభంగిన్. 125

ఉ॥ ఆరయ వీర్యవంత మగు నౌషధ మెట్లు [2]యదృచ్ఛఁ గొన్న ద
చ్చారుగుణంబు రోగములఁ జయ్యన బాపెడుమాడ్కిఁ బుణ్య వి
స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁ డజ్ఞుఁ [3]డవజ్ఞఁ [4]బల్కినన్
వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే. 126

క॥ ధృతి దప్పినతఱిని బురా
కృతమునఁ గొకెట్లు దోఁచుఁ గేశవుఁడు మదిన్
మితి లేనిజగముఁ దాల్చిన
యతఁ డొక్కనిమనములోన నడఁగెడువాఁడే. 127

మ॥ నిరతంబై నిరవద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై
నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ
హరినామస్మరణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టిసజ్జనునిధర్మం బేల వ్యర్థంబగున్. 128

వ॥ అని యిట్లు భగవద్దూతలు భాగవతధర్మంబు నిర్ణయించి బ్రాహ్మ
ణుని నతిఘోరం బయిన యామ్యపాశబంధనిర్ముక్తునిం గావించి
యమభటులవలని యుదుటువాపిరి. అంత నాయమదూత లా
భగవద్దూతలసంభాషణ ప్రభావంబునఁ దమమనంబుల శాంతి

1 గరువలి = గాలి, 2 యదృచ్ఛన్ = ఇచ్ఛలవిడిగా, 3 అవజ్ఞన్ = తిరస్కారముగా, 4 పల్కినన్ = ఉచ్చరించినను.

నొంది భగవత్తత్త్వజిజ్ఞాసు లయి చేయునది లేక నిరాకృతులై యమలోకంబునకుం జని పితృపతికి సర్వంబును నెఱింగించిరి. అంత. 129

క॥ అతఁడును బాశచ్యుతుఁడై
గతభయుఁడై ప్రకృతినొంది కడునుత్సవసం
గతిఁ జూచి మ్రొక్కి మదిలో
నతులితముద మొదవి పొదలి హరిదాసులకున్. 130

ఆ॥ నిలిచి కేలు మొగిచి పలుక నుద్యోగించి
చెలఁగుచున్న లోని తలఁపు దెలిసి
చక్రధరునికూర్మి సహచరు లరిగి ర
దృశ్యు లగుచు దేవ దేవుకడకు. 131

క॥ వేదత్రయసంపాద్యము
మోదంబు గుణాశ్రయంబు మొగి [1]భగవద్ధ
ర్మాదేశం [2]బగుతద్భట
వాదంబు నజామిళుండు వదలక వినుచున్. 132

క॥ శ్రీమన్నారాయణపద
తామరసధ్యానసలిలధౌతమహౌఘ
స్తోముం డై సద్భక్తికి,
ధాముం బగు చుండెఁ దెలిసి తత్క్షణమాత్రన్. 133

క॥ [3]బరవసమున నరికట్టిన
దురితంబులఁ దలఁచి తలఁచి తుదిఁ దాపమునన్
హరి నీశు నాశ్రయించుచుఁ
బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డంతన్. 134

---

1 భగవంతుని ధర్మములయొక్క యుపదేశము కలది, 2 ఆ విష్ణుభటుల వాదమును, 3 పరవశముచే.

సీ॥ వృషలియం దనురాగ వృద్ధిఁ బిడ్డలఁ గని
కులము గోదావరిఁ గూలఁ ద్రోచి
రచ్చల కెక్కి పెన్ [1]రజ్జుసేఁతల సరి
వారిలోపలఁ దల వంపు చేసి
కట్టిఁడి ముదుక నై కర్మబంధంబుల
పుట్ట నై నిందల ప్రోవ నగుచుఁ
దరుణులరోఁతలఁ దవిలి భోగించిన
కడిఁదినాజన్మంబు గాలి పోయెఁ

ఆ॥ చదువు చట్టువడియె శాస్త్రంబు మన్నయ్యె
బుద్ధి పురుపుమేసెఁ బుణ్యమడఁగె
నీతి మట్టువడియె నిర్మలజ్ఞానంబు
మొదలి కుడిగె బోధ [3]మూర్తిఁ బోయె. 135

క॥ చిక్కనిచక్కనిచన్నుల
మక్కువయిల్లాలి విడిచి మాయలుగలయీ
వెక్కసపుమద్యపానపు
డొక్కపసం దగిలి దుర్విటుఁడనై చెడితిన్. 136

ఉ॥ అక్కట ఘోరదుష్కృతమహానలకీలలు నన్ను ముట్టి పే
రుక్కడఁగింప కిట్లు ధృతి నుండఁగ నిచ్చె, నహో! దురాత్మునిన్
గ్రక్కునఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మఱే
దిక్కును లేనివారిఁ *బలు [4]త్రిక్కులఁ బెట్టుచుఁ బాఱఁదోలితిన్.

క॥ [5]అకృతజ్ఞుఁడనై విడిచితిఁ
బ్రకృతింగలబంధువులను బాల్యమున ననున్
వికృతిఁ గనకుండఁ బెంచిన
సుకృతుల మజ్జనకవరుల శోభనకరులన్. 138

---

* పెనుతీపులఁ బెట్టు—అని పాఠాంతరము.

1 పనికిమాలినపనులు (అపకీర్తి కలిగించుపనులు), 2 క్రూరుఁడయిన, ముదుక = ముదుసలి, 3 నశించిపోయెను, 4 బాధలు, (చిక్కులు), 5 కృతఘ్నుఁడనై.

వ॥ అప్పుడు. 139

ఆ॥ పెక్కుపాతకముల భృశదారుణం బైన
దొడ్డనరకమందుఁ బడ్డనున్న
నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి
రిట్టిధర్మపురుషు లెందువారొ ! 140

శా॥ చోద్యం బై కలవో లె నీక్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై
వేద్యం బయ్యెను నన్ను నీడ్చినమహోవీరుల్ భృశోదగ్రులా
యుద్యోగంబులవారు పాశధరు లీ యుత్సాహముల్ మాని సం
పాద్యానేకవికారరూపకుటిలప్రఖ్యాతు లెవ్వారలో 141

ఉ॥ దారుణపాశబంధనవిధానములన్ నరకార్ణవంబులోఁ
గూరిననన్ను నేఁడు సెడ, కుండ నొనర్చినపుణ్యమూర్తు లం
భోరుహనేత్రు లుజ్జ్వల[1]నభోమణితేజులు లోచనోత్సవుల్
చారుదయాసమంచితవిచారులు నల్వురు నెందు నేగిరో. 142

మ॥ నను రక్షించినపుణ్యవంతులు కనన్నాళీకపత్రాక్షు లం
జనసంకాశులు శంకచక్రధరు లాజానూరుబాహుల్ స్మితా
నను లాలంబితకర్ణవేష్టనసువర్ణచ్ఛాయదివ్యాంబరుల్
ఘనకారుణ్యరసైకపూర్ణులు సమగ్రస్ఫూర్తి *నెం దేగిరో. 143

వ॥ పాతకుండనగునాకు నవ్విబుధోత్తమదర్శనంబు పురాకృతంబగు మదీయపుణ్యవిశేషంబునంగాని పొంద శక్యంబు గాదు. తత్సం దర్శనం బాత్మకు నతిసుప్రసన్నం బయి యొప్పె. అట్లు గాకుండెనేని గలుషవర్తనంబున వృషలీభర్తనై యుండి మృతిఁబొందు చున్నవాడుజిహ్వకు శ్రీమన్నారాయణనామగ్రహణంబు సంభ వింపనేరదు. మఱియును. 144

* నెవ్వారలో—అని పాఠాంతరము.

1 నభోమణి = సూర్యుఁడు.

ఆ॥ పాతకుండ జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను
మానలోభమోహమత్సరుండ
నాకు నెట్లు దొరకు నారాయణునిదివ్య
నామవిమలకీర్తనంబు మదికి. 145

సీ॥ దారుణమోహాంధకారపూరితుఁడను
[1]హరివిస్మయస్మరణార్హమతినె
పంచమహాతీవ్ర పాతకోపేతుఁడ
హరివిస్మయస్మరణార్హమతినె
[2]కౌటిల్యకితవవికారపారీణుండ
హరివిస్మయస్మరణార్హమతినె
యఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండ
హరివిస్మయస్మరణార్హమతినె
తే॥ నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ
మందభాగ్యుండ నే నేడ మధువిదారి
దివ్యగుణనామకీర్తన తెఱఁగ దేడఁ
బూర్వసుకృతంబు లేకెట్లు పొందఁగలుగు? 146

వ॥ అని వితర్కించి. 147

మ॥ యతచిత్తేంద్రియమారుతుండనగుచున్ యత్నంబొనర్తున్ హరి
వ్రతసంపత్తికిఁ బుణ్యావృత్తికిఁ జిదావాసోన్ముఖాసక్తికిన్
యుతనిర్వాణపదానురక్తికి సుఖోద్యోగక్రియాశక్తికిన్
ధృతిలబ్ధోత్తమమూర్తికిన్ సకలధాత్రీధుర్యసద్భక్తికిన్. 148

క॥ విడిచితి భవబంధంబుల
నడఁచితి మాయావిమోహమైన తమంబు

---

1 హరి = హరియొక్క, విస్మయ = ఆశ్చర్యములను, స్మరణ = స్మరించుట యందు, అర్హ = తగిన, మతినె = బుద్ధిగలవాఁడనా? 2 కౌటిల్య = కుటిలత్వము నందును, కితవ = జూదరుల యొక్క, వికార = వికారచేష్టలయందును, పారీణుండ = ఆరి తేరినవాఁడను.

న్నాడిచితి నరివర్గంబులఁ,
గడచితి నాజన్మదుఃఖ కర్మార్ణవముల్. 149

క॥ యోషిద్రూపంబున నను
[1]నేషణముఖగహ్వరమున నెగ్రమింగికదుల్
ద్వేషమున గోతి సేసిన
దోషద యగునాత్మమాయఁ దొలఁగం గంటిన్. 150

వ॥ అని యిట్లు వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన నా బ్రాహ్మణుండు. 151

మ॥ భగవద్ధర్మపరాయణోత్తముల సంభాషైకమంత్రంబులన్
మిగులన్ జ్ఞానము వుట్ట మోహాభవసమ్మిశ్రాత్మబంధంబులం
దెగ ఖండించి సబంధుమిత్రసుతపత్నీ మోహవిభ్రాంతుఁడై
జగతీనాథు రమేశు కృష్ణునిదయై శ్వర్యంబులం గోరుచున్. 152

క॥ హరిభక్తులతో మాటలు
ధర నెన్నఁడుఁ జెడనిపుణ్యధనముల మూటల్
వరముక్తికాంత తేటలు,
నరిషడ్వర్గంబు చొరని యరుదగుకోటల్ 153

సీ॥ అనుచు నా బ్రాహ్మణుం డతితత్త్వవేదియై
భవబంధముల నెల్లఁ బారఁదోలి
మొనసి గంగాద్వారమున కేగి యచ్చటఁ
[2]బ్రబ్బిన దేవతాభవనమందు
నాసీనుఁడై యోగమాశ్రయించి చెలంగు
దేహేంద్రియాదుల తెరువువలన
దనుఁ బాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి
మానుగా నాత్మసమాధిచేత

1 ఏషణ = కోరికలనెడి, ముఖగహ్వరమునన్ = గుహవంటి ముఖముచే,
2 ప్రబ్బిన = సంతరించిన, వ్యాపించిన.

ఆ॥ గుణగణంబుఁ బాసి గొమరొప్పిన భగవ
దనుభవాత్మయందు నాత్మఁగలిపి
రమణఁదన్ను మొదల రక్షించినట్టి యా
పురుషవరులఁగాంచి పొసఁగ మ్రొక్కె. 154

వ॥ అట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్య శరీరుండై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధులైన మహాపురుషకింకరులం గాంచి సముంచితరోమాంచితచలచ్ఛటాపింజరిత స్వేదబిందుసందోహమిషనిష్యందమహానందవల్లికామతల్లికాంకురసంకుల పరిశోభితతనుండును హర్షనికర్షమాణమానసోద్యోగయోగప్రభావోత్సాహవిస్మయమందస్మితకందళితముఖారవిందుండును, నిఖిలజగజ్జేగీయమానాఖండశుభప్రదశుభాకారసందర్శనసమాసాదితకుతూహలమానసుండును నై, ప్రణామంబులాచరించుచు భాగీరథీతీరంబునఁ గళేబరంబు విడిచి తత్క్షణంబ హరిపార్శ్వవర్తులైన దాసవరులస్వరూపంబుఁ దాల్చి యా విష్ణుసేవకులతోడం గూడి దివ్యమణిగణఖచితంబై సువర్ణమయంబైన యసమాన విమానంబెక్కి నిఖిలానందభోగభాగ్యానుభవాకుంఠితంబైన వైకుంఠనగరంబునకు శ్రీమన్నారాయణపదారవిందసేవాచరణ పరిణామస్థితికిం జనియెను. ఇట్లు విప్లావితసర్వధర్ముండైన దాసీపతి గర్హితకర్మంబులచేతఁ బతితుండును హతప్రభుండును నై నరకంబునం గూలుచుండి భగవన్నామగ్రహణంబున సద్యోముక్తుండయ్యెం గావున. 155

క॥ కర్మంబులెల్లఁ బాయును
మర్మము దెలియంగ లేదు మధురిపుపేరే
పేర్మిని నొడువుటకంటెను
దుర్మదమునఁ జిత్త మెన్నిత్రోవలఁ జన్నన్. 156

ఉ॥ పాండవవంశపావన! నృపాలక! యీ యితిహాస మెవ్వఁడే
నొండొక భక్తిలేక వినునోర్పు మెయిం బఠియించు నాతఁడు
ద్దండత ముక్తికామినికిఁ [1]దానక మై దనుజారిలోకమం
దుండు మహావిభూతి యమదూతల చూడ్కికి గోచరాకృతిన్.

తే॥ అరయఁ [2]బుత్రోపచారితమైన విష్ణు
నామ మవసానకాలంబు ననుభవించి
శార్ఙ్గినిలయంబుఁ జేరె నజామిళుండు
నిట్లు సద్భక్తిఁ దలఁచిన నేమిసెప్ప. 158

క॥ కోరినవారలకెల్లను
జేరువ కైవల్యపదము శ్రీవరుని మదిం
గోరనివారల కెల్లను
దూరము మోక్షప్రాప్తి యెన్నిత్రోవలనైనన్. 159

## అ ధ్యా య ము ౩.

వ॥ అనినం బరీక్షిన్నరేంద్రుండిట్లనియె; మునీంద్రా!యాజ్ఞాభ్రష్టుండై యమధర్మరాజు శ్రీవిష్ణునిర్దేశకులచే విహతులైనభటులచేత వర్ణింపంబడిన నారాయణుని నామప్రభావం బాకర్ణించి వారల కేమనియె ? మఱియు నెన్నఁడేని యమదండంబు విఫలంబై పోయిన తెఱంగు గలదేని వినవలయు; ఈ సందేహంబుఁ బాప మహాత్మా! నీవు దక్కఁ దక్కినవారలు సమర్థులుగారని తలంచుచున్నవాఁడ. చిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయవచన సుధాధారలం బ్రసాదింప వలయుననిన శుకుం డిట్లనియె. 160

క॥ శ్రీకృష్ణభటులచేత ని
రాకృతులై [3]యామ్యభటులు యమునకు వాత్మ

1 స్థానము, 2 పుత్రునియందు వ్యవహరింపఁడినది. (ఉపచారము = వ్యవహారము లేక లక్షణావృత్తి), 3 యమభటులు.

స్వీకృతవిప్రకథాక్రమ
మీఁక్రియ మఱి దెలిపి; రదియు నెఱిఁగింతుఁ దగన్. 161

తే॥ చేరి త్రైవిధ్యమున మించు జీవతతికిఁ
గర్మఫలములఁ దెలిపెడు కారణంబు
లగుచు శిక్షించువారలీ యవనిమీఁద
దేవ! యెందఱు గలరయ్య తెలియవలయు. 162

క॥ దక్షిణదిశాధినాయక
శిక్ష దగం జేయువారు క్షితిఁ బెక్కండ్రే
నీక్షయమును నక్షయమును
సాక్షాత్తుగ నెందు రెండు సంపన్నమగున్. 163

తే॥ దట్టమైనట్టి కర్మబంధముల నెల్ల
నాజ్ఞ వెట్టెడువారు పెక్కైనచోట
నకట [1]శాస్తృత్వ [2]ముపచార మయ్యెఁగాదె
శూరులైనట్టిమండలేశులకుఁబోలె. 164

ఉ॥ కావున నీవ యొక్కఁడవ కర్తవు మూఁడుజగంబులందు సం
భావితభూతకోటిఁ [3]బరిపాకవశంబున శిక్ష సేయఁగా
నీవరశాసనం బఖిల నిర్ణయమై తనరారుచుండ నే
డీవలఁ గ్రమ్మఱింప మఱి యెవ్వఁడు శక్తుఁడు ధర్మపాలనా! 165

క॥ [4]చండకరతనయ! యొరులకు
దండధరత్వంబు గలదె తగజగమున ను
ద్దండధరవృత్తి [5]నొత్తిలి
దండింతువు నిన్ను దండధరుఁడనిపొగడన్. 166

---

1 శాసనముచేయు వానిభావము(శాసకత్వము), 2 నామమాత్రము(అసత్యము), 3 పుణ్యపాపముల పంట కనుగుణముగా. 4 సూర్యుని కుమారుఁడా, 5 ఒత్తిలి= గట్టిగా (మఱిమఱి).

సీ॥ ఇట్టినీదండంబ యీమూఁడుజగములఁ
దెగువమై నేఁడు వర్తిల్లుచుండ
మనుజలోకంబున మహితాద్భుతాకార
సిద్ధుల మిగులఁ బ్రసిద్ధులైన
వారు నల్వురు వేగ వచ్చి [1]నిర్దేశంబు
భంగించి మమ్మంత [2]చెంగఁదోలి
నీశాసనంబున నేమీడ్చికొనువచ్చు
క్రూరచిత్తునిఁ బుచ్చికొని యదల్చి
తే॥ పాశబంధంబు లీసునఁ బట్టిత్రెంచి
బలిమి మిగులంగ మమ్మను బాఱఁ దోలి
యిచ్చఁ జనినారువారు దామెచటివార
లాదరమ్మున మాకు నేఁడానతిమ్ము. 167

వ॥ అని రని మఱియు శుకుండిట్లనియె. అట్లు దూతలు పరితాపసమేతులై పలికిన దండధరుఁడు పుండరీకాక్షునిచరణకమలంబులు దన మానసంబున సన్నిహితంబులుగఁ జేసికొని వందనం బాచరించి పరమభక్తిపరుండై వారల కిట్లనియె. 168

సీ॥ కలఁడు మదన్యుండు ఘనుఁడొక్కఁడతఁ డెందు
వెలికిఁ గానఁగరాక విశ్వమెల్లఁ
నతిలీలమై మహాద్భుతసమగ్రస్ఫూర్తి
నుండును గోక నూలున్నభంగి
దామెనఁ బశువులు దగిలి యుండెడుమాడ్కి
నామసంకీర్తన స్థేమగతుల
విహరించు నెవ్వఁడు విలసితమత్ప్రజ
లెవ్వనిపదముల నివ్వటిల్లుఁ

1 ఆజ్ఞ, లేక నిశ్చయము, 2 చెంగఁదోలి = ఓడించి, దామెన=పలుపు, (పశుబంధనము).

ఆ॥ గనుట మనుట చనుట గల్గు నెవ్వనిలీల
లందు? లోక మెవని యందుఁ బొందు?
నెన్నఁబడుచుఁ బుడమి నెవ్వనినామముల్
గర్మబంధనముల ఁ పేర్మి నడఁచు. 169

తరలము॥ వినుఁడు నేను మహేంద్రుఁ [1]డప్పతివీతిహోత్రుఁడు రాక్షసుం
డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము భూరిసంయమిసిద్ధులుం
మొనసి కన్గొనజాల రెవ్వని మూర్తి విశ్రుతకీర్తిమై. 170

క॥ సత్త్వేతరగుణపాశవ
శత్వంబునఁ బొంద వీరు జలజాక్షు సదై
కత్వంబు గాన నోపరు
సత్త్వప్రాధాన్యు లితర[*]జనములతరమే. 171

చ॥ అభవు నమేయు నవ్యయు ననంతు [2]ననారతుఁ బూని మేనిలో
[3]నుభయమునై వెలుంగుపురుషోత్తముఁ గానరు చిత్తకర్మవా
గ్విభవగరిష్ఠులై వెదకి [4]వీటిఁడి ప్రాణులు సర్వవస్తువుల్
శుభగతిఁ జూడ నేర్చి తనుఁ జూడఁగ నేరనికంటిపోలికన్. 172

చ॥ పరమునిభక్తలోకపరిపాలనశీలుని దుష్టలోకసం
హరుని [5]పతంగపుంగవవిహారునికూరిమిదూత లామనో
హరులు సురేంద్రవందితులు నాహరిరూపగుణస్వభావులై
తిరుగుచు నుందు రెల్లెడలఁ దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్. 173

ఉ॥ లెక్కకు నెక్కువై [6]కసటు లేనిమహాద్భుత తేజ మెల్లెడం
బిక్కటిలం జరింతు రతిభీమబలాఢ్యులు విష్ణుదూత లా

---

* జనులకు సరియే—అని పాఠాంతరము.

1 వరుణుఁడు=ఉదకములకు ప్రభువు, 2 అనారతున్=ఎడతెగక యుండువానిని 3 జీవాత్మ, పరమాత్మ రూపమై (దృశ్యము ద్రష్టియు తానేయై), 4 వీటిఁడి=వెఱ్ఱివారు, 5 గరుడవాహనుని దూతలు (విష్ణుదూతలు) 6 మాలిన్యము.

చక్కనిధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్
గ్రిక్కిఱియర్ జగంబునను గేశవసేవకరక్షణార్థమై. 174

క॥ నావలనను మీావలనను
దేవాసురగణమువలనఁ ద్రిజగంబులలో
సేవగలఁబొందఁకుండఁగఁ
గావంగలవారు పుడమిఁగల వైష్ణవులన్. 175

క॥ భగవత్ప్రణిహితధర్మం
బగపడ దెవ్వారిమతికి ననిమిషగరుడో
రగసిద్ధసాధ్యనరసుర
ఖగతాపసయక్షదివిజఖచరుల కైనన్. 176

క॥ ఎన్నఁడుఁ దెలియఁగనేరరు
పన్నగపతిశాయితత్త్వభావము [1]మేనం
గన్నులవేల్పును [2]డాపలఁ
*జన్నమరినవేల్పు [3]ముదుక చదువులవేల్పున్. 177

సీ॥ పరమహాద్భుత మైన వైష్ణవజ్ఞానంబుఁ
దిరముగా నెవ్వరు దెలియఁ గలరు?
దేవాదిదేవుండు త్రిపురసంహరుఁ డొండెఁ
గమలసంభవుఁడొండె గార్తికేయ
కపిలనారదులొండె గంగాత్మజుండొండె
మనువొండె బలియొండె జనకుఁడొండెఁ
బ్రహ్లాదుఁడొండె నేర్పాటుగా శుకుఁడొండె
భాసురతరమతి వ్యాసుఁడొండెఁ

తే॥ గాక యన్యులతరమె మీాలోకమందు
నీసుబోధంబు సద్బోధ మీాపదార్థ

---

* సన్నుతిగల వేల్పు ముదురుచదువుల వేల్పున్—అని పాఠాంతరము.

1 ఇంద్రుఁడు, (వేయికన్నులవాఁడు), 2 అర్ధనారీశ్వరుఁడు (శివుఁడు), 3 బ్రహ్మ (వేదముల నాల్గుమోములందుఁ గలవాఁడు).

మీసదానందచిన్మయ మీయగమ్య
మీవిశుద్ధంబు గుహ్యంబు నీశుభంబు. 178

క॥ ఈ పన్నిద్దఱు దక్కఁగ
నోపరు తక్కొరులు దెలియ నుపనిషదుచిత
శ్రీపతినామమహోద్భృత
దీపితభాగవతధర్మ దివ్యక్రమమున్. 179

తే॥ ఏది జపియింప నమృతమై యొసఁగుచుండు
నేదిసద్ధర్మపథమని యెఱుఁగఁదగిన
దదియెసద్భక్తియోగంబు నావహించు
మూర్తిమంతంబు దా హరికీర్తనంబు 180

తే॥ కంటిరే మీరు సుతులార! కమలనేత్రు
భవ్యమగునామకీర్తన ఫలము నేఁడు
దవిలిమృత్యువు పాశబంధములవలన
[1]జాణతనమున నూడె నజామిళుండు. 181

ఉ॥ ఏటికిజాలిఁ బొంద? నరులేక్రియఁ గృష్ణునికీర్తనంబు పా
పాటవులన్ దహింపఁ గలదాటకు సందియ మేల? యిప్పు డీ
[2]తూటరి దోసకారి [3]పెనుదోసి యజామిళుఁ డంత మొందుచుం
బాటిగ విష్ణునామసుతుఁ బల్కుచుఁ గేవలముక్తి కేఁగఁడే. 182

క॥ ఇంతయును దథ్యమని మది
నింతయుఁ దెలియంగ లేరు హీనాత్ములు [4]దు
ర్దాంతతరఘటితమాయా
క్రాంతాత్యంతప్రకాశ గౌరవజడులై. 183

1 నేర్పుతో, 2 తుంటరి, 3 మిక్కిలి పాపాత్ముఁడు, 4 దుర్దాంతతర = అణఁపరాని, ఘటిత = అల్లుకొనఁబడిన, మాయా = మాయచేత, ఆక్రాంత = ఆక్రమింపఁబడిన, అత్యంతప్రకాశ = జ్ఞానకాంతియొక్క, గౌరవ = ఆధిక్యముచే, జడులై = జడత్వము గలవారై.

మంగళమహాశ్రీవృత్తము॥
ఈవిధమునన్ విబుధు లేకతమచిత్తముల [1]నేకతము లేక హరి సేయన్
భావమున నిల్పితగు భాగవతయోగపరిపాకమున నొందుదురు వారిం
దేవ లదు దండనగతిం జనదు మాఁకు గుణుతింప నఘముల్ దలఁగ మీఁదన్,
శ్రీవరునిచక్రము విశేషగతిఁ గాచు సుమి సేవితులు ముక్తిఁ గడుఁ బెద్దల్.

ఉ॥ ఎవ్వరు సిద్ధసాధ్యఖచరేశ్వలసత్పరిగీతగాథలం
దెవ్వరు ముక్తిభోగతలహేమమనోహరచంద్రశాలలం
దెవ్వరు శంఖచక్రగురుహేతిగదారుచిరోగ్రపాణులా
[2]మవ్వపురూపవంతు లసమానులు వారె ధరం గోని వైష్ణవుల్. 185

సీ॥ [3]శ్రుత్యంతవిశ్రాంత మత్యనుక్రమణీయ
భగవత్ప్రసంగతుల్ భాగవతులు
సకలసన్ముఖయోగిజనసదానందైక
పరమభాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణపదధ్యానకేవలామృతపాన
పరిణామయుతులు శ్రీభాగవతులు
బహుపాతకానీకపరిభవప్రక్రియా
పరుషోగ్రమూర్తులు భాగవతులు

తే॥ భావతత్త్వార్థవేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు భాగవతులు
సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటులేని
పదవినొప్పారువారు వో భాగవతులు. 186

క॥ అది గాన విష్ణుభక్తులఁ
గదియఁగఁ జన వలదు మీరు [4]కరివరదులస
త్పదపద్మవినతివిముఖులఁ
దుది నంటఁగఁగట్టి తెండు ధూర్తులు వారల్. 187

1 ఏకారణములేక – (ఏ ఫలాపేక్షయులేక యనుట), 2 సుకుమారమైన, 3 వేదాంతములయందు, 4 గజేంద్రునికి వరములిచ్చినవాఁడు (హరి).

సీ॥ [1]ఏకసక్కెమున కైన నిందిరారమణునిఁ
బలుకంగ లేని దుర్భాషితులను
గలలోననైన శ్రీకాంతునిసత్పాద
కమలముల్ సూడని కర్మరతుల
నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ
దార్పనేరనిదుష్కథాశ్రవణుల
యాత్రోత్సవంబుల నైన నీశునిగుడి
త్రోవఁ ద్రొక్కఁగ లేని దుష్పదులను

ఆ॥ బరమభాగవతుల పాదధూళి[2]సమస్త
తీర్థసార మనుచుఁ దెలియలేని
వారి వారివారి వారిఁ జేరినవారిఁ
దోలుతఁ గట్టి తెండు దూతలార! 188

ఆ॥ ఎల్లపాపములకు నిల్లైనయింటిలో
[3]బద్ధతృష్ణు లగుచు బుద్ధి దలఁగి
పరమహంసకులము గుఱి దప్పి వర్తించు
ధూర్తజనులఁ దెండు దూతలార! 189

ఆ॥ అరయఁ దనదుజిహ్వ హరిపేరు నుడువదు
చిత్త మతనిపాదచింతఁ జనదు
తలఁపఁ దమకు ముక్తి [4]తంగేటిజున్నొకో
సకలవిష్ణుభక్తు లకును బోలె. 190

ఆ॥ పద్మనయనుమీఁది భక్తియోగం బెల్ల
ముక్తియోగమనుచు మొద లెఱుంగు
వారి వారివారి వారిఁ జేరినవారి
త్రోవఁ బోవ వలదు దూతలార! 191

---

1 పరిహాసమునకు నైనను, 2 అన్ని తీర్థములయొక్క సారము, 3 ఆశలకు లోనైనవారు, 4 సులభసాధ్యము (తంగేటిచెట్టునందున్న తేనె).

వ॥ అని పలికె నని చెప్పి, మఱియు శుకుం డిట్లనియె; శ్రీకృష్ణనామ కీర్తనంబు జగన్మంగళంబనియును, జగన్మోహనంబనియును, జగజ్జేగీయమానంబనియును, నిఖిల[1]పాపైకనిష్కృతియనియును, నిఖిలదుఃఖనివారణంబనియును, నిఖిలదారిద్ర్యనిర్మూలనంబనియును, నిఖిలమాయాగుణవిచ్ఛేదకంబనియును, సన్నామంబులగు హరివీర్యంబుల నాకర్ణించువారలచిత్తంబు లతినిర్మలంబులగుభంగిం దక్కిన వ్రతాచరణంబులం గావనియును, శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపు వార లన్యపాపకర్మంబులగు [2]నవిద్యావ్యసనంబులంబొరయ నేరరనియును, నిజస్వామియైన యమధర్మరాజుచేతం గీర్తింపంబడిన భగవన్మహాత్త్వంబు నాకర్ణించి, విస్మితులై కాలకింకరులు, నాఁటనుండియు వైష్ణవజనంబులం దేఱిచూడ వెఱతురు; నరేంద్రా! పరమగుహ్యంబగు నీ యితిహాసంబును బూర్వకాలంబున సకలవిజ్ఞానగోచరుండైన [3]కుంభసంభవుండు సకలదుఃఖవిలయంబును సకలపుణ్యనిలయంబును నైన మలయంబునఁ బురాణపురుషుండైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నా కెఱింగించెను.

## అధ్యాయము ౪.

అని చెప్పిన విని విస్మయానంద హృదయుండై పరీక్షిజ్జనపాలుం డి ట్లనియె. 193

క॥ స్వాయంభువమనువేళల
నోయయ్య! సురాసురాండజోరగనరవ
ర్గాయతసర్గము దెలిపితి
పాయక యది విస్తరించి పలుకం గదవే. 194

క॥ ఉత్తరకోడు కి ట్లడిగిన
నుత్తరమును నమ్మునీంద్రుఁ డుత్తమచేతో

1 పాపములను ముఖ్యముగా నివారించునది, 2 అవిద్యా=అజ్ఞానమును, వ్యసనంబులను విషయవాంఛలను, 3 అగస్త్యుఁడు.

వృత్తి ముదమంది పలికెను
దత్తఅపాటుడిగి వినుఁడు తాపసవర్యుల్ ! 195

సీ॥ పూని ప్రచేతసుపుత్రులు పదుగురు
ప్రాచీనబర్హిషప్రాఖ్య గలుగు
వారు మహాంభోధి వలన వెల్వడి వచ్చి
తగ వృక్షవృతమైన ధరణిఁజూచి
మేదినీజములపై మిక్కిలి కోపించి
మదిలోన [1]దీపితమన్యులగుచు
వక్త్రంబులను మహావాయుసంయుతమైన
యనలంబుఁ గల్పించి యవనిజములఁ

తే॥ జెల్లువడఁ గాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి
వారికోపంబు వారించువాఁడ వోలెఁ
బలికెఁ జంద్రుండ యోమహాభాగులార !
దీనమగువృక్షములమీఁదఁ [2]దెగుటదగునె ? 196

తే॥ మొదల వర్ధిష్ణు లగుమిమ్ము సదయహృదయు
లగు ప్రజాపతు లనుచు సర్వాత్ముఁ డనియె
నట్టిమీరు ప్రజాసృష్టి కైనవార
లీ[3]వనస్పతితతుల దహింపఁ దగునె ? 197

సీ॥ ఆదికాలంబున నాప్రజాపతి పతి
యైన లోకేశ్వరుం డచ్యుతుండు
పద్మనేత్రుఁడు వనస్పతుల [4]నోషధిముఖ్య
జాతంబు నిషము [5]నూర్జంబుఁ గోరి

---

1 కోపము హెచ్చినవారు, 2 సాహసించుట (పరాక్రమము చూపుట యన్నమాట), 3 వనస్పతి=పువ్వులులేకుండ కాయునది (రావి మేడి మొదలయినవి) 4 ఓషధి=పంటకాగానే నశించునవి ధాన్యాదులు, 5 ఇష్టము, ర్జము=బలము

కల్పించె; నందు ముఖ్యంబైనయన్నంబు
నచరంబు లైనట్టి [1]యపదమెల్లఁ
బాదచారులకును బాల్పెట్టె, యిరుగాళ్లు
చేతులు గలిగిన జీవతతికి

తే॥ పాణు లొగి లేని యాచతుష్పాత్తులెల్ల
నన్నముగఁ బూని గావించె, నదియుఁగాక
నామహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున
నీకుననఘాఖ్యవిఖ్యాతి జొకపఱిచె. 198

క॥ నిజముగ దేశాధీశ్వరుఁ
డజుఁడు ప్రజాసర్గమునకు ననఘులమిమ్మున్
సృజియించె నిట్టివారికిఁ
గుజదహనముసేయ నెట్లు గోరికవొడమెన్. 199

చ॥ సతతమహత్త్వసత్త్వగుణసత్పురుషశ్రుతిఁ బొందరయ్య పి
పితరులునుం బితామహులుఁ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టి దు
ష్కృతమత మైనకోపమునఁ గిల్బిషభావము మానరయ్య సం
భృతకరుణావలోకమున భీతతరుప్రకరంబుఁ జూచుచున్. 200

ఉ॥ తప్పక యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు, నేత్రపంక్తికిన్
ఱెప్పలు, నాతికిం బతియు, ఱేఁడు ప్రజావలి కెల్ల, నర్థి *కిం
పొప్ప గృహస్థు, మూఢులకు నుత్తము, లెన్న సమస్తబాంధవుల్;
ముప్పునఁ గావలేని కడు మూర్ఖులు గారు నిజాలచుట్టముల్. 201

సీ॥ అఖిలభూతముల దేహాంతస్థుఁమగునాత్మ
యీశుఁడచ్యుతుఁడని యెఱుఁగవలయు,
నెఱిఁగి సర్వం బైన యిందిరారమణు లోఁ
జూపులఁ దనివిగాఁ జూడ వలయుఁ,

---

* నర్థికి నొప్పు—అని పాఠాంతరము.

1 అపదములు = పాదములులేనివి; (నడుపలేనివి, స్థావరములు, అచరము లన్నమాట.)

జూచి సద్రూప శుద్ధాత్ము లగుమిమ్ము
నెలసిన వేడ్కతో నిచ్చ మెచ్చు,
మెచ్చిన సర్వాత్ము మీరెఱింగినచోటఁ
గోపగుణంబులఁ బాప వలయుఁ,

ఆ॥ బాపి దగ్ధశేషపాదపజాలంబు
దియ్య మెసఁగ బ్రదుక నియ్యవలయు
ననఘులార! మీర లస్మదీయప్రార్థ
నంబు పరఁగఁ జేకొనంగ వలయు. 202

క॥ ఇదె వృక్షసముద్భవ యగు
[1]మదిరేక్షణ [2]నాప్సరసిఁ గువనారిక నిత్తుఁ
వదలక పత్నిఁగఁ జేకొని
ముద మందుఁడు పాదపముల మోసము వాయన్. 203

వ॥ అని యిట్లామంత్రణంబు సేసి మారిష యనుకన్యకను వారలకిచ్చి చంద్రుండు సనియె. అప్పుడు. 204

క॥ వారలు [3]పర్యాయంబున
నీరేజముఖిన్ వరించి నెఱి రమియింపన్
ధీరుఁడు ప్రాచేతసుఁడై
వారక దక్షుండు పుట్టె [4]వనజజసముఁడై. 205

క॥ ఎవ్వనిసంతానంబులు
నివ్విటిలెన్ వసుధ నెల్ల నెఱి నాదక్షుం
డెవ్వలన జగములన్నిటఁ
[5]బ్రవ్వ జలము నిలిపినట్లు ప్రజఁబుట్టించెన్. 206

ఉ॥ వారని వేడ్కతో దుహితృవత్సలదక్షుఁడు దక్షుఁ డాత్మ చేఁ
గోరి సృజించెఁ గొన్నిటి, నకుంఠితవీర్యముచేతఁ గొన్నిటిన్,

1 స్త్రీ, 2 అప్సరసి = అప్సరసలజాతికి సంబంధించినది, 3 ఒకరి తరువాత నొకరుగ (వంతులుగా), 4 బ్రహ్మతో సమానుఁడై, 5 కుండ.

ఘోరన [1]ఖేచరంబులను [2]భూచరముఖ్యవనేచరంబులన్
[3]నీరచరవ్రజంబు [4]రజనీచరజాలదివాచరంబులన్. 207

క॥ నరసురగరుడోరగకి
న్నరదానవయక్షపక్షినగవృక్షములం
దరమిడి సృష్టి యొనర్చెను
దిరముగ దక్షప్రజాపతి వితతకీర్తిన్. 208

క॥ బహువిధముల బహుముఖముల
బహురూపములైన ప్రజల బహులోకములన్
బహుళముగఁ జేసి మదిలో
[5]బహుమానము నొందఁ డయ్యెఁ బ్రఖ్యాతముగన్. 209

తే॥ ఆ ప్రజాసర్గ[6]బృంహితం బయినజగము
దక్షుఁ డీక్షించి మదిలోనఁ దాప మొంది
మఱియు జననంబు నొందించు మతము రోసి
పరమపురుషుని నాశ్రయింపంగఁ దలఁచె. 210

వ॥ యిట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు సాలక చింతించి [7]మంతనం
బున లక్ష్మీకాంతుని సంతుష్టస్వాంతుం జేయువాఁడై. 211

క॥ మోదంబై పరిదూషిత
ఖేదం బై [8]శాబరీదకిలికించితదృ
గ్భేదం బై బహుసౌఖ్యా
పాదంబై యొప్పు వింధ్య పాదంబునకున్. 212

వ॥ అరిగి [9]యందఘమర్షణం బను తీర్థంబు సర్వదురితహారంబయి

---

1 ఆకాశమునఁ దిరుగునవి, పక్షులు మొదలయినవి, 2 భూచరములు, వనే చరములు=అడవిలోఁ దిరుగునవి, 3 నీటఁ దిరుగునవి, 4 రాత్రి, పవలు తిరుగునట్టి వానిని, 5 సంతోషము, 6 బృంహితము=నింపబడినది, 7 మంతనంబున=ఏకాంత మున, 9 శబరస్త్రీలయొక్క హార్షాదులవలనఁ గలుగు చేష్టావిశేషదృష్టికలదై, 9 అఘమర్షణము = పాపములు తొలఁగించునది.

యొప్పుడాని [1]ననుసవనంబు సేవించి యతిఘోరంబైనతపంబు సేయుచు హరిం బ్రసన్నుం జేసి హంసగుహ్యంబను స్తవరాజంబున నిట్లని స్తుతియించె. 213

దక్షుండు స్తుతియించిన హంసగుహ్యంబను స్తవరాజము

తే॥ పరమునికి వందన మొనర్తుఁ బరిఢవించి
మున్న [2]వితథాను భూతికి మ్రొక్కుకొందు
మెరయ గుణములఁ దేలునిమిత్తమాత్ర
బంధు వైనట్టివానికిఁ బ్రణతు లిడుదు. 214

ఆ॥ తవిలి గుణులచేతఁ దత్త్వబుద్ధులచేత
నిగిడి కాన రాని నెలవువాని
మొదలఁ దాన కలిగి ముక్తిమూనావధి
రూప మైనవాని ప్రాపుఁ గందు. 215

ఆ॥ ఎల్ల తనువులందు నిరవొంది తనతోడఁ
బొందు సేసినట్టి పొందు కాని
పొందువొంద లేఁడు పురుషుండు గుణము నా
గుణిని బోలునట్టి గుణిభజింతు. 216

సీ॥ పూని మనంబునుం దనువు భూతములుం మఱి యింద్రియంబులుం
బ్రాణములుం వివేకగతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం
గానఁగనేర వాగుణనికాయములం బరికించునట్టి స
ర్వానుగతుం సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్.

వ॥ మఱియు ననేకవిధనామరూపనిరూప్యం బగుమనంబునకు దృష్టస్మృతులనాశంబువలనఁ గలిగెడు నుపరామం బగుసమాధియందుఁ గేవలజ్ఞానస్వరూపంబునఁ దోఁచునిర్మలప్రతీతిస్థానం బైనహంసస్వరూపికినమస్కరింతు. దారువందు నతిగూఢం బైనవీతిహో

1 సవనము చేయునప్పుడెల్ల, (అన్నినిష్ఠలయందును), 2 యథార్థవస్తువు యొక్క అనుభవము (ఆత్మానుభవమన్నమాట)

త్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించు భంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుం డగు పరమపురుషుని నాత్మశక్తి త్రయంబుచేతం దేజరిల్లం జేయుచుండు నట్టిదేవుండు సకలమాయావిచ్ఛేదకంబయిన నిర్వాణసుఖానుభవంబునం గూడి యుచ్చరింపం గొలందిగాని శక్తి గలవిశ్వరూపుండు నాకుం బ్రసన్నుం డగుం గాక; వాగ్బుద్ధీంద్రియమానసంబులచేతం జెప్పను నిట్టిదని నిరూపింపను నలవిగాక యెవ్వనిగుణరూపంబులు వర్తించు, నెవ్వండు నిర్గుణుండు, సర్వంబు నెవ్వనివలన నుత్పన్నం బగు, నెవ్వనివలన స్థితిం బొందు, నెవ్వనివలన లయంబగు, నట్టిపరాపరంబులకుం బరమంబై యనన్యంబై ప్రాక్ప్రసిద్ధంబై సర్వవ్యాపకంబై యాది కారణంబై యున్న తత్త్వంబు నాశ్రయింతు. ఎవ్వని ప్రభావంబు మాటలాడెడువారలకు వాదంబు సేయువారలకు వివాదసంవాదస్థలంబులగుచునప్పటప్పటికి మోహంబునొందించుచుండు నట్టియనంత గుణంబులుగల మహాత్మునకుం బ్రణామంబు సేయుదు. [1]అస్తినాస్తి యనువస్తుద్వయనిష్ఠలం గలిగి యొక్కటన యుండి విరుద్ధధర్మంబులుగం గనంబడు నుపాసనాశాస్త్రసాంఖ్యశాస్త్రంబులకు సమంబై వీక్షింపందగిన పరమంబు నాకు ననుకూలం బగుంగాక; ఎవ్వండు జగదనుగ్రహంబుకొఱకు జన్మకర్మంబులచేత నామరూపంబు లెఱుంగంబడ కుండియు నామరూపంబులుగలిగి తేజరిల్లు నట్టి యనంతుం డయిన భగవంతుండు ప్రసన్నుం డగుంగాక. ఎవ్వండు జనులకుం బురాకృతజ్ఞానపదంబులచేత నంతర్గతుండై మేదినిం గలుగు గంధాదిగుణంబుల నాశ్రయించిన వాయువుభంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయమనోరథంబు సఫలంబు సేయుంగాక; యనుచు భక్తిపరవశుం డయి యుక్తివిశేషంబున స్తుతియించుచున్న దక్షునికి భక్తవత్సలుండైన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొందె. అప్పుడు. 218

1 ఉన్నది, లేదు, అనెడి.

సీ॥ [1]భర్మాచలేంద్రప్రపాతద్వయంబునఁ
గలిగిన నీలంపు గను లనంగ
మొనసి [2]తార్క్ష్యుని యురమూఁపుపై నిడినట్టి
పదములకాంతులు పరిఢవిల్లఁ
[3]చండదిక్కుండలశుండాలకరముల
కైవడి నెనిమిదికరము లమరఁ
చక్రకోదండాసిశంఖనందకపాశ
చర్మగదాదుల సరవిఁ బూని

ఆ॥ నల్లమేను మెఱయ నగుమొగం బలరంగఁ
జల్లచూపు విబుధసమితిఁ బ్రోవ
[4]పసిఁడికాసెఁ బూని బహుభూషణకిరీట
కుండలములకాంతి మెండుకొనఁగ. 219

సీ॥ కుండలమణిదీప్తి గండస్థలంబులఁ
బూర్ణేందురాగంబుఁ బొందుపఱుప
దివ్యకిరీటప్రదీప్త [5]లంబరరమా
సతికి [6]గౌసుంభవస్త్రంబు గాఁగ
వక్షస్థలంబుపై వనమాలికాశ్రీలు
శ్రీవత్సకౌస్తుభశ్రీల [7]నొఱయ
నీలాద్రిఁ బెనఁగొని నిలిచిన విద్యుల్ల
తలభాతిఁ గనకాంగదంబు మెఱయ

ఆ॥ నఖిలలోకమోహనాకారయుక్తుఁడై
నారదాదిమునులు సేరికొలువఁ

---

1 భర్మాచల = మేరుపర్వతముయొక్క, ప్రపాతద్వయంబునన్ = రెండు చఱియలయందు, 2 గరుడునియొక్క, 3 చండ=భయముగలిగించు, దిక్కుండల = దిక్కుండలములందలి, శుండాల = ఏనుగులయొక్క, కరముల కైవడి = తొండముల వలె, 4 బంగరుకాసెకోక, 5 ఆకాశలక్ష్మి యను స్త్రీకి, 6 కుసుంబపువ్వురంగు అద్దినచీర, 7 ఒఱయన్=ఒఱసికొనఁగా (రాయఁగా).

గదిసి మునులు వొగడ గంధర్వకిన్నర
సిద్ధగానరవము సెవులనలర. 220

క॥ సర్వేశుఁడు సర్వాత్ముఁడు
సర్వగతుం డచ్యుతుండు సర్వమయుండై
సర్వంబుఁ జేరి కొలువఁగ
సర్వగుఁడై దక్షునకుఁ బ్రసన్నుండయ్యెన్. 221

వ॥ ఇట్లు ప్రసన్నుండయిన సర్వేశ్వరుని [1]సర్వంకషంబును మహైశ్వర్య ధుర్యంబును నయి తేజరిల్లు దివ్యరూపంబుఁ గాంచి భయంబును హర్షంబును విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని [2]చొప్పు దప్పింపం దెప్పిటి [3]కప్పరపాటునం బుడమిపైఁ జాఁగిలంబడి దండ ప్రణామంబులాచరించి కరకమలంబులు మొగిడ్చి, సెలయేఱుల [4]తొట్టునఁగొట్టువడి యిట్టట్టుఁ బట్టుచాలక నిట్టవొడిచి [5]మున్నీరు [6]దన్ని నిలచిన [7]పెన్నీరునుంబోలె సర్వాంగంబులుం దొంగలింపఁ జిత్తంబునాత్మాయత్తంబుసేసి పిక్కటిల్లినసంతోషంబుచేత భగవంతుం బలుకను, నత్యంతమంగళసందోహోపాదకంబులైన తన్నామంబులుగ్గడింపను,నతినిర్మలంబులైన తదీయకర్మంబులు దడవను, వివిధహర్షకరంబులైన తత్స్వరూపంబులు వొగడను, నాత్మీయ మనోరథంబు వాక్రువ్వను నోపక,[8]ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతింజూచి సర్వజీవదయాపరుండును [9]సర్వసత్త్వహృదంత రస్థుండును సర్వజ్ఞుండునుంగావున నతనిభావంబు దెలిసి జగన్నాథుం డార్తపోషణంబులైన భాషణంబుల నిట్లనియె. 222

క॥ మెచ్చితిఁ బ్రాచేతస! తప
మిచ్చట ఫలసిద్ధియయ్యె నిట్లతిభక్తిన్

---

1 సర్వంకషము = సర్వమును నిండినది, 2 జాడ, 3 తొట్రుపాటు (సంభ్రమము), 4 తొట్టు= తెట్టువ లేక సంబంధము చెఱువుక్రిందిపొలము, 5 మున్నీరు = సముద్రము, 6 తన్ని = మించి, 7 పెను+నీరు = పెద్దనీరు (నీటిప్రవాహము), 8 సంతానము కోరినవాఁడై, 9 అందఱిజీవుల హృదయములలో నున్నవాఁడు.

హెచ్చగు మద్వరవిభవము
నచ్చుపడం బొంద నెవ్వఁ డర్హుఁడు జగతిన్. 223

ఆ॥ తపముసాలునింకఁ దగభూతతతికి వి
భూతులొనరుఁగాక పొందుపడఁగ
నిదియసుమ్ము మాకు నిచ్ఛలోఁగల కోర్కి
పొసఁగ నీదువలనఁ బొందుపడియె. 224

వ॥ వినుము. బ్రహ్మయు భర్గుండును బ్రజాపతులును మనువులును నింద్రులును నిఖిలభూతంబులకు భూతిహేతువులయిన మద్విభూతి విభవంబులు. మఱియు నాకు యమనియమాదిసహిత సంధ్యావందనాది రూపంబగు తపంబు హృదయంబు. సాంగజపవద్ధ్యానరూపంబగు విద్య శరీరంబు. ధ్యానాదివిషయంపువ్యాపారంబు గానుండు భావనాదిశబ్దవాచ్యంబగు క్రియ యాకృతి క్రతుజాతంబు లంగంబులు; ధర్మం బాత్మ; దేవతలు ప్రాణంబులు; నిగమంబు మత్స్వరూపంబు, జగదుత్పత్తికి నాదియందు నే నొక్కండన తేజరిల్లుచుంటి. బహిరంతరంబుల వేఱొక్కటిలేక సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనంబగుటం జేసి సంజ్ఞామాత్రుండును నవ్యక్తుండును గానుండు జీవునిభంగి నొక్కండనయుందుదు; ననంతుండనై యనంత గుణంబులు గల మాయాగుణంబువలన గుణవిగ్రహం బగు బ్రహ్మాండంబును, నయోనిజుండు స్వయంభువు నగు బ్రహ్మయును నుదయించిరి; మదీయవీర్యోపబృంహితుండయి మహాదేవుండగు నా బ్రహ్మ యసమర్థుండునుంబోలె [1]నకృతార్థమ్మన్యమానమనస్కుండయి సృజింప నుద్యమించుతఱి తపం బాచరింపు మని నాచేత బోధింతుండై ఘోరంబైన తపంబాచరించి తొలుత సృష్టికర్తృత్వంబు వహించిన మిమ్ము సృజియించె; అంతఁ బంచజన ప్రజాపతి తనూజయగు యసిక్ని యనుపేరిట వినుతి నొంది

1 కృతార్థుఁడను గానని తలంచువాఁడై.

యున్న యిక్కన్యకను నీకిచ్చితి దీనింబత్నిఁగాఁగైకొని మిథున[1] వ్యవాయ ధర్మంబుగలవాఁడ వై మిథునవ్యవాయధర్మంబు గల యీ నాతియందుఁ బ్రజాసర్గంబు నతివిపులంబుగ గావింపఁ గల వాఁడవు; మఱియు నీకుఁ బిదప నిక్రమంబున నిఖిలప్రజలును మన్మాయామోహితులై మిథునవ్యవాయధర్మంబునఁ బ్రజావృద్ధి నొందించి మదారాధనపరులై యుండఁగలవారు. అని పలికి విశ్వభావనుండైన హరి స్వప్నోపలబ్ధార్థంబునుం బోలె నంతర్ధానంబు నొందెను. అప్పుడు దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై పాంచజనియగు నసిక్నియందు హర్యశ్వసంజ్ఞల వినుతిఁజెంది యున్న యయుతసంఖ్యాపరిగణితులైన పుత్రులం గాంచె. అప్పుడాధర్మశీలురైన దాక్షాయణులు పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబు కొఱకుఁ దపంబుసేయువారై పశ్చిమదిశకుం జని యచ్చట సింధు సముద్రసంగమంబున సమస్తదేవమునిసిద్ధగణసేవితంబై దర్శన మాత్రంబున నిర్ధూతకల్మషులను నిర్మలచిత్తులనుం జేయుచున్న నారాయణసరస్సనంబరఁగు తీర్థరాజంబున నవగాహనంబు సేసి నిర్మలాంతరంగులైన పరమహంసధర్మంబునందు నుత్పన్నమతులై ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రియనుమతంబున నుగ్రతపంబుసేయుచుండ, వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె. 225

సీ॥ మీరతిమూఢులు మీఁదటిగతి గాన;
 రెన్నంగఁ బసిబిడ్డ లన్నలార!
పుడమిఁ జా నింతని కడఁ బరికింపరు
 ప్రజలఁ బుట్టింప నేప్రతిభ గలదు?
అట్టైన నొక్కమహాత్ముఁడు పురుషుండు
 బహురూపములుగల భామయొక్క తె
పుంశ్చలి గర్తంబు బురణింప నుభయప్ర
 వాహంబు గలనది వఱలఁ గదల

---

1 దంపతుల సంయోగవ్యాపారము.

ఆ॥ నంచయొకటి [1]యిరువ దైదింటిమహిమలఁ
గలిగి యుండు తెరువు గానరాక
వజ్రనిబిడ మగుచు వరుసఁ దనంతన
తిరుగుఁ గాష్ఠబిలము దేటపడఁగ. 225

క॥ వినుఁ డెందులకు ననుమోష్ఠము
నను వొందఁగ నెఱుఁగ కాత్మ నాత్మగుసూక్తిం
గానసాగించెద మను మి
మ్మున నేమియు లేదు మూఢులని తెలిసితగన్. 226

వ॥ అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారద వాక్యంబులఁ దమలోన నిట్లని వితర్కించిరి. 227

తే॥ సారిది క్షేత్రజ్ఞుఁ డన నతిసూక్ష్మబుద్ధి
నరయ నజ్ఞానబంధనం బగుచు లింగ
దేహమన నెద్ది గల దది దెలియకున్నఁ
గలదె మోక్షంబు దుష్కర్మగతులచేత. 228

తే॥ కలఁడు జగదేకసన్నుత కారణుండు
స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు
పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మకైనఁ
గలుగునే ముక్తిపదము దుష్కర్మగతుల? 229

ఆ॥ పురుషుఁ డెట్టులేనిఁ బూని బిలస్వర్గ
గతుఁడుఁబోలె వర్తకంబుమాను
నట్టిబ్రహ్మ మెఱుఁగు నయ్యుకు స్వర్భోగ
కర్మగతుల నేమి గానఁబడును? 230

---

1 ఇరువదియైదు = అనగా పంచవింశతితత్త్వమును - (వానిమహిమలు.) ఆతత్త్వములు. అవ్యక్తము, మహత్తు, అహంకారము, మనస్సు, జ్ఞానేంద్రియకర్మేంద్రియములు ౧౦, తన్మాత్రలు, మహాభూతములు, పురుషుఁడు (మొత్తము ౨౫)

శా॥ తన్నిష్ఠాగతిలేనివానికి నసత్కర్మప్రచారంబుచే
మున్నేమయ్యెడినాత్మ బుద్ధిగుణ సమ్మోహంబునం దోఁచుచున్
వన్నెల్ వెట్టుక వింతబాగులతఱిన్ వర్తించు దౌర్గత్య సం
పన్నశ్రీయును బోలె నెల్లగతులం బ్రఖ్యాతమై యుండఁగన్. 231

సీ॥ అనువొంద సృష్టి నవ్యయముగఁ జేయుచుఁ
బ్రమరప్రవాహసంపతితమైన
నెఱయఁ గూలంబను నిర్గమస్థానంబు
నందు వేగము గల క్రందుమాయ
గదలి యహంకార గతివశంబునఁ జాల
వివశుఁడై బోధకు [1]విపరియైన
వానికి నీరీతి వలవంత కర్మప్ర
చారంబులనుమీఁదఁ జక్కనైన

ఆ॥ జన్మమరణముఖ్యజాడ్యంబులతోఁ బాసి
నిఖిలసౌఖ్యపదవి నెఱసి క్రమ
మార్గమైనయట్టి మహనీయధామంబుఁ
జిత్తమార నెట్లుసేరఁ గలఁడు? 232

తే॥ దానిసంసర్గగుణములు దప్పి నడచు
కుచ్ఛితపుభార్యఁ జేకొన్న కుమతివోలెఁ
దివిరి సుఖదుఃఖములఁ గూడి తిరిగి జీవ
రూప మెఱుఁగనివారికిఁ బ్రాపుగలదె? 233

మత్తకోకిలము.
పంచవింశతితత్త్వరాశికపారదర్పణ మయ్యుఁ దాఁ
గొంచెమై పురుషుండు తత్త్వముఁ గోరి పట్టఁగ నేరఁ డే
మంచుఁ గించుఁ దలంచువాఁడు [2]కదధ్వకర్మము సేయఁగా
మంచిలోకము వాని కేటికి మానుగా సమకూరెడిన్? 234

---

1 విపరి = బుద్ధిభేదముగలవాఁడు, 2 దుర్మార్గపుపని.

క॥ బంధానుమోక్షణక్రమ
సంధానైశ్వర్యధర్మశాస్త్రసమగ్ర
గ్రంథంబు మాను చిత్రా
పాంథునకును గర్మగతుల నగునే శుభముల్ ? 235

మత్తకోకిలము.

చూపు నీడగ మంతియున్ వెసఁజుట్టి పట్టుక త్రేల నే
జోడు లేక రయంబునం [1]గుడిసుట్టువట్టి స్వతంత్రముం
గూడి యుండినకాలచక్రముఁ గోరి చూడనివారి కే
జాడఁ గల్గును గర్మసంగతిఁ జాదుమోక్షపదం బిలన్ ? 236

ఆ॥ జన్మహేతువైన జనకునిర్దేశంబు
తనకుఁ జేయరాని దనుచుఁ దెలిసి
గుణమయప్రవృత్తి ఘోరాధ్వనిశ్శ్వాస
నిరతుఁ డగుచుఁ జేయ నేరఁ డతఁడు. 237

వ॥ అని తమలోఁ వితర్కించి యాకుమారు లప్పుడు. 238

సీ॥ వినవయ్య! భూపాల! మునివరేణ్యునిమాట
లనుమోదఁ దలపోసి వినయ మలర
[2]వలగొని యతనికి వందనంబు లొనర్చి
తిరిగి యెన్నఁడు రాని తెరువు వట్టి
చయ్యన నేగిరి సహజసత్త్వబ్రహ్మ
మయమైనపంకజనయను పాద
పద్మమరందంబు పానంబు సేయుచు
మత్తిల్లి నిలిచినమానసాళి.

1 సున్నచుట్టునటువంటి (లయముచేయుట యన్నమాట), 2 ప్రద
క్షిణము చేసి.

ఆ॥ బరిణమింప విష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి
సరణి మ్రోయు మహతి సంఘటించి
నారదుండు గుణవిశారదుం డెందేనిఁ
జనియెఁ దన్ను జగము సన్నుతింప. 239

క॥ అప్పుడు దక్షుఁడు దనయులు
దప్పి మహాపథము గనుటఁ దగ నారదుఁడే
చెప్పినఁ గప్పినశోకము
ముప్పిరిగొని చిత్తవృత్తి [1]మూరింబోవన్. 240

చ॥ అడలుచు నున్న వచ్చి కమలాసనుఁ డూఱడిలంగఁ బల్కి మున్
పడసినలీలఁ బుత్రుల నపారగుణాఢ్యులఁ గాంచు చున్న నా
పడఁతుకయందుఁ బల్వురను బన్నగఁ దా శబళాశ్వస జ్ఞలన్
[2]బెడఁగగువారిఁ బుణ్యములఁ జేర్చినవారి సహస్రసంఖ్యలన్. 241

క॥ పుట్టించిన జనకునిమదిఁ
బుట్టిన తలఁ పెఱిఁగి వారు పూనికఁ బ్రజలం
బుట్టించువ్రతముఁ గైకొనిఁ
గట్టిగఁ దపమాచరింపఁ గాఁజనిరి వెసన్. 242

వ॥ ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రిపంపునం దపంబు సేయువారై యేతీర్థంబు తీర్థరాజంబై సకలతీర్థఫలంబు నాలోకనమాత్రంబున ననుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు, నేతీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధింబొందుదు, రట్టినారాయణసరస్సను పుణ్యతీర్థంబునకుంజని [3]తదుపస్పర్శమాత్రంబున [4]నిర్ధూతమలాశయులై. 243

శా॥ బ్రహ్మేంద్రాదులు నందనేరని పరబ్రహ్మంబుఁ జింతించుచున్
బ్రహ్మానందముఁ బొంది [5]జిహ్వికలపై బ్రహ్మణ్యమంత్రంబులన్

---

1 నశింపగా, 2 చక్కనై యున్నవారిని, 3 దానిని దాఁకుటచేతనే, 4 ఎగురఁగొట్టఁబడిన పాపభావములు కలవారై, 5 నాలుకలమీఁద.

బ్రహ్మలోకనవాంఛతో నిలుపుచుఁ బ్రహ్మం బితండంచు ముక్
బ్రహ్మజ్ఞానగురుం హరిం దపమునం బాటించి రబ్యాలకుల్. 244

సీ॥ ఏకపాదాంగుష్ఠ మిలమీఁద సవరించి
నిశ్చలకాయులై నిక్కి నిలిచి
కరములు గీలించి సరవి మీఁదికి నెత్తి
గుఱుతుగాఁ [1]బెనుబయల్ గుట్టిపట్టి
నిడివిగాఁ గ్రూరమై నిగిడినచూడ్కులఁ
గఁడుఁ దీవ్ర భానునిఁ గూడిచిపట్టి
వడిఁ గొంతకాలంబు వాయువుభక్షించి
యంతనుండియు నిరాహారులగుచు

ఆ॥ సకలలోకములకు సంహారకరమును
బేర్చి దేవతలకు భీతికరము
గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడఁగిరి
మహితచిత్తు లక్కుమారవరులు. 245

నారదుఁడు శబళాశ్వులకు నివృత్తిమార్గంబు నుపదేశించుట

వ॥ ఇట్లతిభయంకరంబైన తపంబు సేయుచు నెడతెగక భగవన్మంత్రం బులు నొడువుచుఁ బ్రజాసర్గకాములై యున్న యచ్చిన్నబాలుర కడకు నారదుండు సనుదెంచి, పూర్వవిధంబునం బలుకుచు నిట్లనియె; భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారంబాలుకుచున్న నా వచనంబు లాదరించి తోఁబుట్టువులు సనినమార్గంబునఁ జనుండు. ఎవ్వరేనిం దమయగ్రజులు సన్నమార్గంబునం దాముచుం దప్పక వర్తింతురేని నట్టివారిని విశేషధర్మం బెఱింగినవారంద్రు. సతతం బును బుణ్యాబంధువులైన దేవతలంగూడి సుఖంబుండుండు. అని బల్కి నారదుండు సనియె; వారలును సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమపదంబునకు నాస్పంబులైన దేవర్షి వాక్యం బుల నాశ్రయించి. 246

[1] పెద్దబయలు = మహాకాశము.

ఉ॥ అప్పుడు లజ్జతోడ శబలాశ్వులు పూర్వజు లేగినట్టి యా
చొప్పున నెన్నఁడుం దిరిగి చూడనిత్రోవ విశేషపద్ధతిం
దప్పక పోయి రయ్య గుణధాములు నేఁడును మళ్ళరేమి నేఁ
జెప్పెదఁగాక రాక కడ సేరిన రాత్రులఁబోలి భూవరా! 247

క॥ దక్షుని కాకాలంబున
లక్షితమైయుండెఁ బెక్కులాగుల నుత్పా
తక్షోభంబులు వానికి
[1]పౌత్రవ్యథనొందె నా పురుషనాశంబున్. 248

క॥ నారదకృతమని యెఱిఁగి మ
హారోషముతోడ నేగి యాతనిఁగని దుః
ఖారూఢచిత్తుఁడై మది
నూఱడిలం దెరువులేక యుగ్రుండగుచున్. 249

ఆ॥ మోము జేవురింప ముడివడ బొమదోయి
చూపువెంట మంటసుడిగొనంగఁ
బెదవులదరఁ బండ్లు పెటపెటఁగొఱుకుచు
దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె. 250

చ॥ నెఱయఁగ సాధురూపమున నీవతిబాలుర కాత్మజాలికిం
గఱుకున భిక్షుమార్గమగు కందువ సెప్పితివేల ధూర్తవై?
మఱఁగక యుండవచ్చునె కుమారుల నీదురితంబువొంద, ని
న్నొఱలఁగఁద్రొత్తు నాదుసమదోగ్రమహోగ్రహశాపవహ్నులన్.

దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట

వ॥ అదియెట్లంటేని, దేవర్షి పితృఋణంబులు దీర్పక, కర్మవిచారంబు సేయని బాలుర మనంబులకు నైహికేచ్ఛలయందు [2]నైరాశ్యంబు గలుగంజేసి నివృత్తిమార్గంబుపదేశించి వారలకు నుభయలోకములయందుఁ జెందఁగల శ్రేయోహాని నొనర్చితివి. ఇట్టిపాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానిం బొంది చరి

1 మైత్రీపుబాధ, 2 నైరాశ్యంబు = ఆశలేకుండుట.

వుదుగాక; నిరపరాధులై వైరంబులేని నాపుత్రులపట్ల ద్రోహకృత్యంబొనర్చి నీవు దప్పఁ దక్కినభాగవతోత్తములు సకలభూతానుగ్రహపరవశులుగావుననిరంతరంబును లోకసంచారివైన నీకు నేలోకంబునను నునికిపట్టు లేకుండుంగాక యని నిర్దయుండై శాపంబిచ్చెను. అంత నారదుండు తత్క్రోధవాక్యంబుల కలుగలుగక యట్లకానిమ్మని సమ్మతించి చనియెను. ఇట్టిశాంతభావం బెవ్వనివలనం గలుగు నతండు సర్వాతీతుండయిన సర్వేశ్వరుం డనంబడు.

## అధ్యాయము ౬.

మఱియు దక్షుండు దనమనోరథంబు విఫలంబగుటం జేసి యతి దుఃఖితమనస్కుఁడై పొగులు చున్నఁ బితామహుండు సనుదెంచి మఱియుఁ [1]ప్రజాసర్గోపాయం బుపదేశించిన నాప్రజాపతి ప్రియ భామయైన యసిక్నియందుఁ బితృవత్సలలైనపుత్రికల నఱువదుండ్రం బుట్టించి, వారిలో ధర్మునకుం బదుగురను, కశ్యపునకుం బదుమువ్వురను, జంద్రునకు నిరువదేడ్వురను, భూతునకు నాంగిరసునకుఁ గృశాశ్వునకు నిద్దఱేసిచొప్పున నార్వురను, తార్క్ష్యుండను నామాంతరంబుఁదాల్చిన కశ్యపునకు మరలఁ గడమనలువురను, నీ క్రమంబున నిచ్చె వారినామంబు లాకర్ణింపుము. 252

ఆ॥ ఎట్టిపుణ్యవతులొ యీచేడియలు సెప్ప
[2]సవతు లేనియట్టి సవతులయ్యుఁ
గడుప వడసి రెట్టికడుపునఁ బుట్టిరో
కడిఁది త్రిజగమెల్లఁ గడుపుగాఁగ. 253

వ॥ వారలెవ్వరనిన భానువులంబయుఁగకుప్జామియు విశ్వయు సాధ్యయు మరుత్వతియు వసువు ముహూర్తయు సంకల్పయు ననంబదుగురు గురుధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి; వార

1 సృష్టిచేయు నుపాయము, 2 సాటి.

లెవ్వరంటేని భానువునకు వేదఋషభుండు పుట్టె, నతనికి నింద్ర సేనుం డుదయించె, లంబకు విద్యోతుండు గలిగె, నతనికి స్తనయిత్నువు లనువారు పుట్టిరి, కకుబ్దేవికి సంకటుండు పుట్టె, సంకటునకుం గీటకుండు పుట్టె. కీటకునకు దుర్గాభిమానిను లయిన దేవతలు జన్మించిరి. జామిదేవికి దుర్గభూముల కధిష్ఠానదేవతలు జనియించిరి. వారికి స్వర్గుండును నందియు జన్మించిరి, విశ్వయను దానికి విశ్వేదేవగణంబు జనియించె, వార లపుత్రకులనం బరఁగిరి, సాధ్యయనుదానిక సాధ్యగణంబులు పుట్టె, వానికి నర్థసిద్ధి యను వాఁడు పుట్టె, మరుత్వతి యనుదానికి మరుత్వంతుఁడు జయంతుం డనువారలుదయించిరి. అందు జయంతుండు వాసుదేవాంశజుం డైన యుపేంద్రుం డనంబడి వినుతినొందె, ముహూర్త యనుదానికి సకలభూతంబులకు నాయాకాలంబులం గలిగెడు నాయాఫలాఫలంబుల నిచ్చుమౌహూర్తికు లనియెడు దేవగణంబులు పుట్టిరి. సంకల్ప యనుదానికి సంకల్పుం డుదయించె. ఆసంకల్పునకుఁ గాముండు జనియించె. వసు వనుదానికి ద్రోణుండును బ్రాణుండును ధ్రువుండును నర్కుండును నగ్నియు దోషుండును వసువును విభావసువును నన నెనమండ్రు వసువు లుదయంబు నొందిరి. అందు ద్రోణునకు నభిమతి యనుభార్యయందు హర్షశోకభయాదులు పుట్టిరి. ప్రాణునకు భార్య యైనయూర్జస్వతియందు సహుఁడును నాయువును బురోజవుండును ననువారు గలిగిరి. ధ్రువునకు భార్యయగు ధరణియందు వివిధులగుపురుషు లనువారు జనించిరి. అర్కునికి భార్యయగు వాసనయందుఁ దర్షాదు లుదయించిరి. అగ్నికి భార్యయైన వసుధారయందు ద్రవిణకాదులు పుట్టిరి. మఱియుఁ గృత్తికలకు స్కందుండు గలిగె. ఆస్కందునకు విశాఖాదు లుదయించిరి. దోషునకు శర్వరి యనుభార్యయందు హరికళ శింశుమారుం డుదయించె. వస్థువునకు నాంగిరసయందు విశ్వకర్మ యనుశిల్పాచార్యుం డుదయంబందె. ఆవిశ్వకర్మకు నాకృతి యనుసతియందుఁ జాక్షుషుం డను మనువు జనియించె.

ఆమనువు వలన విశ్వులు సాధ్యులనువారలు పుట్టిరి. విభావసునకు నుషయనుభార్యయందు వ్యుష్టియు రోచియు నాతపుండును జనించిరి. అందు నాతపునికిఁ బంచయాముండను దివసాభిమాన దేవత జనియించె. శంకరాంశజుండయినభూతునకు సరూప యనుభార్యయందుఁ గోట్లసంఖ్యలైన రుద్రగణంబులుదయించిరి. మఱియు రైవతుండు నజుండు భవుండు భీముండు వాముండు నుగ్రుండు వృషాకపియు నజైకపాత్తు నహిర్బుధ్న్యుండు బహురూపుండు మహాంతుండు ననువారలును రుద్రపారిషదులును నతిభయంకరు లయినప్రేతులును వినాయకులును బుట్టిరి. అంగిరసుండను ప్రజాపతికి స్వధయనుభార్యయందుఁ బిత్రుగణంబులు పుట్టిరి. సతి యనుభార్యకు నథర్వ వేదాభిమాన దేవతలు పుట్టిరి. కృశాశ్వునకు నర్చి యనుభార్యయందు ధూమ్రకేశుం డనుపుత్త్రుం డుదయించె. వేదశిరునకు ధిషణ యనుభార్యయందు దేవలుఁడును వయునుండును మనువునుంబుట్టిరి. తార్క్ష్యునకు వినతకద్రువ పతంగి యామిని యను నలువురు భార్యలందుఁ బతంగికిఁ బక్షులు పుట్టె. యామినికి శలభంబులు పుట్టె. వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి వాహనంబయిన గరుడుండును సూర్యునకు సారథియైన యనూరుండును జనియించిరి. కద్రువకుఁ బెక్కుతెఱంగు లగు భుజంగమంబులు పుట్టె. చంద్రునకుఁ గృత్తికాది నక్షత్రంబులు భార్యలయినను వారల యందుఁ జంద్రుండు రోహిణియందుమాత్రము మోహితుం డగుటం జేసి దక్షశాపంబున క్షయరోగగ్రస్తుండై సంతానంబు పడయ నేరఁడయ్యె. అంత దక్షప్రసాదంబున క్షయపీడితంబు లగు షోడశ కళల మరలం బొందె; మఱియును. 254

సీ॥ కామితప్రదుఁ డైన కశ్యపుకౌఁగిట,
ముచ్చట దీర్తురే ముద్దరాండ్రు
రఖిలలోకములకు నవలనై జగ మెల్లఁ,
బూజింప నుందురే పువ్వుఁబోండ్లు

బలియురై పుత్రులు పౌత్రులు త్రిజగంబు,
లేలంగఁ జూతురే యిందుముఖులు
ముంగొంగుపసిఁడిరై మూల్గుపుణ్యాంబుల,
విఱ్ఱవీఁగుదు రెట్టి వింతరాండ్రు

తే॥ వారికెలగంప కడుపుల నేరుపరుల
నరిదిబిడ్డలఁ బడసిన బిరుదు సతుల
నామములు నన్వయంబులు నీమనంబు
ప్రానఁజెప్పెద వినవయ్య మానవేంద్ర! 255

తరలము. అదితియున్ దితి గాష్ఠయున్ దను వయ్యరిష్టయుఁ దామ్రయు
న్నదనఁ గ్రోధవశాఖ్యయున్ సుర సాఖ్యయున్ సురభిన్ మునిన్
మొదలుగాఁ దిమియు న్నిళాఖ్య సుముఖ్యయాసరమాదిగా
ముదిత లెన్నఁగఁ గన్నసంతతి ముజ్జగంబుల భూవరా! 256

సీ॥ చాలంగఁ దిమికిని జలచరంబులు పుట్టె,
మఱి[1]*శ్వాపదములు సరమకును బ్రబలు,
సురభికి మహిషాది సురభులు జనియించెఁ,
దామ్రకు శ్యేనగృధ్రములు గలిగె,
మునికి నప్సరసల మూఁకలు జనియించె,
నిళ గనె భూరుహాములను, క్రోధ
వశ కుదశ్రవిల్లె దుర్వారసర్పంబులు,
సరి యాతుధానులు సురస కరయ

తే॥ నుప్పతిల్లిరి, గంధర్వ లోకమొగి న
రిష్టకు సుతుల్, దనువునకుఁ ద్రిదశరిపులు.
పదియు నెనమండ్రు నైనట్టి విదితబలులు
వారినామాన్వయంబులఁ గోరి వినుము. 257

---

* కిరాతులు—అని పాఠాంతరము.

1 శ్వాపదులు = వ్యాఘ్రాదులగు ఘాతుక జంతువులు.

వ॥ ద్విమూర్ధుండును శంబరుండును నరిష్టుండును హయగ్రీవుండును విభావసుండును నయోముఖుండును శంకుశిరుండును స్వర్భానుండును గపిలుండును నరుణియుఁ బులోముండును వృషపర్వుండును నేకచక్రుండును ననుతాపకుండును ధూమ్రకేశుండును విరూపాక్షుండును దుర్జయుం డను విప్రచిత్తియు ననువారలు వీరలలోన స్వర్భానునకు సుప్రభ యనుకన్యక పుట్టె. దాని నముచి వివాహంబయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు పుట్టె. దాని నహుష పుత్రుండైన యయాతి పెండ్లి యయ్యె. వైశ్వానరునకు నుపదానవి హయశిరస పులోమ కాలక యను నలువురు పుత్రికలు దయించిరి. అందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్ని యయ్యె. హయశిరసను క్రతువు వివాహంబయ్యె. పులోమ కాలక యను నిరువురను గశ్యప ప్రజాపతి చతుర్ముఖుని వాక్యంబునఁ గైకొనియె. ఆయిరువురకును సమరకోవిదులయిన దానవులు పౌలోమ కాలకేయులనఁ బుట్టిరి. మఱియు నా యిరువురకు నరువదివేల రాక్షసులు జన్మించిరి. వారు యజ్ఞకర్మంబులకు విఘాతకులై వర్తింప వారి నింద్రునకుం బ్రియంబుగా నీ పితామహుండగు నర్జునుండు వధించె. మఱియు విప్రచిత్తి సింహిక యనుదానియందు రాహుప్రముఖంబుగాఁ గల కేతుశతంబును బడసె. వారలు గ్రహత్వంబుఁ గైకొనిరి. మఱియుం బురాణపురుషుండైన శ్రీమన్నారాయణుండు దన యంశంబునఁ బరమభాగ్యవతి యయిన యదితిగర్భంబున నుదయించె. ఆయదితివంశంబును విదితంబుగా వినిపించెద సావధానుండ వగు వినుము. వివస్వంతుండును నర్యముండును బూషుండును ద్వష్టయు సవితయు భగుండును ధాతయు విధాతయు వరుణుండును మిత్రుండును శుక్రుండును నురుక్రముండును ననుమనువులు జన్మించిరి. అందు వివస్వంతునకు శ్రాద్ధదేవుండను మనువు సంజ్ఞాదేవియందు నుదయించె. మఱియు యముండు యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి. వెండియు నా సంజ్ఞాదేవి బడబాస్వరూపంబు నొంది యశ్వినీదేవతలం గనియె.

ఛాయాదేవియందు శనైశ్చరుండును సావర్ణియనుమనువును దపతి యనుకన్యకయుం బుట్టిరి. ఆతపతిని సంవరణుండు వరియించె. అర్యమునకు మాతృక యను పత్నియందుఁ జర్షణు లుదయించిరి. వారిమూలంబున మనుష్యజాతి యాలోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడె. పూషుండు భర్గునిఁ జూచి దంతంబులు వివృతంబులుగా నగిన నతండు క్రోధించి దంతంబు లూడఁబడిచిన నాఁటనుండియు భగ్నదంతుండయి యనపత్యుండయి పిష్టాదులు భక్షించుచుండె. త్వష్టకు దైత్యానుజ యైన రచనయను కన్యకకు నధిక బలాఢ్యుండగు విశ్వరూపుండు పుట్టె. అంత నా దేవతలు బృహస్పతి గోపించి తలంగి పోయినం దమకు నావిశ్వరూపుని నాచార్యునింగా వరియించిరి. అని చెప్పిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్న రేంద్రుం డిట్లనియె. 258

## అధ్యాయము ౭.

సీ॥ అరయంగ యోగీంద్ర యద్భుతం బయ్యెడు
సురలపై నేటికి సురగురుండు
గోపించె ? నీతండు గురుభావమున దేవ
తల కేమియాపదఁ దలఁగఁజేసె ?
నెఱిఁగింపు మనవుడు నింద్రుండు త్రిభువనై
శ్వర్యమదంబున సత్పథంబు
గానక వసురుద్రగణములు నాదిత్య
మరుదశ్వి దేవాదిమండలములు

తే॥ సిద్ధచారణగంధర్వజిహ్మగాది
సురలు మునులును రంభాది సుందరాంగు
లాడఁ బాడంగ వినుతి సేయంగఁ గొలువఁ
మ్రొక్క భద్రాసనంబున నుక్కుమీఱి. 259

సీ॥ నిండుపున్నమనాఁడు [1]గండరించినచంద్ర
మండలశ్రీలతోఁ మాఱుమలయు
భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలుచు
[2]మిన్నేటితరఁగల మేలుకొలుపఁ
గలితదివ్యాంగనాకరతలచాతుర్య
[3]చామీరకశ్రేణి జాడపఱుపఁ
జింతామణిస్ఫుటకాంతరత్నానేక
ఘటితసింహాసనాగ్రంబునందు

తే॥ నూరుపీఠంబుపై శచియుండ నుండి
వరుస దిక్పాలకాది దేవతలు గొలువ
సాటిసెప్పంగరానిరాజసముతోడ
నింద్రుఁ డొప్పారె వైభవసాంద్రుఁడగుచు. 260

వ॥ అయ్యవసరంబున. 261

క॥ గురుతరధర్మక్రియ [4]నయ
గురుఁడుఁ [5]గురుమంత్రవిషయ [6]గురుఁడు వచశ్శ్రీ
గురుఁడు సమస్తామరగణ
గురుఁడు గురుండరుగుదెంచెఁ గొల్వునకు నృపా! 262

చ॥ అమిత తపఃప్రభావుఁ గరుణాత్ముని [7]గీష్పతిఁ జూచి రాజ్యదు
ర్దమమదరేఖ నింద్రుఁడు వృథా తనగద్దియ లేవకుండె నె
య్యమున నెదుర్కొనం జనక యాసనమీయక గౌరవోపచా
రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్. 263

క॥ అప్పుడు సురపతి గన్నులఁ
గప్పిన సురరాజ్యమదవికారంబునకుం
జప్పుడు సేయక గృహమున
కప్పుణ్యుఁడు దిరిగిపోయె నతిఖిన్నుండై. 264

---

1 పుట్టిన, 2 ఆకాశగంగలోని కెరటములు, 3 చామరముల సమూహము, 4 నీతిశాస్త్రగురువు, 5 గొప్పయాలోచన విషయములో గట్టివాడు, 6 వాక్కులనెడి లక్ష్మికి సముద్రము. 7 బృహస్పతిని.

చ॥ ఎఱుఁగమిఁ జేసినట్టి గురుహేళన మంత నెఱింగి యింద్రుఁ డ
చ్చెరువడి భీతి నొంది యతి చింతితుఁడై తలపోసి పల్కె న
ప్పరమపవిత్రు లోకనుతు భవ్యచరిత్ర విశేషు పాదపం
కరుహముఁ బూజ సేయక యకర్మముఁ జేసితి నల్పబుద్ధి నై.

క॥ త్రిభువనవిభవమదంబున
సభలో మద్గురువునకుఁ బ్రసన్నునకు లస
త్ప్రభువునకు నెగ్గు సేసితి
శుభములు దొలఁగంగ నే [1]నసురభావమునన్. 266

ఆ॥ [2]పారమేష్ఠ్య మయిన పదవి నొందినభూపు
లెట్టివారి కైన లేవ వలదు
విబుధు లిట్లు సెప్ప విధ మెన్నవారలు
ధర్మవేత్తలనుచుఁ దలఁపఁబడరు. 267

ఆ॥ కుపథవర్తులగుచుఁ గుత్సితదుర్వచో
నిపుణులైనవారు నిడివి దెలిసి
తొలఁగలేక వారధోగతిఁ బడుదురు,
తప్పలేక రాతి తెప్పభంగి. 268

ఉ॥ కావున లోకవందితుఁడు కార్యవిచారుని యింటి కేగి త
త్పావనపాదపద్మములపై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి స
త్సేవ యొనర్చి చిత్తమువసింపఁ బ్రసన్నుని నొనర్తునంచు న
ద్దేవవిభుండు వోయె నతి తీవ్రగతిన్ [3]గురుధామసీమకున్. 269

సీ॥ ఈరీతిఁ దనయింటి కేతెంచు దేవతా
పతిరాక యాబృహస్పతి యెఱింగి
యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁడై
పోయె నప్పుడు దేవ పుంగవుండు

---

1 రాక్షసస్వభావముతో, 2 పరమేష్ఠిస్థానము, గొప్ప పదవి యన్నమాట, 3 గురునియింటికి.

సకలంబుఁ బరికించి జాడఁగానక గురు
జింతించి తలపోసి చిన్నవోయెఁ
బోయిన విధమెల్ల దాయలు రాక్షస
వీరులు వేగుల వారివలనఁ

తే॥ దెలిసి మిక్కిలి తమలోనఁ దెలివి నొంది
యందఱును గూడి భార్గవు నాశ్రయించి
తత్కృపాదృష్టిఁ దమశక్తి దట్టమైన
దేవతలమీఁదిదాడికిఁ దెరువు వెట్టి. 270

దానవులు దేవతలతో యుద్ధముసేసి దేవతల నోడించుట.

క॥ ధూర్తులు సమస్తకిల్బిష
మూర్తులు [1]వరధర్మకర్మమోచితమార్గా
వర్తులు దుర్ణయ నిర్మిత
కీర్తులు దానవులు సనిరి [2]గీర్వాణులపై. 271

స్రగ్ధర॥ దండింగోదండకాండోద్ధతరథహయవేదండదండంబుతోడన్
దండెత్తెన్ మెండుగా నద్దనుజనికరముల్ దైవవర్గంబుమీఁదం
జండబ్రహ్మాండభేదోచ్చ్రయజయరవముల్ సర్వదిక్షోభగాను
ద్దండప్రఖ్యాతలీలం దలపడిరి సురల్ దర్పులై వారితోడన్. 272

చ॥ మదమున దేవదానవులు మచ్చరముల్ గదుఁ బిచ్చలింప సం
పదలను గోరి పోరునెడ [3]భార్గవ మంత్రకళావిశేషులై
యెదురులు వాఱునస్త్రముల సేయ మహాసురు లేచి యేసి పెం
గుదులుగఁ ద్రుళ్ళ దేవతలు [4]క్రొత్తల కోర్వక *[5]వీఁగి రయ్యెడన్.

* పాఱి రయ్యెడన్—పాఠాంతరము.

1 ధర్మమునుండి తప్పినదారిలో నడిచెడువారు, 2 దేవతలు, (మాటయే బాణముగాఁగలవారు), 3 శుక్రాచార్యుని యాలోచన, విద్యయనువానియొక్క యతిశయముగలవారై, 4 ఎదుటనిలిచి యుద్ధముసేయుటకు, 5 ఓడిపోయిరి.

ఆ॥ దనుజవీరులేయు దారుణదివ్యాస్త్ర
దళితదేహులగుచుఁ దలలువీడ
నోడి పాఱి రద్భుతోపేతబలులైన
[1]త్రిదశవరులు బిట్టు దిట్టినట్లు. 274

క॥ ఒక మొగముగాక దివిజులు
తికమకగొని వైరులెల్ల [2]ఢీకొనఁదమ్ముం
బికపికలై నకనకలై,
లుకలుకఁ బరువెత్తి రోడిఁ లోకానుభీతిన్. 275

చ॥ దనుజులగర్వరేఖయును దానవవీరుల[3]యంపజోకయుఁ
మనుజవిశేషభోజనుల మచ్చరికంబు నిశాటకోటి గే
చినబలశౌర్యముం దమకు సిగ్గును హాని మహాభయంబు ని
ర్ఘృణతను జేయు [4]నుమ్మలికఁ గోల్తలకోర్వక పాఱి రార్తులై.

క॥ అమరులు విస్పృష్టదానవ
సమరులు [5]శరభిన్నదేహసంతాపగుణ
భ్రమరులు [6]దైత్యకిరాతక
చమరులు కమలజునికడకుఁ జనిరి భయార్తిన్. 277

ఉ॥ ధాతకు దేవతావిభవ దాతకుఁ [7]బుణ్యజనానురాగసం
ధాతకు సర్వలోకహితదాతకు వేదికధర్మమార్గని
ర్ణేతకు నుల్లసద్విభవ నేతకు [8]సర్వజగజ్జయాంగజ
భ్రాతకుఁ బుణ్యయోగిజన భావవిధాతకు మ్రొక్కి రయ్యెడన్.

క॥ ఆఖండలుండు మొదలుగ
[9]లేఖానీకముల బ్రహ్మ లేనగవున ని

---

1 దేవతలు, 2 ఢీకొనఁగా (ఎదిరింపఁగా) 3 అంపజోక=బాణముల సమూహము, 4 సంతాపముచే, 5 బాణముచేఁ జీలిన శరీరములందలి తాపగుణముచే కలఁత పడినవారు, 6 రాక్షసులనెడికి రాతులచేఁబడిన చమరీమృగములవంటివారు. 7 పుణ్యజన = రాక్షసులయెడ, అనురాగమును సమకూర్చినవాఁడు. 8 సర్వలోకములం గెలుచు మన్మథుని తమ్మునికి, 9 దేవసమూహములను.

· త్యాఖండసత్కృపారస
శేఖరవాక్యముల వారి సేదలు దేర్చెన్. 279

వ॥ ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖు లయిన దేవతల కనుకంపా తిశయవిభవంబున నభయం బొసంగి యిట్లనియె. 280

ఉ॥ నెట్టన పాపకర్మమున నేరమిఁ జేసితి రేమి సెప్ప, మీ
పుట్టిననాఁటనుండియును బుద్ధులు సెప్పి జగంబు లేలఁగాఁ
బట్టముఁ గట్టి పెంచినకృపానిధి [1]బ్రహ్మకళావిధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాతి [2]సిరి వట్టునఁ [3]దొట్టినపొట్ట[4]క్రొవ్వనన్ 281

వ॥ బ్రహ్మిష్ఠుం డైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురుద్రోహం బుసేసితిరి. తద్దోషం బిపుడు మీకుఁ జేసేత శత్రుకృతంబై యను భవింపం జేసె. అతిబలవంతుం లయినమిమ్ము నతిక్షీణులైన యా రాక్షసులు జయించుట దమయాచార్యుం డైనశుక్రు నారాధించి తన్మంత్రప్రభావంబునఁబునర్లబ్ధవీర్యులై యిప్పుడుమదీయంబైననిల యంబు నాక్రమింపంగలవారునై మదోద్రేకంబున నెదురు లేక వర్తిల్లు చున్నరక్షోనాయకులకుం ద్రిదివంబుఁ గొనుట తృణప్రా యంబు. అభేద్యమంత్రబలంబుగలభార్గవునకు వారు శిష్యులగుటం జేసి విప్రగోవిందగణేశ్వరానుగ్రహంబు గలవారలకుఁ దక్కం దక్కిన రాజుల కరిష్టం బగుంగావున మీరిప్పుడు త్వష్ట యనుమును పుత్రుం డగువిశ్వరూపుం డనుముని నిశ్చలతపోమహత్త్వసత్త్వ స్వభావుం, డతని నారాధించిన మీకు నభీష్టార్థంబుల నతండు సంఘటిల్లఁ జేయును. ఇట్టిదుర్దశల నతం డడంచు నని చెప్పిన దిక్పాలకాదులు దండంబులు డిందుపడి కమలగర్భుని వీడ్కొని విశ్వరూపుకడకుం జని యిట్లనిరి. 282

తే॥ అన్న! మే లగునీకు ని న్నడుగఁ గోరి
వచ్చినారము భవదీయ వనమునకును

1 బ్రహ్మవిద్యా విధానము నెఱింగినవానిని (బృహస్పతిని) 2 ఐశ్వర్య స్థాన ముచే, 3 నిండిన, 4 ఆహారమువలనఁ గలిగినమదము.

దంద్రులకు నేఁడు సమయోచి తంబులైన
కోర్కు లొడఁగూడఁ జేసి చేకొనుము యశము. 283

క॥ సుతులకుఁ బితృశుశ్రూషణ
మతిపుణ్యము సేయుచుండు నాత్మజులు గుణో
న్నతి బ్రహ్మచారులైనను
మఱిలో గురుసేవకన్న మఱియుం గలదే. 284

వ॥ అదియునుం గాక. 285

సీ॥ అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు,
దండ్రి దలంపఁగ ధాతరూపు,
రూపింప భ్రాత మరుత్పతిరూపంబు,
దెలియంగఁ దల్లి భూదేవిరూపు,
[1]భగిని కరుణరూపు పరికింప ధర్మస్వ
రూపంబు దా [2]నర్థి రూపు మొదల
నభ్యాగతుఁడు మున్న యగ్ని దేవునిరూపు,
సర్వభూతములుఁ [3]గే శవునిరూపు,

ఆ॥ గాన తండ్రి! వేగ కడు నార్తులగుపితృ
జనుల మైనమమ్ముఁ జల్లఁ జూచి
పరభయంబు వాపి నిరుపమం బగు తపో
మహిమచేత మెఱసి మనుపవయ్య. 286

వ॥ ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండ వైన నిన్నాచార్యునింగా వరియించి భవదీయ తేజోవిశేషంబుచేత వైరివీరులం బరిమార్చెదము. ఆత్మీయార్థం బయిన యుష్మత్పాదాభివందనంబు నిందితంబుగాదని వేదవాక్యంబు గలదు; గావున నీకు నమస్కరించుచున్న దేవతలం గైకొని పౌరోహిత్యంబుసేయు మనినం బ్రహసిత వదనుండై యమ్మునీశ్వరుం డిట్లనియె. 287

---

1 సోదరి, 2 అతిథి, 3 ఇచట, కేశవశబ్ద మాత్మపర్యాయ మనవలెను. "అగ్నిరభ్యాగతో మూర్తి స్సర్వభూతానిచాత్మనః" అని మూలము.

తే॥ బ్రహ్మతేజంబు గోరెడి ప్రార్థనంబు
ధర్మగుణగర్హితంబని తా నెఱింగి
సొరిది ననుబోఁటితపసియీ సురలచేతఁ
బ్రకటమధురోక్తి నేఁటికిఁ బలుకఁ బడియె. 288

వ॥ విశేషించి. 289

క॥ గురుధనముఁ గూర్పనేటికి
గురుశిక్షం దగిలి మంత్రకోవిదులై స
ద్గురుధర్మనిరతులేనిక
గురువులకును శిష్యవరులై కూర్చినధనముల్ 290

సీ॥ అరయ [1]నకించనులైనట్టివారికిఁ
దగు [2]శిలోంఛనవృత్తి ధనము సుమ్ము;
దానిచే నిర్వర్తితప్రియసాధుస
త్క్రియగలవారలై ప్రీతినొంది;
రది గాన సద్గర్హితాచారమైనయా
చార్యత్వ మిపుడు మీ శాసనమునఁ
గైకొంటి, గురువుల కామంబు [3]ప్రాణార్థ
వంచనములు లేక వడి నొనర్తు;

ఆ॥ ననుచు విశ్వరూపుఁ డనియెడుముని ప్రతి
జ్ఞోక్తిఁ బలికె వారి నూఱడించి
మహితమైనతత్సమాధిచే గురుభావ
మమరఁ జేసె దేవ సమితి కపుడు. 291

క॥ భార్గవవిద్యాగుప్త
స్వర్గశ్రీద్విగుణదనుజసమధికసంప

---

1 నిరుపేదలు, 2 శిల + ఉంఛన, వృత్తి శిల = దంచినచోట రాలిన గింజలేరి తినుట. ఉంఛన = కళ్ళములో రాలిన గింజల నేరికొనితిని బ్రతుకుట, 3 ప్రాణమును, ధనమును గూడ దాఁచికొనక ప్రాణధనము లర్పించియైన గురుకార్యము చక్కఁబెట్టెద ననుట.

ద్వర్గముల విష్ణుమాయా
నర్గళగతిఁ దెచ్చి యింద్రునకునిచ్చె నృపా! 292

క॥ ఏవిద్యచేత రక్షితుఁ
డై వజ్రి దురంబులోన నసురులఁ ద్రుంచెన్
భావింప నట్టివిద్యను
శ్రీవరమాయామతంబుఁ జెప్పెనుహరికిన్. 293

## అధ్యాయము ౮

ఉ॥ నావుడు పాండవాన్వయుఁడు నమ్మినభక్తి జగన్నివాసు రా
జీవదళాక్షుఁ గృష్ణుఁ దన చిత్తమునన్ భజియించి పల్కె నో
దేవగణార్చితాంఘ్రియుగ! దివ్యమునీశ్వర! విశ్వరూపుఁ డ
ప్పావన మైనవిద్య సుర పాలున కేక్రియ నిచ్చెఁ జెప్పవే. 294

ఉ॥ ఎందును రక్షితుండగుచు నింద్రుఁడు లీలయపోలె వైరిసే
నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపఁగ నిష్టసంపదం
జెంది సమస్తలోకములఁ జేకొని యేలె మునీంద్ర! దాని నే
వింద సుఖంబుఁ గందు నిఁక వీనులు సంతసమందఁ బల్కవే.

### శ్రీమన్నారాయణ కవచప్రారంభము

క॥ వరనారాయణ కవచము
నరిభీకరవజ్రకవచ [1]మాశ్రితసంప
త్పరిణామ కర్మకవచము
పురుహూతున కెట్లుహరి బోధించెదగన్. 296

వ॥ అనినం బరీక్షిజ్జనపాలునకు మునినాథుం డిట్లనియె. 297

1 ఆశ్రిత = ఆశ్రయించిన వారికి, సంపత్ = సంపదలయొక్క, పరిణామ = పరిణమింపఁజేయుట, కర్మక=కర్మముగాఁగల, వచనము=మాటలుకలది, అనఁగా నాశ్రయించిన భక్తులకైశ్వర్య పరిణామమును గలిగింపఁగల శబ్దములు కలది యనియర్థము.

సీ॥ వినవయ్య నరనాథ! మునినాథుఁ డింద్రున
కను వొంద నారాయణాఖ్యమైన
కవచంబు విజయసంకల్పంబు నప్రమే
యస్వరూపంబు మహాఫలంబు
మంత్రగోప్యము హరి మాయావిశేషంబు
*సాంగంబుగాఁగ నెఱుంగఁజేసె
దానినే వినిపింతుఁ బూని తదేకాగ్ర
చిత్తంబుతోడుతఁ జిత్తగింపు

తే॥ మొనర ధౌతాంఘ్రిపాణియై యుత్తరంబు
ముఖముగానుత్తమాసనమునవసించి
కృతనిజాంగకరన్యాస మతిశయిల్ల
మహితనారాయణాఖ్యవర్మము నొనర్చె. 298

వ॥ ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను జానువులను నూరువులను నుదరంబునను హృదయంబునను నురంబునను ముఖంబునను శిరంబునను నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకంబైన యష్టాక్షరీమంత్రరాజంబువిన్యాసంబుసేసి ద్వాదశాక్షరవిద్యచేతం గరన్యాసంబుసేసి మంత్రమూర్తియై భగవచ్ఛబ్దవాచ్యంబైన ప్రణవాదియకారాంత మహామంత్రంబుచేత నంగుళ్యంగుష్ఠపర్వసంధులయం దుపన్యసించి, మఱియు హృదయంబున నోంకారంబు, వికారంబు మూర్ధంబున, షకారంబు భ్రూమధ్యంబునందు ణకారంబు శిఖయందు, వేకారంబు నేత్రంబులయందు, నకారంబు సర్వసంధులయందు, మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు, నుపన్యసించెనేని మంత్రమూర్తియగు. మఱియును నస్త్రాయఘట్టను మంత్రంబున దిగ్బంధనంబు సేసి పరమేశ్వరునిం దనభావంబున నిల్పి విద్యామూర్తియుఁ దపోమూర్తియు నగు షట్ఛక్తిసంయుతం

*సాంగంబుతోడ నెఱుంగఁజేసె—అని పాఠాంతరము.

బయిన నారాయణకవచాఖ్యంబైన మంత్రరాజంబు నిట్లని పఠియించె. 299

చ॥ గరుడునిమూఁపుపై బదయుగంబు ఘటిల్లఁగ శంకచక్రవ
ర్మరుచిరశార్ఙ్గఖడ్గశరరాజితపాశగదాదిసాధనో
త్కరనికరంబు లాత్మకరకంజములన్ ధరియించి [1]భూతిసం
భరితమహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్.

ఆ॥ ప్రకటమకరవరుణపాశంబులందును
జలములందు నొందుఁ బొలియకుండఁ
గాచుఁ గాక నన్ను ఘనుఁ డొక్కఁ డైనట్టి
మత్స్యమూర్తివిద్యమానకీర్తి. 301

క॥ పటుఁడు సమాశ్రితమాయా
నటుఁడు [2]బలిప్రబలశోభన ప్రతిఘటనో
ద్భటుడు త్రివిక్రమదేవుఁడు
[3]చటులస్థలమందు నన్ను సంరక్షించున్. 302

చ॥ అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం
దెడరుల నెల్ల నాకు నుతి కెక్కఁగ దిక్కగుఁ గాక శ్రీనృసిం
హుఁడు సురశత్రుయూథపవధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ
క్త్రుఁడు ఘనదంష్ట్రపావకవిధూతదిగంతరుఁ డప్రమేయుఁడై.

చ॥ అరయఁగ నెల్లలోకములు [4]వంకిలి నొంద మహార్ణవంబులో
నొరగి నిమగ్నమైనధర నుద్ధతిఁ గొమ్మున నెత్తి నట్టియా

---

1 అణిమాది విభూతులనెనిమిదింటిని, ఎనిమిది చేతులందును భరించువాఁడు, 2 బలియొక్క, ప్రబల = అత్యధికమైన, శోభన = శుభములయొక్క, ప్రతిఘటన = ఎదుర్కొనుటయందు, ఉద్భటుఁడు = గట్టివాఁడు, బలియొక్క శుభముల నడ్డగించిన వాఁడనుట, 3 చటులస్థలమందున్ = చంచలమైనచోట, ఒడుదుడుకు స్థలమునందనుట, కష్టకాలము లందని భావము, 4 కలఁత, ఆపద.

కిరిపతి యగ్నికల్పుఁ [1]దురదక్షేలుఁడు నూర్జిత మేదినీమనో
హరుఁడు గృపావిధేయుఁడు [2]సదాధ్వముల నన్నుఁ గాచుఁ గావుతన్.

క॥ రాముఁడు [3]రాజకులైకవి
రాముఁడు భృగుసత్కులాభి రాముఁడు సుగుణ
స్తోముఁడు నను రక్షించును
శ్రీమహితోన్నతుఁడు నద్రిశిఖరములందున్. 305

సీ॥ తాటక మర్దించి తపసిజన్నముఁ గాచి
హరువిల్లు విఱిచి ధైర్యమున మెఱసి
ప్రబలులై నట్టివిరాధకబంధోగ్ర
ఖరదూషణాదిరాక్షసులఁ దునిమి
వానరవిభు నేలి వాలిఁ గూలఁగ నేసి
జలరాశిగర్వంబుఁ జక్కఁజేసి
సేతువు బంధించి చేరి రావణుకుంభ
కర్ణాదివీరులఁ గడిమిఁ ద్రుంచి

తే॥ యలవిభీషణు లంకకు నధిపుఁ జేసి
భూమిసుతఁ గూడి సాకేత పురమునందు
రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు
వరుస నన్నుఁ బ్రోచు చుండుఁ బ్రవాసగతుల. 306

వ॥ మఱియు నఖిల ప్రమాదంబులైన[4]యభిచారకర్మంబులవలన నారా
యణుండును, గర్వంబువలన నరుండును, యోగభ్రంశంబువలన
యోగనాథుండయిన దత్తాత్రేయుండును గర్మబంధంబుల వలన
గణేశుండై నకపిలుండును, గామదేవునివలన సనత్కుమారుండును
మార్గంబుల దేవహేళనంబు సేయుటవలన శ్రీహయగ్రీవమూర్తి
యును, దేవతానమస్కారతిరస్కారదేవపూజాచ్ఛిద్రంబులవలన

1 గొప్ప యాటగాఁడు, 2 సదా + అధ్వములన్ = దారులయందు, 3 రాజ సమూహమునకు, ముఖ్యమైన నాశకుఁడు. 4 మంత్రతంత్రాదులచే జరిపించు హింసలు.

నారదుండును, [1]నశేషనిరయంబులవలనఁ గూర్మంబును, నపథ్యంబు
వలన భగవంతుండైన ధన్వంతరియును, జనాపవాదంబువలన నగ్ని
దేవుండును, జననమరణాదులం గలుగఁ జేయుకర్మంబులవలన
బలభద్రుండును, గాలంబువలన యముండును, సర్పగణంబుల
వలన శేషుండును, నప్రబోధంబువలన ద్వైపాయనుండును,
పాషండసమూహంబువలన బుద్ధదేవుండును శనైశ్చరునివలనఁ
గల్కియునై ధర్మరక్షణపరుం డయిన మహావతారుండు నన్ను
రక్షించుం గాతఁ బ్రాహ్ణమధ్యాహ్నపరాహ్ణసాయంకాలంబులను
బ్రదోషార్ధరాత్రాపరరాత్రప్రత్యూషానుసంధ్యలను గదాద్యాయు
ధంబుల ధరియించి కేశవనారాయణగోవింద విష్ణుమధుసంహార
త్రివిక్రమ వామన హృషీకేశ పద్మనాభ శ్రీవత్సధామ సర్వేశ్వ
రేశ జనార్దన విశ్వేశ్వర కాలమూర్తు లనునామరూపంబులు గల
దేవుండు నన్ను రక్షించుంగాక. ప్రళయకాలానలాతితీక్ష్ణ సంభ్రమ
భ్రమణనిర్వక్రవిక్రమవక్రీకృతదనుజచక్రం బైనసుదర్శననామ
చక్రంబ! మహావాయుప్రేరితుండై హుతాశనుండు నీరసతృణా
టవుల భస్మీభూతంబు సేయుభంగి భగవత్ప్రయుక్తంబవై మద్వైరి
సైన్యంబుల దగ్ధంబు గావింపుము. జగత్సంహారకాలపటుఘటిత
చటులమహోత్పాతగర్జారవతర్జనదశదిశాభివర్జిత [2]ఘనాఘనాం
తరనిష్ఠ్యూతనిష్ఠురకోటి [3]శతకోటిసంస్పర్శస్ఫురద్విస్ఫులింగనిర్గ
మానానర్గళభుగభుగాయమానమూర్తివిస్ఫూర్తి నారాయణకర
కమలవర్తి గదాయుధోత్తమ! మదీయవైరిదండోపదండంబుల
ఖండనంబునం జండగతిం బిండిపిండిగాఁ గూష్మాండవైనాయక
రక్షోభూతగ్రహంబులు చూర్ణంబులుగాఁ గొండొకవినోదంబు
సలుపుము. ఉదరేంద్రంబవైన పాంచజన్యంబ! సర్వలోకజిష్ణుం
డైన శ్రీకృష్ణునిఁ నిఖిలపుణ్యైకసదన వదననిష్ఠ్యూతనిశ్వా[4]సాధర

---

1 సర్వనరకములనుండియు, 2 ఘనాఘన = మేఘములయొక్క, 3 శతకోటి = వజ్రాయుధము (పిడుగులు), 4 అధరవేణు = అధరమనెడి వేణువుచే, పూరింపఁబడినదానవై, వెదురుగొట్టముచే నగ్నినూఁదుట ప్రసిద్ధము.

వేణుపరిపూరితంబవై యున్మత్తభూతప్రేతపిశాచవిప్రగ్రహాది క్రూరదుర్గ్రహంబులు [1]విద్రావణంబులుగా నస్మత్పరవీరమండలంబుల గుండియలతోఁ దదీయమానినీదుర్భరగర్భంబులు గర్భస్థార్భకవివర్జితంబులుగా నవియ, బ్రహ్మాండభాండభీకరంబయినభూరినాదంబున మోదింపుము. అతితీవ్రధారాదళితనిశాత కోటికఠోరకంఠకరాళిక ధారాఘాతమలీమసవిసరంబవయిన నందకమహాసిశేఖరంబ! జగదీశప్రేరితంబవై మద్విద్విషమవ్యూహంబుల మొండుఖండములుగ ఖండించి చెండాడుము. నిష్కళంక నిరాతంక సాంద్రచంద్రమండలపరిమండితసర్వాంగ లక్షణవిచక్షణధర్మనిరతంబ వయినచర్మంబ! దుర్మదమద్వైరిలోకంబులకు సమాకులనిబిడనీరంధ్రనిస్తురతమఃపటలపటుఘటనంబులం గుటిలపఱుపుము. నిఖిలపాపగ్రహంబులవలనను సకలమృగసర్ప [2]క్రోడభూతాదులవలనను నగుభయంబులు వొందకుండ [3]భగవన్నామరూప యానదివ్యాస్త్రంబులు రక్షించుంగాక. బృహద్రథంతరాదిసామంబులచేత స్తోత్రంబు సేయంబడుచున్న ఖగేంద్రుండు రక్షణదక్షుండై నన్ను రక్షించుఁగాక. [4]శ్రీహరినామరూపవాహనదివ్యాయుధ[5]పారిషదోత్తమప్రముఖంబు లస్మదీయ బుద్ధీంద్రియమనఃప్రాణంబుల సంరక్షించు భగవంతుం డయిన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు సేయు. జగదైక్యభావంబయినధ్యానంబు గలవానికి వికల్పరహితుండై భూషణాయుధలింగాఖ్య లగు శక్తులం దనమాయచేత ధరియించి తేజరిల్లుచుండు. లక్ష్మీకాంతుండు వికల్పవిగ్రహంబువలన నన్ను రక్షించుఁగాక. లోకభయంకరాట్టహాసభాసురవదనగహ్వరుం డగుచు సమస్తతేజోహరణధురీణతేజఃపుంజసంజాతదివ్యనృసింహావతారుం

---

1 పరువులెత్తిపోవునవిగా, 2 కత్తియోఱలుఁ గల గర్మమునుగూర్చిన పిలుపు, 3 క్రోడ = పందులు, 4 భగవంతుని పేరులు, రూపములు, వాహనములు, దివ్యాస్త్రములు, 5 పారిషద + ఉత్తమ = పరివారోత్తములు, "పార్షదభూషణాః" అని మూలము.

డగు నప్పరమేశ్వరుండు సర్వదిగ్భాగంబులవలన నన్ను రక్షించు చుండుఁ గాత మని నారాయణాత్మకకవచప్రభావం బితిహాస రూపంబున నింద్రుండు దెలిసికొని ధ్యానంబుసేసి తద్విద్యాధారణ మహిమవలన నరాతులనిర్జించెం గావున నెవ్వరేని నిర్మలాత్ము లగువార లేతద్విద్యాధారణులై యనుదినంబును బఠియించిన నతిఘోరరణంబుల నత్యుత్కటసంకటంబులను సర్వగ్రహనిగ్రహ కర్మమారణకర్మాదిదుష్కర్మజన్యక్లేశంబులను వదలి యవ్యాకుల మనస్కులై విజయంబు నొందుదురు. మఱియును సర్వరోగం బులకు నగమ్యశరీరులై సుఖంబు నొందుదు రదియునుం గాక. 307

సీ॥ అతిభక్తిఁ గౌశికుండను బ్రాహ్మణుఁడు దొల్లి
యీవిద్య ధరియించి యెలమి మించి
[1]మరుభూమియందు నిర్మలచిత్తుఁడై యోగ
ధారణంబున బిట్టు తనువు విడిచె;
దానిపై నొకఁడు గంధర్వవరేణ్యుండు
చిత్రరథాఖ్యుఁ డజేయుఁ డొంటి
[2]చదలఁ జనంగఁ దచ్ఛాయతదస్థిపైఁ
గదిసిన నాతఁడు గళవళించి

ఆ॥ [3]యువిదపిండుతోడ నవవిమానముతోడఁ
దనదువిద్యతోడ ధరణిఁ ద్రెళ్లి
తిరిగి లేవలేక తికమక గుడువంగ
వాలఖిల్యమౌని వానిఁ జూచి. 308

క॥ నారాయణకవచసమా
ధారణపుణ్యాస్థి దీని దగ్గఱ నీకుం
గూరెడిని విష్ణుభక్తుల
వారక చేరంగ నెట్టివారికిఁ దరమే. 309

1 మరుభూమి = నీరులేని ప్రదేశమున, 2 ఆకాశము, 3 స్త్రీసంఘము.

ఇంద్రవజ్రము॥ సంధించి నీయంగకసంధు లెల్లన్
బంధించి తన్మంత్రబలంబుపేర్మి
న్నందంబు మాన్పింపఁ దదన్యమేదీ
సింధుప్రవాహోన్నతిచేతఁ దీరున్. 310

వ॥ కావున నీపుణ్యాశల్యంబులు భక్తియుక్తుండవై కొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రవహించెడుసరస్వతీజలంబుల నిక్షేపణంబుసేసి కృతస్నానుండవై యాచమనంబుసేసిన నీసర్వాంగబంధనంబు లుడుగు ననిన నతం డట్లచేసి తనవిమానం బెక్కి నిజస్థానంబున కరిగెఁ గావున. 311

క॥ అనుదినము దీని నెవ్వరు
విని రేనిఁ బఠించి రేని విస్మయ మొదవన్
ఘనభూతజాల మెల్లను
మునుకొని వారలను గాంచి మ్రొక్కుచు నుండున్. 312

ఆ॥ విశ్వరూపువలన నైశ్వర్యకర మైన
యిట్టివిద్యఁ దాల్చి యింద్రుఁ డపుడు
మూఁడులోకములకు ముఖ్యు మైనట్టిశ్రీ
ననుభవించి మించె నధికమహిమ. 313

## అధ్యాయము ౯.

సీ॥ భూపాల! యావిశ్వరూపున కరుదైన
తలలు మూఁడనువొందఁ గలిగి యుండు
నొరిది సురాపానసోమపానంబులు
[1]నన్నాదమనఁగను నమరవరుల
తోఁ గూడి భుజియించి [2]తూకొని వారితో
యజ్ఞభాగంబు ప్రత్యక్ష మొంది
కైకొనుచుండి దుష్కర్ముఁడై యాయజ్ఞ
భాగంబు రాక్షస ప్రవరులకును

1 అన్నాదము=అన్నమును దినునది యనియర్థము, 2 చొచ్చి (లేదా పూని)

ఆ॥ దల్లిమీఁద గలుగు తాత్పర్యవశమున
దివిజవరుల [1]మొఱఁగి తెచ్చి యిచ్చె
నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁడై
తనకుఁ గానియతని తలలు ద్రుంచె. 314

క॥ భాసురుఁ డనక మహాత్మా
గ్రేసరుఁ డన కతఁడు పూర్వ కృతకర్మగతిన్
[2]వేసరుఁ డనక మహేంద్రుఁడు
భూసురుతల లవుడు రోషమునఁ దెగ నడిచెన్. 315

వ॥ ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపం జాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగనడచిన సోమపానంబుసేయుశిరంబు [3]గపింజలం బయ్యె. సురాపానంబు సేయుశిరంబు [4]గలవింకం బయ్యె. అన్నంబు భక్షించుశిరంబు [5]తిత్తిరి యయ్యె. ఇట్లు త్రివిధపక్షిస్వరూపంబు దాల్చి బ్రహ్మహత్య యేతెంచి యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపు మని నిర్బంధింప నపు డింద్రుం డతిభీతచిత్తుండై త్రిలోకనాయకుం డైనన్ దానిం దప్పించుకొనం జాలక యంజలి యొగ్గి యమ్మహాదోషంబుఁ గైకొని తద్దోషం బొక్క సంవత్సరం బనుభవించి యంతం బాపుకొనువాఁడై భూజలవృక్ష స్త్రీలం బ్రార్థించి మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చికొనుండనిన భూమి తనయందుఁ జేయంబడిన[6]ఖాతంబు తనంతన పూఁడునట్టి వరం బును, జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితంబైనం బావనం బగునట్టి వరంబును, వృక్షంబులు ఛేదింపంబడి పునఃప్రరోహంబు గలుగు వరంబును, స్త్రీ లెల్లపుడుం దమకుఁ గామసుఖంబు గలుగునట్టి వరంబును గోరిన నతం డట్ల కా నొసంగిన నతని దుష్కృతంబు ధరణి నెఱియ లూషరక్షేత్రంబుల విధంబునను, నుదకంబు బుద్బుద ఫేనరూపంబునను, మహీరుహంబులు [7]నిర్యాస

---

1 మోసగించి (కప్పిపుచ్చి), 2 వేసరుఁడు + అనక = కష్టపడుఁడుఅనక, 3 కముజుపిట్ట, 4 కాఁకటిసూఁగయను పక్షి (ఊరపిచ్చుక యనియు), 5 తీతువు, 6 గోయి, 7 జిగురుగను.

భావంబునను, నింతులు రజోవికారంబునను, నిట్లు చతుర్భాగంబులం బంచికొనిరి. అంత. 316

మ॥ హతపుత్రుం డగువిశ్వరూపజనకుం డాత్వష్ట దుఃఖాయతో
ద్ధతరోషానలదహ్యమానుఁ డగుచుం దా నింద్రు పై మారణ
క్రతుహోమం బొనరింప నందుఁ బొడమెం గల్పాంతకాళారవి
శ్రుత[1]కీలానలనిష్ఠురేక్షణగుణక్షుభ్యత్త్రిలోకోగ్రుఁ డై. 317

సీ॥ యుగముద్రుంగెడునాఁడు జగములువొలియించు
నంతకుమూర్తిపై నింతయగుచుఁ
[2]పఱపును బొడువును ప్రతిదినంబును నొక్క
[3]శరపాత మంగంబు విరివిగొనుచుఁ
గడుదగ్ధశైలసంకాశదేహమునందుఁ
గరము సంధ్యారాగకాంతి బెరయ
మునుగాఁక[4]రాగిచేఁ గనుమించు[5]మించులఁ
గఱకుమీసలు కచాగ్రములు మెఱయఁ

తే॥ జంఘామధ్యాహ్నమార్తాండమండలోగ్ర
చటులనిష్ఠురలోచనాంచలవిధూత
దశదిశాభాగుఁ డుజ్జ్వలతరకరాళ
భిదురసునిశితదంష్ట్రోరువదనగుహుఁడు. 318

ఉ॥ నింగికి నేలకుం బొడవు *నిచ్చలమై శిఖలందుఁ బర్వను
త్తుంగతరాగ్నిజాలములఁ దొట్రిలుచుం గ్రహపంక్తి జాఱ ని
స్సంగకరాళ [6]శాతఘనసద్ఘృణిమండలచండశూల ము
ప్పొంగుచుఁ గేల లీలఁ గొని భూమి చలింపఁగ సోలియాడుచున్.

---

*నిట్టలమై —అని పాఠాంతరము.

1 కీలా = మంటలుగల, 2 వెడల్పు, 3 శరపాతము = బాణము విసరిన నెంత మేరలోపడునో అంత మేర, 4 కౌన రాగియొక్క సారముచే, (రాగివన్నెయని యర్థము), 5 మించుల౯ = కాంతులచేత, 6 పదునైనది.

సీ॥ *వదలక విరివిగా వదనంబుఁ దెఱచుచు
నాకాశ మంతయు నప్పళించుఁ
గడనాల్క నిగిడించి గ్రహతారకంబుల
నయ మెల్ల దిగజాఱ నాకి విడుచు
నలవోకయును బోలె నట్టహాసము సేసి
మెఱసి లోకము లెల్ల మ్రింగఁ జూచుఁ
దనరు దిగ్దంతి దంతములు సెక్కులు వాఱ
నుగ్రదంష్ట్రలు ద్రిప్ప నుక్కు మిగిలి

తే॥ త్వష్టబలితంపుఁదపమునఁ బుట్టి నొంది
యఖిలలోకంబు లెల్లఁ దా నాక్రమించి
వృత్రనాముండు దేవతా శత్రుఁ డగుచు
దారుణాకారుఁ డఖిలదుష్టముఁడు మెఱసె. 320

మత్తకోకిలము॥ అట్టివృత్రునిమీఁద దేవత లల్కతోఁ జెనుమూఁకలై
చుట్టి ముట్టి మహాస్త్రవిద్యలు సూపి యేపున నేయ నా
గొట్టువీరుఁడు వార లేసిన క్రూరశస్త్రము లన్నియుం
జుట్టి పట్టుక మ్రింగి శూరత జోకనార్చె మహోగ్రుఁడై. 321

క॥ భక్షితదివ్యాస్త్రుం డగు
రక్షోనాయకుని నమరరాజప్రముఖుల్
వీక్షింప వెఱచి పఱచిరి
రక్షకుఁ జింతించుకొనుచు రయమొప్పారన్. 322

వ॥ ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబు వృత్రాసురుండు మ్రింగిన నచ్చెరువడి చేయునది లేక తత్తేజోవిశేషవిభవంబునకు భయంబునొంది కందినడెందంబునం గుందుచుం బురందరప్రముఖు లార్తరక్షకుండగు పుండరీకాక్షునకుం గుయ్యిడువారలై. 323

లయగ్రాహి. వీఁడు కడు దుర్దముఁడు వాఁడిమనకై దువ్వులు
వాఁడి చెడఁగా మెసవి యీడుగన కున్నాఁ

*పదపడి—అని పాఠాంతరము.

డేఁడ బ్రదుకింకఁ బెనుఁగీడు పొడమెన్ మనకుఁ
దోడుపడ నొక్కరుఁడు లేఁడు హరి దక్కన్.
వేఁడుదము శ్రీధరునిఁ గూడుదము సద్భటులఁ
బాడుదము గీతముల జాడపడు నంతన్
వీఁడు చెడుత్రోవ దయతోడ నెఱిఁగించు ఘనుఁ
డోడక సురాలయము పొడువఁడు దింకన్. 324

క॥ అని తలపోయుచుఁ దమలో
మునుకుచుఁ దికమకలు గొనుచు మురరిపుకడకున్
[1]గునుకుచుఁ [2]దినుకుచుఁ జేరి
ఘనరాక్షసుఁ గన్నకన్నుఁగవ బెగ్గిలఁగన్. 325

వ॥ ఇట్లు భయార్తులై యమభృత్యవ్రాతంబు సని చని ముందట
నభంగభంగరంగదుత్తుంగడిండీరమండలసముద్దండాడంబర
విడంబిత నారాయణనిరంతరకీర్తిలతాకుసుమగుచ్ఛస్వచ్ఛంబును,
ననవరతగోవిందచరణారవిందసేవాసమాకులకలకలఫలితమహా
పుణ్యఫలాయమానసముద్దీపితావర్తవర్తిత [3]దక్షిణావర్త
రుచిరశంఖమండలమండితంబును, నతినిష్ఠుర కఠినపాఠీనపృథురో
మరాజిసంకులతిమితిమింగిలకర్కటకమకరకచ్ఛపమకరనక్రవక్ర
గ్రాహగ్రాహణఘుమఘుమారావదారుణగమనవిషమితవిషమ
తరంగఘట్టనఘట్టితసముద్ధూతశీకరనికరనీరంధ్ర[4]తారకితతారాప
థంబును, మహోచ్ఛ్రయశిలోచ్చయశిఖరాగ్రప్రవహితదుగ్ధనిర్ఝర
సమ్మార్జితపురాణపురుషవిశుద్ధశుద్ధాంతవిహరణధురీణవసుధా
ధౌతధావళ్యధగద్ధగాయమానరమ్యహర్మ్యనిర్మాణకర్మంబును,
నతిపవిత్రగుణవిచిత్రనిజకళత్రప్రేమానందసందర్శితముకుంద
పరిస్రవదంతరంగకరుణారసపరిమిళితభావబంధురవిద్రుమవల్లీ
మతల్లికాంకురశోభితంబును, ప్రసిద్ధసిద్ధరసాంబువాహసంగమ

---

1 నిద్రచే తూలుచు (తూఁగుచు), 2 ఊపిరి బిగఁబట్టి ముక్కుచు, 3 కుడివంపు సుడిగల శంఖము, 4 నక్షత్రము గలదిగాఁ జేయఁబడినది.

సముత్థితగంభీరఘోషపరిదూషితసకలరోదోంతరాళంబును, సముద్రమేఖలాఖిలప్రదేశవిలసిత[1]నవీనదుకూలాయమానంబును, హరిహరప్రముఖదేవతానిచయపరిలబ్ధామృతమహైశ్వర్యదానధౌరేయమహానిధానంబును, వైకుంఠపురపౌరవరకామ్యఫల[2]ఫలితమందారపారిజాతసంతానకల్పవృక్షహరిచందనఘనవనానుకూలంబును నై యొప్పుచుఁ గుబేరభాండాగారంబునుం బోలెఁ బద్మమహాపద్మశంఖమకరకచ్ఛపముకుందకుందనీలవరసమగ్రంబై, విష్ణుకరకమలంబునుంబోలె సుదర్శనావర్తప్రగల్భంబై కైలాసమహీధరంబునుం బోలె నమృతకళాస్థానశేఖరపదార్పణంబై, యింద్రవైభవంబునుం బోలెఁ గల్పవృక్షకామధేనుచింతామణిజనితంబై, సుగ్రీవసైన్యంబునుంబోలె నపరిమితనిబిడహరిసంచారంబై, నారాయణోదరంబునుంబోలె నఖిలభువనభారభరణసమర్థంబై, శంకరుజటాజూటంబునుంబోలె గంగాతరంగిణీ సమాశ్రయంబై, బ్రహ్మలోకంబునుంబోలె బరమహంసకులసేవ్యంబై, పాతాళలోకంబునుం బోలె ననంతభోగభోగియోగ్యంబై, నందనవనంబునుం బోలె నైరావతమాధవీరంభాదిసంజననకారణంబై, సౌదామినీనికరంబునుంబోలె నభ్రంకషంబై, విష్ణునామకీర్తనంబునుంబోలె నిర్మలస్వభావంబై, [3]క్రతుశతగతుండునుంబోలె హరిపదభాజనంబై యొప్పుచున్న దుగ్ధవారాశిడాసి శ్వేతద్వీపంబున వసియించి యందు సకల దిక్పాలకాది దేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లని స్తుతియించిరి. అంత. 326

సీ॥ పంచమహాభూతపరినిర్మితంబైన
ముజ్జగంబుల కెల్ల నొజ్జయైన
బ్రహ్మయు నేమును బరఁగ నందఱుఁ గూడి
యెవ్వని కై పూజ లిత్తు మెపుడు,

1 క్రొత్త పట్టు వస్త్రమట్లున్నది, 2 ఫలిత = ఫలవంత మయిన, 3 నూరు యజ్ఞములను బొందినవాఁడు,

నట్టిసర్వేశ్వరుం డాగమవినుతుండు
సర్వాత్మకుఁడు మాకు శరణ మగును
అతిపూర్ణ కాము నహంకారదూరుని
సముని శాంతునిఁ గృపాస్పదుని గురుని

తే॥ మాని యన్యుని సేవింపఁబూనునట్టి
కపటశీలుని నతిపాపకర్మబుద్ధి
శునకవాలంబు పట్టుక ఘనతరాబ్ధి
దరియఁ జూచుట గాదె తాఁ దామసమున. 327

చ॥ ఉదకమయంబునన్ వసుధ నోడగఁజేసి తనర్చుకొమ్మునన్
వదలక యంటఁ గట్టి మనువల్లభుఁ గాచినమత్స్యమూర్తి స
న్మదమున మమ్ముఁబ్రోచు ననుమానమునూనఁగ వ్రత్రుచేటియా
పద దొలఁగించి నేఁడు సురపాలుర పాలిటిభాగ్యదైవమై. 328

మత్తకోకిలము॥ రంతుసేయుచు వాతధూతకరాళభంగురభంగదు
ర్దాంతసంతతసాగరోదకతల్ప మొంది వసించు బ
న్మంతవానిని బొడ్డుఁదమ్మిని నాఁచికాచినప్రోడ యిం
తంతవాఁ డనరానియొంటరి యాదరించు మముం గృపన్. 329

తే॥ దేవతల మైనమే మిట్టి దేవదేవు
సర్వలోకశరణ్యుని శరణు సొచ్చి
బలితమైనట్టిపీనియాపదలఁ బాసి
మీఁటి శుభములఁ జేకొనువార మిపుడు. 330

వ॥ ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైనవైకుం
ఠుండు ప్రసన్నుండయ్యె నప్పుడు. 331

సీ॥ తగుశంఖచక్రగదాధరుండగువానిఁ
శ్రీవత్సకౌస్తుభశ్రీలవానిఁ
గమనీయమాణిక్యఘనకిరీటమువాని
దివ్యవిభూషణదీప్తివాని

మండితకేయూరకుండలంబులవాని
సిరి యురస్స్థలమునఁ జెలఁగువానిఁ
దనుఁబోలు [1]సేవకదండంబు గలవానిఁ
జిలుఁగైనపచ్చని వలువవాని

ఆ॥ దెల్లదమ్మివిరులఁ దెగడుకన్నులవాని
నవసుధాద్రవంపు నవ్వువానిఁ
గనిమె వేల్పుపిండు [2]కప్పరపాటుతోఁ
గన్నులందు నున్న కఱవు దీఱ. 332

సీ॥ తనసేవకులలోనఁ దడఁబడురూపంబు
శ్రీవత్సకౌస్తుభశ్రీలఁ దెలుప
వికచాబ్జములతోడ వీడ్వడు కన్నుల
కడలు దైవాఱెడు కరుణఁ దెలుప
నెల్లలోకములకు నిల్లైనభాగ్యంబుఁ
గాఁపురం బుండెడుకమల దెలుప
మూఁడుమూర్తులకును మొదలైనతేజంబు
ధాతఁ బుట్టించినతమ్మి దెలుప

ఆ॥ బుద్ధిఁ బోల్పరాని పుణ్యంబుఁ దత్పాద
కమలజనితమైనగంగ దెలుప
నప్రమేయుఁ డభవు డవ్యక్తుఁ డవ్యయుఁ
డాదిపురుషుఁ డఖిలమోది యొప్పె. 333

వ॥ ఇట్లు జగన్మోహనాకారుం డయిననారాయణుని కృపావలోకనాహ్లాదస్వభావచరితులై సాష్టాంగదండప్రణామంబు లాచరించి ఫాలభాగపరికీలితకరకమలులై యిట్లనిరి. 334

ఆ॥ దుర్గమంబులయిన స్వర్గాదిఫలములఁ
బుట్టఁ జేయఁ జాలునట్టిగుణము

---

1 దండంబు = దండు, 2 తొట్రుపాటు.

గలిగి మెలఁగు చున్నఘనుఁడవై నట్టి నీ
కరయ మ్రొక్కువార మాదిపురుష! 335

సీ॥ దండంబు యోగీంద్రమండలనుతునకు
దండంబు శార్ఙ్గకోదండునకును
దండంబు మండితకుండలద్వయునకు
దండంబు నిష్ఠురఖండనునకు
దండంబు [1]మత్తవేదండరక్షకునకు
దండంబు రాక్షసఖండనునకు
దండంబు పూర్ణేందుమండలముఖునకు
దండంబు తేజఃప్రచండునకును

తే॥ దండ మద్భుతపుణ్యప్రధానునకును
దండ ముత్తమవైకుంఠధామునకును
దండ మాశ్రితరక్షణతత్పరునకు
దండ మురుభోగినాయక తల్పునకును. 336

ఉ॥ చిక్కిరి దేవతావరులు, చిందఱవందఱ లైరి ఖేచరుల్,
స్రుక్కిరి సాధ్యసంఘములు, సోలిరి పన్నగు, లాజిభూమిలోఁ,
గ్రక్కిరి దివ్యకోటి, గడు గ్రుగ్గిరి యక్షులు, వృత్రుచేత నీ
[2]చిక్కినవారి నైన దయసేయుము నొవ్వకయుండ నోహరీ! 337

క॥ మొదలాటినరక్కసులకు
మొదలై మాకాపదలకు మూలం బగుచుం
దుద మొదలు లేనిరక్కసు
తుది చూపఁ గదయ్య [3]తుదకుఁదుది యైనహరీ. 338

తే॥ అకట! దిక్కుల కెల్ల దిక్కైనమాకు
నొక్కదిక్కును లేదు కాలూఁద నైన

1 మదపుటేనుంగును రక్షించినవాఁడు, (గజేంద్రరక్షకుఁడు), 2 మిగిలిన వారిని, 3 పరాత్పరుఁడయిన వాఁడన్నమాట.

దిక్కు గావయ్య నేఁడు మాదిక్కుఁ జూచి
దిక్కు లేకున్నవారల దిక్కు నీవ. 339

క॥ నీదిక్కు గానివారికి
నేదిక్కును* లేదు వెదక నిహపరములకున్
మోదింపఁ దలఁచువారికి
నీదిక్కే దిక్కు సుమ్ము నీరజనాభా! 340

తే॥ అరయ మాతేజములతోడ నాయుధములు
మ్రింగి భువనత్రయంబును మ్రింగుచున్న
భీకరాకారు వృత్రునిఁ బీఁచ మడఁచి
యెల్లభంగుల [1]మాభంగ [2]మీఁగు మభవ. 341

ఆ॥ పరమపురుష! దుఃఖభంజన! పరమేశ!
భక్తవరద! కృష్ణ! భవవిదూర!
జలరుహాక్ష! నిన్ను శరణంబు వేఁడెద
మభయ మిచ్చి కావవయ్య! మమ్ము. 342

వ॥ మఱియును "భగవన్నారాయణ! వాసుదేవ! యాదిపురుష! మహానుభావ! పరమమంగళ! పరమకళ్యాణదేవ! పరమకారుణికు లయిన పరమహంస లగుపరివ్రాజకులచేత నాచరితంబు లగు పరమసమాధిభేదంబులఁ బరిస్ఫుటం బయిన [3]పరమహంసధర్మంబుచేత [4]నుద్ఘాటితంబగు తమఃకవాటద్వారంబు రసావృతం బయిన యాత్మలోకంబున నుపలబ్ధమాత్రుండవై నిజసుఖానుభవుండవై యున్న నీవాత్మసమవేతంబులై యుపేక్షింపఁబడని శరీరంబులకు నుత్పత్తిస్థితి లయకారణుండ వై యుండుదువు. గుణసర్గభావితుండవై యపరిమిత గుణగణంబులుగల నీవు దేవదత్తుని మాడ్కిఁ బారతంత్ర్యంబున సబ్భినకుశలఫలంబుల ననుభవించి

---

* వెదక నుండ దిహపరములకున్ — అని పాఠాంతరము.

1 మా పరాభవమును, 2 ఈఁగుము=తొలఁగించుము, 3 పరమహంస యను నొకరకపు సన్యాసి, వారిధర్మము ఆత్మానుసంధానము, 4 ప్రతిధ్వనించుచున్నది.

చింతింతువు. షడ్గుణైశ్వర్యసంపన్నుండవైన నీ వాత్మారాముండ వయి యుండుదువు. గుణసర్గభావితుండ వయి యపరిమిత గుణ గణంబు లర్వాచీనవితర్కవిచారప్రమాణభావంబులగు తర్క శాస్త్రంబులఁ గర్కశంబు లయిన ప్రజ్ఞలు గలిగి దురాగ్రహ వాదులైన విద్వాంసుల వివాదానుసరణంబులయందు [1]నుప రతంబు లగు [2]నస్తినాస్తీత్యాదివాక్యంబుల సమస్తమాయా మయుండ వై నిజమాయచేతఁ గానంబడక యుక్తిగోచరుండ వై సమస్తవిషయరూపంబులఁ బ్రవర్తింతువు. దేవా! రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు ద్రవ్యాంతరంబులచేత బ్రహ్మం బయిన నీయందుఁ బ్రపంచభ్రాంతి గలిగెడి'' నని యిట్లతిమనోహర చతుర వచనంబుల భక్తిపరవశులయి వినుతిసేయుచున్న దేవతలం జూచి యప్పరమేశ్వరుం డమృతప్రాయంబులగు గంభీరభాషణంబుల నిట్లనియె. 343

క॥ [3]మదుపస్థానం బగుమీ
సదమలసుజ్ఞానమునకు సంతోషమునం
బొదలెద మదిఁ బ్రీతినొందితి
వదలక నాభక్తిఁబోడమి వ్యర్థంబగునే. 344

వ॥ మఱియును బ్రీతుండ నైననాయందు భక్తులకుం బొందరాని య ర్థంబు లేదు. విశేషించి నాయందు [4]నేకాంతమతి యైనతత్త్వ విదుం డన్యంబులం గోరకుండు. గుణంబులయందుఁ దత్త్వజ్ఞాన గోచరుండై నవాఁడు విషయనివృత్తచిత్తుండై సంసారమార్గంబు నిచ్ఛింపండు. కావున మీకు శుభం బయ్యెడు. దధీచియను ఋషి సత్తముండు గలండు తనిశరీరంబు మద్విద్యాతిశయమహత్త్వంబునను దేజోవిశేషంబునను సారవంతంబై యున్నయది. అతని నడిగి తచ్ఛ రీరంబుఁ బుచ్చికొనుండు. అతండు పూర్వకాలంబున నశ్వశిరో

---

1 మరలినది, 2 ఉన్నదిలేదు అనెడి మాటలచేత (ఆత్మ), 3 నాదరిచేర్చునది. నాఅనుసంధానము కలది, 4 అనన్యమైన మనసుగలవాఁడు-నాయందే నిశ్చలమై యున్న మనస్సుకలవాఁడన్నమాట.

నామంబని బ్రహ్మస్వరూపంబగునిష్కళంకం బయినవిద్య యుపదేశించిన వారలు జీవన్ముక్తిత్వంబు నొందిరి. మఱియు త్వష్ట్రపుత్రుండయిన విశ్వరూపునకు మదాత్మకంబయినయభేద్యకవచంబు నిచ్చెఁగావున నతం[1]డతివదాన్యుండు. దేహంబు వంచింపక మీకిచ్చు. అతని శల్యంబులు విశ్వకర్మనిర్మితంబులై [2]శతధారలుగలయాయుధశ్రేష్ఠం బయి మత్తేజోపబృంహితంబయి వృత్రాసురశిరోహరణకారణంబయి యుండు. దానం జేసి మీరు పునర్లబ్ధతేజోస్త్రాయుధసంపదలు గలిగి వెలింగెదరు. విశేషించియు మద్భక్తవరు లయినవార లేలోకంబుల నెవ్వరికి నజయ్యులు కావున మీకు భద్రంబయ్యెడు మని భూతభావనుండైన భగవంతుం డదృశ్యుం డయ్యె. అప్పుడు దేవతలు దధీచిమునికడకుం జనిరి. అత్తఱి నింద్రుం డిట్లనియె.

అధ్యాయము ౧౦.

ఆ॥ దేహి సుఖము గోరి దేహంబుఘటియించి
దేహివిడువలేఁడు దేహ మెపుడు
[3]దేహి యస్మదీయ దేహంబుకొఱకునై
దేహ మీఁగదయ్య దేవతలకు. 346

ఉ॥ ఎక్కడ నెల్లలోకముల నెవ్వరు గోరనికోర్కి నేఁడు మా
[4]తెక్కలిపాటునన్ దివిరి దేహము వేఁడఁగ వచ్చినార మే
మెక్కడ? తీవ్రకర్మగతి యెక్కడ? దైవకృతంబు గాక యీ
రొక్కపుదాన మీవదుస [5]రోయక వేఁడుదురే జగంబులన్.

క॥ నీచగతి యెల్లభంగుల
యాచనయని తెలిసి తగని దడుగుదు రేనిన్
యాచకవర్గములోపల
[6]నీచకులనఁబడరె యెంతనేర్పరులైనన్. 348

1 గొప్పదాత, 2 నూఱుఅంచులుకలది (వజ్రము), 3 దేహి = ఇమ్ము (ఇది సంస్కృతక్రియ-యాచనార్థమున నిచట వాడబడినది అని తోఁచెడిని, 4 ఆపదచేత, 5 అసహ్యపడక, లేక విమర్శింపక, 6 అత్యంతనీచులు.

క॥ అడుగంగ రానివస్తువు
లడుగరు బలిమాలి యెట్టియర్థులు నిను నే
మడిగితిమి దేహమెల్లను
గడు నడిగెడువారి కేడ కరుణమహాత్మా! 349

ఉ॥ నాపుడు నాదధీచియు మనంబున సంతస మంది నవ్వి సం
భావితవాక్యపద్ధతులఁ బల్కుచు నిట్లనెఁ బేర్మితోడ నో
దేవతలార! ప్రాణులకుఁ దెక్కలిమృత్యుభయంబు పూనుచే
భావములం దలంపరు కృపామతి నెన్నఁడు మీమనంబులన్. 350

ఆ॥ ఎలమి బ్రదుక నిచ్చ నెనసినవారికి
దేహమెల్ల భంగిఁ దీపుగాదె
యచ్యుతుండు వచ్చి యర్థించె నేనిని
దన్ను నిచ్చునట్టి దాతగలఁడె. 351

వ॥ అదియునుం గాక. 352

సీ॥ అర్థంబు వేఁడెడు నర్థులు గలరు గా
కంగంబు వేఁడెడి యర్థి గలఁడె
తగుకోరికల నిచ్చుదానశీలుఁడు గల్గుఁ
దనదేహ మీనేర్చు దాత గలఁడె
యీ నేర్చువాఁడు దన్నిచ్చిన రోయక
చంపెడునట్టి యాచకుఁడు గలఁడె
చంపియుఁ బోవక శల్యంబు లన్నియు
నేఁటి పంచుకపోవువారు గలరె

ఆ॥ రమణ లోకమెల్ల రక్షించువారికి
హింససేయుబుద్ధి యెట్టు వొడమె
బ్రాతియైనయట్టి ప్రాణంబుపైఁ దీపు
తమకుఁబోలె నెవిరిఁ దలఁప వలదె. 353

వ॥ అనిన నింద్రుం డిట్లనియె. 354

తే॥ సర్వభూతదయాపరస్వాంతులకును
బుణ్యవర్తను లగుమిమ్ము బోఁటివారి
కమితసత్కీర్తికాముల కలఘుమతుల
కియ్యరానిపదార్థంబు లెవ్వి గలవు, 355

ఆ॥ అడుగరానిసొమ్ము నడుగరాదని మానఁ
డడుగువానిమాట లడుగనేల
భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు
నిచ్చువాఁడు దాతఁ డిచ్చుఁగాని. 356

వ॥ అని పరసంకటంబు దలంపక నిలింపులు గార్యపరతన్ సవినయ వాక్యపరంపరలఁ బ్రార్థించిన, నతండు దరహాసితవదనుండై యఖిలలోకధర్మం బెఱింగియు నొక్కింతకాలంబు ప్రతివాక్యం బిచ్చితి దీని సంహింపం దగుదురు. మీయట్టివారలకుం బ్రియం బగునేని నెప్పుడైన విడువం దగినశరీరంబు విడుచుట యేమి దుర్లభంబు. అధ్రువం బయిన యీదేహంబుచేతం గీర్తిసుకృతంబుల నెవ్వం డార్జింపకుండు నతండు పాషాణాదులకంటె నతికఠినుండు. మీయట్టి పుణ్యశ్లోకులచేతఁ గాంక్షింపబడిన శరీరం బప్రమేయధర్మార్జితంబు. ఏదేహంబుచేత సకలభూతంబులు శోకానుభవంబున శోకించు హర్షానుభవంబున హర్షించు నట్టిమహాకష్టదైన్యాకరం బైన శరీరంబు కాక శునకసృగాలాదులపాలుగాకుండ మేలయ్యెనని నిశ్చితాత్ముండయి దధీచి దత్త్వావలోకనంబుచేత నిరసిత బంధనుండై బుద్ధీంద్రియమానసంబులతోఁ గూడినక్షేత్రజ్ఞునిఁబరబ్రహ్మస్వరూపం బైన భగవంతునందు నేకీభూతంబు సేసి యోగజ్ఞానంబున శరీరంబువిడిచెను. అప్పు డింద్రుం డతనిశల్యంబుల విశ్వకర్మనిర్మితంబైస[1]నిశితశరధారాసమావృతంబై వెలుంగువజ్రాయుధంబుఁ గైకొని భగవత్తేజోపబృంహితుండయి యైరావతారూఢుండై సకలదేవోత్తమగరుడగంధర్వఖచరకిన్నరకింపురుష

1 పదనుగల నాఱంచులు గలది.

సిద్ధవిద్యాధరపరిసేవితుండై సకలముని జనంబులు వినుతింపఁ
ద్రిలోకహర్షకారియై భగవదనుగ్రహసంప్రాప్తమహోత్సాహ
వికసితవదనారవిందుండై వృత్రాసురుపై నడచె నప్పుడు. 357

ఉ॥ వృత్రుఁడు దానవాన్వయపవిత్రుఁడు [1]లోకజిఘాంసకక్రియా
సూత్రుఁడు [2]విగ్రహాగ్రహణ సుస్థిరవాక్యవివేకమానచా
రిత్రుఁడు [3]దేవతోరగదరీకృతవక్త్రుఁడు రోషదూషితా
మిత్రుఁడు శత్రుసేనఁ గని మిక్కిలి యైనయుగాంతకాకృతిన్.

క॥ మెండు గలదనుజనాయక
మండలములు గొల్వ నడచె మహితోద్ధతి వే
దండములసదుముఁ జనునడ
గొండయునుంబోలె నిబిడగోపోద్ధతుఁడై. 359

క॥ కాలగళుఁ డడిరి కడువడిఁ
గాలునిపైఁ గవయుసూడ్కి ఖరతరరవసం
చాలితపూర్వదిగంతరుఁ
డై లీల మహేంద్రుమీఁద నతఁ డరిగె నృపా! 360

వ॥ ఇట్లు రుద్రగణంబులు మరుద్గణంబులు నాదిత్యగణంబులు నశ్వి
దేవతలుఁ బితృదేవతలు విశ్వేదేవులు వహ్నియమనైరృతివరుణ
వాయుకుబేరేశానాదులు సిద్ధసాధ్యకిన్నరకింపురుషగరుడ
గంధర్వఖేచరప్రముఖంబులగు నింద్రసైన్యంబులతోడ నముచియు
శంబరుండును ననర్వుండును ద్విమూర్ధుండును వృషభుండును
సంబరుండును హయగ్రీవుండును శంకుశిరుండును విప్రచిత్తియు
నయోముఖుండును బులోముండును వృషపర్వుండును హేతియుఁ
బ్రహేతియు నుత్కటుండును ధూమ్రకేశుండును విరూపాక్షుం

---

1 లోకము సంహరించు పనికిఁ బ్రారంభకుఁడు. లయకర్త యనుట,
2 పోరు చేయుట నిశ్చలమైన మాట, జ్ఞానము, మానము, నడవడి గలవాఁడు,
3 దేవతలనెడి పాములకుఁ గొండ గుహవలె నున్న నోరుగలవాఁడు, దేవతా
భక్షకుఁడన్నమాట.

డును గపిలుండును విభావసుండును నిల్వలుండును బల్వలుండును దందశూకుండును వృషధ్వజుండును గాలనాభుండును భూతసంతాపనుండును వృకుండును సుమాలియు మాలియు మున్నగు దైతేయదానవయక్షరాక్షసాద్యసంఖ్యంబు లగు వృత్రాసురబలంబు లంతంత దలపడి సరమంబు సేసిరి. అప్పుడు. 361

చ॥ అసురులకున్ సురావలికి నయ్యె మహారణ మప్పు డొండొరుల్
ముసలగదాసికుంతశరముద్గరతోమరభిందిపాలప
ట్టిసపటుశూలచక్రముల రేవలు సూపియదల్చి యార్చుచున్
మసలక కప్పి రస్త్రముల మార్కొని మంటలుమింట నంటఁగన్.

క॥ ఒండొరులఁ గడవ నేసిన
[1]కాండము లాకాశపథముఁ గప్పి మహోల్కా
దండంబు లొలసి నిష్ఠుర
భండనముఖ మొప్పెఁ జూడఁ బ్రళయోచితమై. 363

చ॥ సురవరు లేయుబాణములు సూడ్కి కగోచరమై నభస్స్థలం
[2]బఱిముఱిఁ గప్పి [3]రేసి దివసాంతముఁ జేసినలీల నాసురే
శ్వరబలయూథవీరులను సాయకపంక్తులచేత వాని రూ
పఱ శతధూళిఁ జేసి పఱపై నతమం బొనరించి రార్చుచున్. 364

చ॥ సమరమదాంధులై సురనిశాచరవీరులు సైనికాంఘ్రిసం
క్రమితమహీపరాగములు గ్రమ్మిన నుమ్మలికంపుఁజీఁకటుల్
దమకనుదోయి కడ్డముగఁ దార్కొనినం జల మేది పోరి రా
క్రమితనిజాంతరంగపరిఘట్టితరోషమహాగ్ని పెంపునన్. 365

క॥ అతిగళితరక్తధారా
క్షతములతోఁ గానఁబడిరి సైనికులు మహో
ద్ధతరోషవహ్నికీలలు
వితతంబై పెల్లగిల్లి వెడలెడిభంగిన్. 366

---

1 బాణములు, 2 దట్టముగా, (తొఱ్ఱుమాఱుగా, మిక్కిలి వెంటనే), 3 రేసి = విజృంభించి.

సీ॥ రవణించు [1]శింజినీ టంకారరవములు
భటసింహనాదంబుఁ బరిఢవింప
భీషణోద్దామహయ హేషావిఘోషంబు
కరిబృంహితస్ఫూర్తిఁ గ్రందుకొలుప
సమరనిస్సాణకాంస్యశంఖనినాదంబు
నేమిస్వనంబుల [2]నిహ్నవింపఁ
దుముల మై చెలఁగెడు దుందుభిధ్వానంబు
లట్టహాసంబుల నాక్రమింప

తే॥ ఘటితశస్త్రాస్త్రనిష్ఠుర ఘట్టనోత్థ
ఖరతరోగ్రోరువిస్ఫులింగంబు లడరి
దివ్యకోటీరమణిఘృణిధిక్కరింప
సమర మొనరించి రసురులు నమరవరులు. 367

వ॥ ఇట్లు ప్రళయసంరంభవిజృంభితసముత్తుంగతరంగితభైరవారావనిర్ఘాతనిష్ఠురమహార్ణవంబునుం బోలె, యుగాంతసంక్రాంతఝంఝాపవనపరికంపితదీర్ఘనిర్ఘాతనిబిడనిష్ఠురనీరదంబులుంబోలె, నుభయసైన్యంబులుం గలసి సమరంబుసలుపుసమయంబున యుగాంతకృతాంతసకలప్రాణిసంహారకారణలీలయుంబోలెఁ బదాతిరాహుత్త*సామంతరథికమహారథికవీరులొండొరులు చండగతిం గాండంబులు పఱపుచు, గదలం జదుపుచుఁ, గత్తులఁ గత్తళంబులఁ జినుఁగం బొడుచుచు, నడిదంబుల నఱకుచుఁ, గుంతంబులం గ్రుచ్చుచు, కుఠారంబుల వ్రచ్చుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులం బోఁదుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, [3]సబళంబుల నొంచుచు, సురియల మెఱముచు, శూలంబులఁ దుఱుముచు, వాజుల కుఱికియుఁ వాలంబుల నఱికియుఁ దోడలు తుండించియుఁ దొండంబులు ఖండించియు మెడ లెడయించియు మెదళ్లు గెడయించియు నడుములుద్రుంచియు నాసికలుద్రెంచియుఁ బదంబుల

---

* గజారోహ—అని పాఠాంతరము.

1 వింటినారి, 2 మఱుగు పఱుపఁగా, 3 సబడియను ఆయుధవిశేషము,

విఱిచియుఁ బార్శ్వంబులం జఱచియు గజంబులఁ బఱిపియు గాత్రంబుల [1]మఱిపియుఁ గుంభంబులఁ బగిలించియుఁ గొమ్ములఁ బెకలించియు హస్తంబులఁ దుండించియు నంగంబులఁ జించియు రథంబుల సలియించియు రథికులం గూలియించియు సాధుల జంపియు సైంధవంబులఁ దంపియు, శిరంబునొగిలించియు [2]సీసకంబు లగిలించియు ఛత్త్రంబుల నుఱుమాడియుఁ జామరంబులం దునుమాడియు సైన్యంబులఁ జిదిపియు సాహసుల నెదిపియు, నడుములు ద్రుంచియు మఱియును బరస్పరగుణానిచ్ఛేదనంబున నన్యోన్యశోదండఖండన పటుత్వంబును నుభయసైంధవ ధ్వజసారథిరథికరథవికలనంబును నొండొరుల పాదజానుజంఘాహస్త మస్తకనిర్దళనంబును రక్తమాంసమేదఃపంకసంకలితసమరాంగణంబును నై యతిఘోరభంగిం బెనంగిరి. అప్పుడు. 368

చ॥ సమజయముఁ [3]సమాపజయసామ్యపరిశ్రమముఁ సమోరువి
క్రమము సమాస్త్రశస్త్రబలగర్వము నై కడు ఘోరభంగి నా
నముచివిరోధిసైన్యగణనాథులతోడ నిశాచరేశ్వరో
త్తములు దురంబు సేసి రొగిఁ దార్కొని వృత్రుబలంబు ప్రాపునన్.

వ॥ అప్పుడు. 370

లయగ్రాహి॥ మొత్తముగఁ బాఱు పెను నెత్తురుమహానదులఁ
దత్తరముతోనుఱికి తుత్తుకలు మోవం
జిత్తముల నుబ్బి వెస నెత్తుకొనుభూతముల
నత్తుకొని శాకినులు జొత్తిలుచు మాంసం
బుత్తలముతో మెసఁగి నృత్తములు సేయుమద
మత్తఘనఢాకినులు వృత్తగతిఁ బ్రేవుల్
[4]బిత్తరములందిగిచి మెత్తమెదడుల్మ్రొనసి
గుత్తగొనుచుండభయవృత్తిఁ [5]గలనొప్పెన్. 371

---

1 మఱిపి=మాటుపఱచి, 2 కిరీటములను, 3 సమమైన, అపజయ=ఓటమిచే, సామ్య = సమత్వముగల పరిశ్రమయు, 4 తొట్రుపాటు, 5 యుద్ధము.

వ॥ ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి త్రేతాయుగంబు సొచ్చునంతకాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయుచుండ, నంత వృత్రాసురుభుజబలంబు పెంపునఁ దెంపు సేసి కంపింపక నిలింపులపై రక్కసులు గుంపులై పెంపుచూపి మహావృక్షపాషాణగిరిశిఖరంబులు వర్షించిన. 372

మ॥ గిరిపాషాణమహీజముల్ గురియఁగా గీర్వాణు లన్నింటి ని
స్థిరనారాచపరంపరల్ వఱపుచున్ జూర్ణంబుఁ గావింప ని
ర్భరలీలం దమచేయుసత్త్వములు దోర్భంగంబులై పోవఁగాఁ
దెరలన్ రాక్షసయోధవీరుల మదోద్రేకంబు సంభిన్నమై. 373

క॥ ప్రచురముగ రాక్షసావళి
[1]ఖచరులపై నేయునిబిడకాండావళి దు
ర్వచనుఁ డెడనాడుమాటలు
సుచరిత్రునియందుఁబోలెఁ జొరవయ్యె నృపా. 374

వ॥ అప్పుడు. 375

వనమయూరము॥ అంత సురలేయునిబిడాస్త్రములపాలై
పంతములు దక్కి హతపౌరుషముతో ని
శ్చింతగతి రక్కసులు సిగ్గుడిగి భూమిం
గంతుగొని పాఱిరపకారపరులార్వన్. 376

క॥ కొండలఁ బోలెడురక్కసు
లొండొరులం గడవఁ బాఱి [2]రుక్కఱి పటుకో
దండముఖసాధనంబులు
భండనమున వైచి దివిజపతు లార్వంగన్. 377

వ॥ ఇట్లు సమరతలంబు వాసి తనప్రాపుమాని తీసి పఱచుచుండు దండనాయకులం జూచి యకుటిలమతిం బకపక నగి వృత్రాసురుం డిట్లనియె. 378

---

1 దేవతలు, 2 ఉక్కు + అఱి = బలముతగ్గి.

ఉ॥ [1]తుల్లతవృత్తి మీ కగునె శూరుల కిమ్మెయిఁ గీర్తిభోగముల్
గొల్లగఁ జేయు చావుమదిఁ గోరినవారల కైనఁ గల్గునే
తల్లడ మంది యీసమరధర్మము మాని తలంగఁ బాడియే
మల్లురఁడు దుర్దమప్రథనమత్తుఁడు వృత్రుని పాఱుటుంగరే. 379

క॥ చావు ధ్రువ మైనప్రాణికిఁ
జావులు రెం డరసికొనుఁడు సమరమునందుం
భావింప యోగమందును
జావంగా లేని చెడుగు చావుం జావే. 380

అధ్యాయము ౧౧

వ॥ అని వాసుదేవ తేజోవిశేషవిశేషితుండై దవానలకీలలం బోలె వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాఱెడు నసురుల వెనుకొని తఱుము సురవీరులం జూచి హుంకరించి స్వర్గానుభవంబున నిచ్చలేకుండె నేని మదవలోకనస్పర్శనమాత్రంబు ముందరనిలుతురు గాక యని యేచి కల్పాంతానల్పఘనఘనాటోపంబునుం బోలెఁ గఠోర కంఠహుంకారతర్జనంబులం గర్జిల్లుచుఁ బ్రళయకాలపవనపరి భావితమహాశిఖిశిఖావళులఁ దృణీకరించు కుటిలావలోకనంబుల నాలోకించుచుం గాలపరిపక్వలీలాలోలుం డయిన శూలి పోలిక నాభీలమూర్తియై సకలజీవభారభరణదుర్భరభగ్నబ్రహ్మాండ భాండమహాధ్వానంబుభంగి [2]నాస్ఫోటించిన. 381

ఉ॥ కూలెఁ జగంబు లన్నియును గ్రుంకిరి సూర్యసుధాంశు, లద్రు లూ టాడె, నభస్థ్సలం బగిలె, నంబుధు లింకె, నుడుగ్రహాళి ప ట్టూడె, వడిం దిశల్ వగిలె నుర్వర క్రుంగె, నజాండభాండ మ ల్లాడె, విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుఁడు బొబ్బ వెట్టినన్.

లయగ్రాహి. కూలిరి వియచ్చరులు సోలిరి దిశాధిపులు
వ్రాలి రమర వ్రజము దూలిరు రగేంద్రుల్

1 నీచపుఁబని, 2 పగులఁ గొట్టిన.

ప్రీలిరి మరుత్తు లెద జాలిగొని రాశ్వినులు
కాలుడిగి రుద్రు లవ లీలబడి రార్తిఁ
వ్రేలిరి దినేశ్వరులు కీలెడలినట్లు సుర
జాలములు పెన్నిదుర పాలగుచు ధారా
భీలగతితోడఁ దమ కేలిధనువుల్ విడిచి
నేలఁబడి మూర్ఛలను దేలిరి మహాత్మా! 383

వ|| ఇట్లు కఠోరకంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి బిట్టు మూర్ఛిల్లిన దివిజరాజ సైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగ దుర్ధముండై మహీవలయంబు పదాహతంబుల గడగడ వడంక నిశితశూలంబు గేల నంకించుచు మదించిన భద్రమాతంగంబు కమలవనంబు చొచ్చి మట్టి [1]మల్లాడువిధంబున నిమీలితాక్షుండయి తనపదతలంబు రూపంబులు మాయక జమురుచు వెక్కసంబుగఁ గ్రీడించువానింగని వజ్రి వజ్రతోపమనిష్ఠురగదాదండం బాభీలభంగిఁ బ్రళయకాలమార్తాండచండపరివేషప్రేరితంబుగాఁ ద్రిప్పి వైచిన. 384

మ|| అది మింటం బెనుమంట లంటఁ బఱపై యాభీలవేగంబునం
గదియన్ వచ్చిన లీల వామకరసంక్రాంతంబు గావించి పె
ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కాఠిన్యోరుపాతంబులం
జదియన్ మోఁదె గజేంద్రమస్తకమునుత్సాహైకసాహాయ్యుఁడై.

ఆ|| అగ్గజంబు కులిశహతిఁ గూలుకులమహీ
ధ్రంబుఁ బోలె రక్తధార లురల
మస్తకంబు వగిలి మదమఱి జిరజిరఁ
దిరిగి భీతితోడఁ దెరలి పఱచె. 386

ఉత్సాహము. గజము దెరలి దాని కొఱలి కంప మొంది పాఱఁగా
భజన నింద్రుఁ డంకుశమునఁ బట్టి బిట్టు నిల్పుచు

1 త్రొక్కి చిందరవందర చేయు.

న్నిజసుధారసైకపాన నిర్ణయార్ద్రికరమునన్
ఋజుత మీఱ నిమిరె నదియు రీతి మెఱసి క్రమ్మఱన్. 387

వ॥ ఇవ్విధంబున నైరావతంబును సేద దేర్చుచు నెదుర నిలుచున్న భిదురపాణిం గని తోఁబుట్టువుఁ జంపిన తెంపుఁ దలంచి మోహశోకంబున [1]విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థియై వృత్రుం డిట్లనియె. 388

శా॥ నాకుం బెద్దయు నీకు సద్గురువు దీనత్రాతరక్షున్ శుభ
లోకుం జంపితి విట్లు పాపమతివై లోభంబుతో నియ్యెడన్
లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ లోనైతి వీశూలమం
దాకంపింపఁగ నిన్ను గ్రుచ్చి ఋణముక్తాత్ముండనై పేర్చెదన్.

క॥ ఎట్టితులువయినఁ గానీ
నెట్టన తన బ్రదుకుకొఱకు నీవలె గురువుం
జుట్టమును బుణ్యు బ్రాహ్మణుఁ
బట్టి వధింపంగఁ గలఁడె పశువుం బోలెన్. 390

చ॥ దయయును సత్యమున్ విడిచి ధర్మమువాని యశంబుఁబాసి శ్రీ
జయములఁబాఱఁదోలి పురుషత్వము గానక లోకనిందితా
హ్వయుఁడగువానిచావునకు నార్యులు గుందుదురే సృగాలముల్
ప్రియమున నంటునే శవముఁ బ్రేలక చేరునె కంకగృధ్రముల్.

క॥ నిక్కమగు పాపములచేఁ
జిక్కితివి నిశాతశూలశిఖరాగ్రమునన్
మక్కించి నీదుమాంసము
నక్కలుఁ గుక్కలును జేరి నమలనొనర్తున్. 392

ఉ॥ [2]దీకొని నీకు నేఁడిచట దిక్కని వచ్చినవారు గల్గిరే
నేకమతిం బిశాచముల కెల్లను దృప్తిగ మన్నిశాతశూ
లైకమహాగ్నికీలల ననేకవిధంబున సోమయాజినై
మేఁకలజేసి వ్రేల్చెద నమేయ మదోద్ధతి వ్రాలి యియ్యసిన్. 393

---

1 వికృతముగా. 2 వ్యాపించి (ఎదుర్కొని).

క॥ శాకసనుంకులిశధారల
దీక్షాన నిర్జింపఁ గలిగి తేనిఁద్రబభూతో
ద్రేకంబు సేసి శూరుల
ప్రాకటపదపద్మధూళి భాగంగగుదున్. 394

సీ॥ సందేహ మేటికి జంభారి వేవేగ
భిదురంబు వేయుమా భీలభంగి
నహిలోభి నడిగిన యర్థరాశియుఁబోలెఁ
*గడపకు మిది వృథగాదు సుమ్ము
మురమర్దనుని తేజమున నాదధీచిపీ
ర్యాతిశయంబున నధిక మయిన
యదిగాన హరిచే నియంత్రితోన్నతుఁడవై
గెలువుము శత్రుల గీటడంచి

ఆ॥ యెందుఁగలఁడు విష్ణు డందుజయశ్రీలు
పొందుగాఁగవచ్చి పొందుచుండు
గాన భక్తవరదుఁ గమలాక్షు సర్వేశు
పదములందు మనముఁ బదిలపరతు. 395

వ॥ ఇపుడు వజ్రధారలం ద్రెంపంబడిన విషయభోగంబులు గలవాఁడ నయి శరీరంబువిడిచి భగవద్ధామంబునొందెద. నారాయణుని దాసుండనైన నాకు స్వర్గమర్త్యపాతాళంబులంగల సంపద్భోగంబులు నిస్పృగింపంబడవు. త్రైవర్గికాయాసరహితంబైన మహైశ్వర్యంబు ప్రసాదించుంగావున ననుపమేయంబైన భగవత్ప్రసాదం బన్యుల కగోచరం బద్దేవుని పాదైకమూలంబుగానుండు దాసులకు దాసానుదాసుండ నగుచున్నవాఁడ నని యప్పరమేశ్వరు నుద్దేశించి. 396

చ॥ అరయఁగ భక్తపాలనము లైన భవద్గుణజాలమాత్మ సం
స్మరణము సేయవాక్కు నిను సన్నుతిసేయ శరీరమెల్లఁ గిం

* గడవలేనిది వృథగాదు సుమ్ము—అని పాఠాంతరము.

కరపరివృత్తిసేయ మదిఁ గాంక్షయొనర్చెదఁగాని యొల్ల నే
నరిది ధ్రువోన్నతస్థలము నబ్జజుపట్టణ, మింద్రభోగమున్. 397

ఉ॥ ఆఁకలిగొన్న [1]క్రేపులు రయంబున నీఁకలురాని పక్షులున్
దీకొని తల్లికిన్, మఱి విదేశగతుండగు భర్తకుంగడు
వ్యాకులచిత్తయైన జవరాలును, దత్తఱమందుభంగి నో
శ్రీకర! పంకజాక్ష! నినుఁ జేరఁగ నామది కోరెడుం గదే. 398

క. నాకునుసఖ్యము పుణ్య
శ్లోకులతోఁగాని తత్త్వశూన్యులు సంసా
రైకవిమోహులతోడం
గాకుండనొనర్పుమయ్య కంజదళాక్షా! 399

వ॥ అని పలుకుచు. 400

## అధ్యాయము ౧౨.

మహాస్రగ్ధర॥ హరిపై సర్వాత్ముపై నత్యగణితగుణుపై సంతరంగంబు పర్వన్
సరిమేనుప్పొంగఁజావున్ జయమును సరిగా సంతసంబంగనుచున్ భీ
కరుఁడై కాలాగ్నిపోలెం గనలుచుఁగవిసెన్ గర్వదుర్వారుఁడై దు
ర్భరలీలన్ భూమి గంపింపఁగ దిశల ద్రువన్ ఖండనోద్దండవృత్తిన్.

క॥ దారుఁగొని ప్రళయోదకమున
హరిపైఁ గైటభుఁడు గవియు హంకారమునన్
సురసాధుమీఁద వృత్రా
సురుఁడు మదోద్వృత్తి నడచె [2]శూలాయుధుఁడై. 402

శా॥ కల్పాంతాగ్నియుబోలె నుల్కలెగయంగాఁ ద్రిప్పుచున్ దీన నో
యల్పా! చావు మటంచు శూలమురయం బారంగఁబై వైచినం
బోల్పం గోటిరవిప్రకాశత దివిం బోవంగ వీక్షించి యా
వేల్పుల్ పొంగఁగ వజ్రధారఁదునిమెన్ విన్నాణ మొప్పారఁగన్.

---

1 క్రేపులు=లేగలు, 2 ఉల్కలు=ఆకాశమునుండిపడు రేఖాకార తేజములు.

ఆ॥ శూల మప్పు డతఁడు స్రుక్కక ఖండించి
పూని రోసి కదిసి భుజము ద్రుంచె
నసుర వనలి యేకహస్తుఁడై పరిఘంబు
కొని మహేంద్రుఁ [1]గిట్టి హనువు లదిచె. 404

వ॥ ఇట్లు ప్రళయకాలభీషణపరివేషవేషంబుగా రోషంబునం బరిఘంబుఁ ద్రిప్పి కుప్పించి గజకుంభస్థలంబు భగ్నంబుసేసి యింద్రు హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొప్పించిన. 405

క॥ గజము మదముడిగి తిరుగుచు
గుజగుజ్జై గీఁకపెట్టఁ గులిశము నేలన్
[2]భజనసఁ జెడి విడిచె నింద్రుఁడు
గజిబిజితో నగడె నసుర కడిమి జగంబుల్. 406

క॥ కరుణుఁడు దివిజనాథము
కరణిన్ వృత్రాసురేంద్రుఁ కడిమికి లోనై
తిరుగుడువడ్డహరిం గని
పుర పుర నాహోయటంచుఁ బొగిలె జగంబుల్. 407

వ॥ అప్పుడు. 408

ఆ॥ గజముపాటు సూచి కడు దీనగతిఁ జూచి
పవిశరంబు జాఱి పడుటఁ జూచి
యుద్ధధర్మ మఱఁగి యున్న శత్రునిఁ జూచి
సిగ్గుతోడ వజ్రి శిరము వాంచె. 409

వ॥ ఇట్లు యుద్ధంబున శత్రుసన్నిధిం గరంబు జాఱిపడినవజ్రంబుఁ బుచ్చికొనక నివ్వెఱపడి లజ్జించి యున్న పాకశాసనుం జూచి వృత్రుం డిట్లనియె. 410

క॥ దురమునఁ [illegible]టువు నవలిన
శరణన్నను వైరిజనులఁ జంపరు వీరుల్

1 సవిూపించి, 2 భజన = హత్తుగడ (పొందు).

వెఱఁ గంద నేలకులిశము
కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితి నింద్రా! 411

సీ. వజ్రంబుఁ గైకొని వైరి నిర్జింపు మి
ట్లడలంగ వేళ గా దమరనాథ!
యమర దేహాధీను లైన సమస్తుల కెల్ల
నీశు లక్ష్మీశు సర్వేశుఁ బాసి
కడలేరు జయములు గల్గునె యెంతైనఁ
దలపోసి చూడుమా తత్త్వబుద్ధి
నీలోకపాలకు లెవ్వనివశగతి
వలఁ బక్షిపతుల వర్తనమున
తే. జిక్కి చేష్టలు సేయుచుఁ జింతగాంతు
రట్టిమృత్యుబలంబుల నాత్మజయము
తమదిగాఁ గోరి [1]యజ్ఞానతంత్రులగుచుఁ
గమలలోచనుఁ లీలావికారములను. 412

తే. మెఱయ యంత్రమయం బైనమృగముభంగి
దారునిర్మితమైనట్టి తరణిపోల్కి
శక్ర యెఱుఁగుము యీ భూతజాల కెల్ల
దళితపంకేరుహాక్షుతంత్రంబు గాఁగ. 413

వ. మఱియు భూతంబులచేతను నింద్రియంబులచేతను నవసుప్తైన పురుషుండు ప్రకృతిచేత వేఱుసేయంబడిన యాత్మకుం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండును. అవిద్వాంసుం డైనవాఁ డనవరతంబుఁ దన్ను స్వతంత్రుంగాఁ దలంచుచుండును. భూతంబులవలన భూతంబులు పుట్టుచుండును. ఆ భూతంబులు భూతంబులచేత భక్షింపంబడుచుండు. పురుషున కాయువు శ్రీయును గీర్తియు నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంత

1 అజ్ఞానములోఁబడి.

గాలంబు ప్రాప్తం బంతగాలంబు నివసించు. ప్రాప్తంబు దీఱినఁ బురుషుండును జాలింబొందిన నవి యుండక పోవుచుండును. కావున గుణంబులును వగుణంబునుఁగీర్త్యపకీర్తులును జయాపజయంబులును సుఖదుఃఖంబులును జావుబ్రదుకులును సమంబులై కలుగుచుండును. అజ్ఞానస్థితుఁడైనవానికి సత్త్వరజస్తమోగుణంబులు గలిగి యుండు నట్టివానికి గుణమయంబులైన యింద్రియంబులై యాత్మ యని తోఁచుచుండును. కావున వాఁడాగుణంబులచేత బద్ధుండగును. ఆగుణంబులకు సాక్షిమాత్రంబగు శరీరంబు వేఱని యెవ్వఁ డెఱుంగు నట్టివాఁడాగుణంబులచేత బద్ధుండు గాఁడు. కావున గుణంబులును గుణియును భోక్తయును భోగ్యంబును జయంబును నపజయంబును హర్తయును హార్యంబును నుత్పత్తిస్థితిలయకర్త స్రష్ట సర్వేశ్వరుండైన యప్పరమేశ్వరుండె కాని యన్యంబు లేదు. ఇప్పుడు నా హస్తంబు నాయుధంబునుం బోయినను భవత్ప్రాణాపహరణంబునకు సమర్థుండ నగుచున్న నన్నుం జూడుమని వృత్రాసురుండు మఱియు నిట్లనియె. 414

తే॥ వాహనంబు[1]లాసనమ్ములు వాఁడిశరము
యక్ష[2]ములు గ్లహము లసువులె[3] యొడ్డనములు
గాఁగ నాడెడు నీ [4]ద్యూతకర్మమందు
నెఱుఁగఁ జయమును నపజయ మెవ్వఁ డెఱుఁగు. 415

ఉ॥ అనవుడు వృత్రుమాటలకు నద్భుతమంది సురేంద్రుఁ డెంతయుం
దనమదిఁ [illegible]తం బుడిగి దైవముగా నతనిన్ భజించి కై
కొనియెఁ గరంబునన్ దిగువఁ గూలినవజ్రము నప్పు డాత్మలోఁ
దనరఁ జగంబు లన్నియు ముదంబునఁ బొందిరి ఖేచరావళుల్.

* వాహనంబులు సారెలు వాఁడిశరము—అని పాఠాంతరము. ఈపాదమున గణభంగమున్నది - 'సనములు' - అనిన దోషము పోవును.

1 ఆసనమ్ములు = పాచికలాడుపలకలు "వాహానాసనః" అనిసంస్కృతము, 2 అక్షములు — పాచికలు, 3 పందెములు, 4 జూదము.

క॥ [1]రాహుగ్రహవక్త్రగుహా
గేహాంతము వాసి వచ్చి కిరణావళిస
ద్బాహుళ్య మొప్ప వెలిఁగెడు
[2]నాహస్కరుఁడుఁ బోలె హరి యొప్పె నృపా! 417

వ॥ ఇట్లు కరకలితవజ్రాయుధరుఙ్మండలమండితదిఙ్మండలుం డయిన జంభారి గంభీరవాక్యంబుల విస్మయమందస్మితముఖారవిందుం డయి వృత్రున కిట్లనియె. 418

క॥ ఓదానవేంద్ర! నీమతి
వేదాంతముఁబోలెఁ దత్త్వవిజ్ఞానకళా
మోదము; నీవతిభక్తుఁడ
వాదిమపురుషునకు హరికి నబ్జాక్షునకున్. 419

ఉ॥ లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముఁ జేసి, ప్రాణులన్
[3]భోగులఁ బెట్టి యెల్లెడలఁ దీప్తులు సూపెడివిష్ణుమాయ నేఁ
డేకమతిం దలంచి; తిదియేల మహాసురరూపు మాని సు
శ్లోకుఁ బురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు నింపునన్.

ఉ॥ ఏనియమంబు సల్పితివొ యెట్టిమహాతప మాచరించితో
పూనిరజోగుణాభిరతిఁ బొందిననీమతి [4]శాంతిదాంతిస
మ్మాననమానసానుభవమత్తమరాళముఁ డగోషభావస
మ్మానుఁ డమేయుఁ డాదనుజమర్దనుభక్తి యొసంగె నెంతయున్.

క॥ నారాయణరూపామృత
పారావారమునఁ దేలుభక్తుఁడు దాభూ
దారకరఖాతకోదక
పూరంబులు నేలతృప్తిఁ బొందుమహాత్మా! 422

1 రాహుగ్రహముయొక్క నోరనెడి గుహరూపమయిన యిల్లు వెడలి, 2 సూర్యుఁడు, 3 భోగము—సుఖము, 4 శాంతి దాంతి గుణములయాదరముకల, మనస్సనెడి మానస సరస్సుయొక్క యనుభవముచే మందించిన హంస.

